# పురాణవైర గ్రంథమాలా పీఠిక

ఇవి పురాణవైరమను శీర్షికతో వ్రాయబడుచున్న పదునాలు నవలలు. ఏనవల కానవలే. పదునాలింటను కలిసి ఒక పేకథ యుండదు. ఒకదానితో నొకదానికి సంబంధ ముండదు. కొన్నింటియందు సంబంధమున్నను, అది ప్రధానము కాదు. కాని ఈ నవల లన్నింటికి కలిపి పురాణవైరమన్న శీర్షిక ఎందులకు? పురాణ వైరమన్న పే రెందులకు?

ఈ విషయము ఈనవలలో నచ్చటచ్చట పరామర్శింపబడును. మనకు వేదశాస్త్ర పురాణేతి హాసములు గలవు. వానిలో పురాణమున్నది. పురాణ మనగా నేమి? "పురాణం పంచలక్షణం" అని మనవా రన్నారు. పురాణ మైదు లక్షణములు కలది. సర్గము, ప్రతిసర్గము, మన్వంతరములు, రాజవంశములు, అనువంశములు, అని ఈ అయిదు లక్షణములు పురాణములయం దుండును సర్గమనగా మొదట జరిగిన సృష్టి లక్షణము, మహాప్రళయము జరిగిన తరువాత తొలిసారి సృష్టియొక్క స్వరూప మెట్లుండునో అది సర్గము. తరువాత కొన్ని కొన్ని ప్రళయములు జరుగును, అప్పుడు మరల సృష్టి జరుగును. దానిపేరు ప్రతిసర్గము. మన పురాణములలో ఒక మనువు చెరువునకు స్నానమునకు పోయినట్లు, ఒక చేప తన్ను రక్షించుమని అడుగగా, దానిని తన చెంబులో తీసుకొని వచ్చెను. అది చెంబునకు పెద్దదై నాకు ఈ చెంబు చాలుటలేదనగా పెద్ద పాత్రలో వేసెను. అట్లు పెరిగి పెరిగి సముద్రములో బడవేయదగినంత దయ్యెను. ఆ చేప ఆ మనువుతో కొలది దినములలో సముద్రములు పొంగి భూమి మునిగిపోవును. లోకములో నున్న జీవరాసులలో ఒకొక్క

జీవరాశి కొక్కొక్క వ్యక్తిగా తీసికొనివచ్చి నాపైన నెక్కుము. ప్రళయాంతమున మరల సృష్టిగి నిలుపుదువుగాని అని చెప్పగా నతడట్లు చేసెను. ఇది ప్రతిసర్గము. అనగా మహత్తు అహంకారము మొదలగు వాటినుండి మరల సృష్టి జరుగ లేదు. మహదహంకారాదులనుండి జరిగెడు సృష్టి సర్గము. తత్పూర్వమందున్న జీవరాసులయొక్క ప్రతులు మిగిల్చి వానినుండి మరల సృష్టి సాగుట ప్రతిసర్గము. బైబిలులో 'నోవాస్ ఆర్క్' అని యున్నది. నోవా అనువాడు ఒకయోడలో జీవరాసులయొక్క ప్రతులను తీసికొని వచ్చినట్లు దాని వలన మరల సృష్టి ప్రారంభమైనట్లు చెప్పబడినది. అది ప్రతి సర్గము. సర్వ విద్యలు సర్వజ్ఞానము యితర దేశములకు భారత దేశమునుండియే వెళ్ళినవి. అట్లు వెళ్ళిన జ్ఞానములో బైబిలు లోని కథ యొకభాగము. మూడవది మన్వంతరములు. కృత త్రేతా ద్వాపార కలి యుగములు నాల్గు కలిసినచో నొక మహాయుగము. ఇట్టి మహాయుగములు 71 జరిగినచో నొక మన్వంతరము. అట్టి పదునాల్గు మన్వంతరములు జరిగినచో నప్పుడు మహాప్రళయము వచ్చును. ఈ లెక్క ఎక్కడ ? పాశ్చాత్యులు మనకు నేర్పెడి చరిత్రలోని లెక్క ఎక్కడ? అల్పమైన యూహగల వారి మార్గమును మన మనుసరించు చున్నాము. నాల్గవది రాజవంశము. సృష్ట్యాదియందు గల సూర్య చంద్రవంశ రాజుల చరిత్రములు మన పురాణము లలో నున్నవి. అనువంశములనగా వారినుండి కలియుగములో వచ్చిన బహు రాజవంశముల చరిత్రము. ఇది నేడు చరిత్ర యను పేరున కళాశాలలలో పాఠశాలలలో చదివింపబడు

విషయము. దానిని పాశ్చాత్య చరిత్రకారులు పలువిధము లుగా మార్చి పాడుచేసి వారి యిష్టమువచ్చినవి చదివించు చున్నారు. మన పెద్దలు వాని ననుసరించుచున్నారు. మనకు చరిత్ర జ్ఞానములేదని పాశ్చాత్య పండితులు నేర్పిరి. వారి ననుసు చదివిన మన ఇంగ్లీషు పండితులు దానిని ప్రతిదినము చెప్పుచున్నారు. కొందరు నిజమే యనుకొనుచుండిరి. ఏ గూటిచిలుక ఆగూటిపలుకే పలుకునని యీ ఇంగ్లీషు చదువే చదివి పాశ్చాత్య సంప్రదాయమునందే దగుల్కొన్న బుద్ధులు వారి మాటలే విశ్వసించుటలో దప్పేమియు లేదు.

ఇంతకు చెప్పవచ్చిన దేమనగా మన పురాణములు చరిత్రయే. మన ఋషులకు చరిత్ర జ్ఞానములేదనుట, మన పూర్వ నాగరికతను ఎంత తక్కువ సరచినచో వారి ఏలుబడి అంత గొప్పగా సాగునని పాశ్చాత్యులు పన్నిన పన్నుగడ.

ఇంగ్లీషువారు క్రైస్తవులు, బైబిలునందు విశ్వాసము కలవారు. పాశ్చాత్య దేశములన్నియు నింతే వారి బైబిలులో సృష్టి క్రీస్తుపూర్వము రెండు వేలఏండ్ల క్రింద జరిగినది. నూటతొం బదియైదుకోట్ల సంవత్సరముల పూర్వము మనసృష్టి జరిగినదని మనవారు చెప్పుచున్నారు. ప్రతి సంవత్సరములో పంచాంగ మును తీసి చూడుడు. సృష్ట్యాది గతాబ్దాః సృష్టి మొదలు పెట్టిన తరువాత గడచిన సంవత్సరములు. అవి ఎన్ని ? నూట తొంబదియైదుకోట్ల పై చిల్లర. కలిగతాబ్దాః కలిలో గడిచిన సంవత్సరములు. అవి ఎన్ని ? అయిదు వేల అరువది. ఇట్లు మన జ్యోతిష్కులు. సంవత్సరము సంవత్సరము లెక్కపెట్టుకొని వచ్చుచున్నారు. దానిని కాదనుట ఎట్లు ? పాశ్చాత్యుల

బుద్ధి ప్రమాణ మెట్లు? క్రీస్తుశకము 1960. మరి పదిలక్షల సంవత్సరములు జరిగిన తరువాత క్రీస్తుశకము నెట్లు లెక్కపెట్టుదురు? వేలమీదనున్నప్పుడు లెక్కపెట్టవచ్చును. లక్షలు కోట్లైనప్పుడెట్లు? క్రీస్తు పూర్వమున లెక్కవేసినను, కోట్ల మీదనున్న సంఖ్య వారి నెమరుకురాదు.

మన కలియుగము ప్రవేశించినప్పటికే వారికి లెక్క కుదరలేదాయె. వారి సృష్టి అప్పుడు జరిగిన ట్లాయెను. ఇది ఏమి లెక్క! అయిదువేల అరువది సంవత్సరముల క్రింద కలి ప్రవేశించెనని పంచాంగములు చెప్పుచున్నవి. భారతయుద్ధమప్పుడు జరిగినదని భారతములో దాఖలాలున్నవి. ఆర్యభట్టు మొదలైన మనపూర్వ ఖగోళ శాస్త్రజ్ఞులు వ్రాసిపెట్టినారు. వాని నన్నింటిని పాశ్చాత్యులు కాదన్నారు. ఇంగ్లీషు నేర్చిన మన పెద్దలు వారినే విశ్వసించుచున్నారు. మనవాండ్రకు పురాణములయందు చెప్పబడిన సర్గ ప్రతిసర్గములయందు విశ్వాసములేదు. డార్విను సిద్ధాంతమునందు విశ్వాసము.

మన దేశములో కొందఱు పెద్దలీవిషయమును చాల పరిశ్రమచేసి పాశ్చాత్యుల సిద్ధాంతములు తప్పులని ఋజువు పరచినారు. టి. యస్. నారాయణశాస్త్రిగారు శంకరుని కాలము నిర్ణయించుచు ఈ విషయములను సమగ్రముముగా చర్చించి మహాభారతయుద్ధము సుమారు అయిదువేలఏండ్ల క్రింద జరిగినట్లు నిరూపించిరి. తరువాత నడింపల్లి జగన్నాధరావుగారు నిరూపించిరి! తరువాత కోట వెంకటాచలముగారు మన సర్వచరిత్రము విస్పష్టముగా విలిఖించినారు.

గ్రీకుల రచనలలో సాండ్రొకోటస్ అన్న మాట యున్నది. దానిని పాశ్చాత్యులు మౌర్యచంద్రగుప్తుడని యర్థము చెప్పినారు. దానిలో పురాణములలోని కలిరాజవంశ మంతయు తారుమారైనది. ఈయన గుప్తచంద్రగుప్తుడుగాని మౌర్యచంద్రగుప్తుడు గాడు. మనకు మగధరాజవంశ చరిత్ర యున్నది. కల్హణపండితుడు తన రాజతరంగిణిలో కాశ్మీర రాజ చరిత్రము పూర్తిగా వ్రాసినాడు. నేపాళ రాజవంశ చరిత్రము సమగ్రముగ గలదు. గుప్తచంద్రగుప్తుని వదలి పెట్టి మౌర్యచంద్రగుప్తు డనుటతో సర్వము నాశనమై పోయినది. పాశ్చాత్యచరిత్ర కారులు. ఈ సిద్ధాంతము అకాండ తాండవము చేసినారు. మనచరిత్రను వారియిష్టము వచ్చినట్లు మలచిరి. మన పండితులదియే చదువుచున్నారు. విద్యార్థులచేత అదియే చదివించుచున్నారు.

ఈ విషయము సమగ్రముగ తెలుగగోరువారు భారతచరిత్ర భాస్కర బిరుదాంకితులైన పండిత కోట వెంకటాచలముగారి గ్రంథములను చదువ వలయును. భారత యుద్ధము అయిదు వేల ఏండ్లక్రితము జరిగినదని తెలిసికొనగోరువారు, నడింపల్లి జగన్నాధరావుగారు వ్రాసిన మహాభారత యుద్ధకాలనిర్ణయమును టి. యస్. నారాయణశాస్త్రిగారు వ్రాసిన శంకరాచార్య కాలనిర్ణయములను చదువవలయును. ఈ రెండు గ్రంథములు ఇంగ్లీషు భాషలో వ్రాయబడి యున్నవి. ఆ గ్రంథములు గ్రహములయొక్క చారము, వాని లెక్కలు మొదలైన వానితో నిండియుండును.

ఈ చరిత్రను పలుమంది పాశ్చాత్యులుదిద్ది పాడు చేసిరి. పంక్తులు తప్పుచదివి దుర్వ్యాఖ్యానములుచేసి హిందు

వుల యొక్కయు, బౌద్ధులయొక్కయు వ్రాతలను పరిహాసించి దుర్మార్గములు చేసిరి. ఈ దౌర్మార్గ్యమును ప్రారంభించిన వాడు సర్ విలియమ్ జోన్సు. తరువాత చాలమంది పాశ్చాత్య చరిత్రకారులు వారి ననుసరించిరి. మన వేదాంతముల యం దభిమానముగల మాక్సుముల్లరుకూడా చరిత్ర విషయములో దుష్టముగానే వ్రాసెను. ఇంగ్లీషులో నొక సామెత యున్నది. Boold is thicker than Water.

ఇంతకు సప్తర్షి మండలముయొక్క గమనముమీద మహాభారత యుద్ధకాల నిర్ణయము చేయబడవలయును. ఇది పెద్ద కథ. పోనిండు. పురాణముల ప్రకారము చూచినచో సప్తర్షి మండల చారమునుబట్టి లెక్కకట్టినచో సాండ్రకోటస్ గుప్తచంద్రగుప్తుడని అంగీకరించినచో, నన్నియు సరిపోవును. సరిపోయెడు నీలెక్కయుండగా, సరిపోని లెక్కకట్టి పురాణములు తప్పనుటలోని దెలివి ఏమి? అందులోని న్యాయమేమి? దానియందలి విశ్వాస మిట్టిది.

ఆలెక్క ప్రకారము కలి ప్రవేశము మొదలు సంయుక్త పృథ్వీరాజుల కథ దనుక పాశ్చాత్యులు తారుమారు చేసిరి. ఆ కాలము అనగా షుమారు మూడువేలఏండ్ల కాలము. మహమ్మదు గోరీ వచ్చువఱకు మన చరిత్రలో పాశ్చాత్యులు చేసిన యవక తవకలు కాదని నవలల రూపమున నిరూపించుటకు చేసెడి ప్రయత్నమిది.

అందుచేత దీనికి 'పురాణవైర'మని శీర్షిక ఏర్పరుపబడినది.

# పీఠిక

ఇది ఆఱవ నవల. మౌర్యవంశపు చివరిరాజు బృహద్రథుఁడు. అతఁడు స్త్రీలోలుఁడై రాజ్యమునందు శాంతి లేకుండ జేయఁగా అతని సేనాపతి పుష్యమిత్రుఁడు — సామవేదీయ బ్రాహ్మణుఁడు అతనిని వధించి రాజ్యమును గ్రహించెను. ఈయన యశ్వమేధముచేసి సర్వభారత దేశమును దన యదుపులోనికిఁ దెచ్చి శాంతి నెలకొల్పి మఱల వైదిక మతమునుఁ బ్రతిష్ఠించెను.

అంతకు నాల్గువందల యేండ్లక్రింద నందుఁడు సర్వక్షత్రియ రాజవంశములను నిర్మూలించి దేశము శూద్రరాజము చేయఁగా బౌద్ధమతము వృద్ధి పొందెను.

పుష్యమిత్రుఁ డాస్థితినిఁ దొలఁగించి వేద మతమును స్థాపించెను. ఇది చరిత్రాంశము. తక్కినది కల్పన.

—: o :—

# అశ్వమేధము

## ౧

అది మహాబలిష్ఠమయిన యశ్వరాజము. దాని నాలుగు కాళ్లు కట్టివేయఁ బడినవి. ముట్టె కూడ బిగించి కట్టఁబడినది. దాని యొడలినిండఁ గశాఘాతములు కఱ్ఱదెబ్బలు తేలి యున్నవి. దాని ముట్టెవెంటఁ దేఱిన నురుసులు గడ్డకట్టి యున్నవి. దాని యొడలిమీఁద ఖడ్గపుఁ బోట్లున్నవి. కొన్ని గాయములలో నుండి క్రొత్త నెత్తురు, కొన్ని గాయములలో బిగిసిన నెత్తురు. ఆ గుఱ్ఱము నేలఁబడి యుండుటయే యాశ్చర్యము. ఇప్పటికిఁ గూడ నాగియాగి యెగుఱుచునే యున్నది. ఎగిరినప్పుడెల్లఁ గత్తిపోటు తినుచునే యున్నది. దాని నేత్రములనుండి వచ్చెడు క్రోధదృష్ట్లాగిపోయినవి. కాని యుండి యుండి యొకసారి కన్ను తెఱచును. ఆ కంటికాంతి పడినంత మేర దహించికొనిపోవునా యన్నట్లున్నది. కలిపి కట్టిన దాని నాల్గుకాళ్ళ ముడియు నొకవేళ సడలిచ్చునేమో యని మాటి మాటికి నా ముడినిఁ గూర్చి శ్రద్ధవహింపఁ బడుచున్నది. అది గుఱ్ఱము కాదు. సుంత ప్రాణము మిగిలిన శవము. ఇప్పటికయిన దాని కాళ్ళకుఁ గట్టిన ముడి సడలి యొక కాలు బైటికి వచ్చినచో నాకాలితో నది ఫెడేలునఁ దన్నినచో నిదివఱ కా యశ్వముచేత హతులైనవారి సంఖ్యకు మఱియొకటి చేరును.

అందుచేత దాని ప్రోథబంధనము కాని పాదబంధనము కాని సుంతయైన బిగువు తగ్గకుండఁ జూడఁబడుచున్నది. ఆ కట్లు సడలిపోకుండ దాని దగ్గఱికి మాటిమాటికి వెళ్లెడివారు ప్రతి పర్యాయము చావు తప్పి కన్నులొట్టపోయియే యీతలికి వచ్చుచున్నారు. వారిలో నెవ్వఁడును గుఱ్ఱము నేలమీఁదఁ బడియుండఁగాఁ బొరపాటుననైన దాని వీపువద్దకుఁ బోవుట లేదు. తన పృష్ఠభాగమున మనిసి నిలుచుండెనన్న జ్ఞానము దానికెంత సూక్ష్మముగాఁ గలుగునో చెప్పలేము. ఒక సైనికుఁ డచ్చట నిలుచుండుట యేమి; యీ యశ్వము వానినిఁ బసి కట్టుట యేమి; లిప్తైక దేశమున జరుగును. అట్లు కాళ్ళు కట్టఁ బడి పార్శ్వగతమై పండుకొనియున్న యీ యశ్వము లిప్తైక దేశమున హఠాత్తుగా నింత శీఘ్రముగా దొరలినదని చెప్పుటకు వీలు లేనంత శీఘ్రముగా నా వైపునకు దొరలును. వాఁడు దానిక్రిందఁ బడి నలిగిపోవును. ఇట్లు ముగ్గు రిదివఱకే హతు లయిరి. అందుచేత సాహసించి యెవ్వరు నా దెసకుఁ బోవుట లేదు. దానిచుట్టు ముప్పది నలుబదిమంది సైనికు లున్నారు. వాఁడొక్కొక్కఁడు దైత్యాకృతి. అందులో నిద్దఱు ముగ్గురు గుఱ్ఱమును సద్యోవధ కావింత మనిరి. తక్కిన వారు దానినిఁ గ్రమముగాఁ జావ నీయవలయు ననుచున్నారు. దాని హింస బృహద్రథునకును బుష్యమిత్రునకును బూసగ్రుచ్చి నట్లు చెప్పఁబడవలయు ననుచున్నారు. ఎవరు చెప్పవలయును? చెప్పెడివాఁ డచ్చట నిలుచుండి యున్నాఁడు. వాని స్థితికిని గుఱ్ఱపు స్థితికిని మిక్కిలి భేదములేదు. నాలైదు దృఢము

లైన బల్లెములు, గాఢముగా నేలలో స్తంభములవలె నాటఁబడి, నాల్గును బిగించి కట్టఁబడి, యా స్తంభమున కతఁడు బిగింపఁబడి కట్టఁబడెను. వాని యొడలిలో నోపిక లేదు. వాని ప్రాణములు వాని కనులలో నాడుచుండెను. వాఁడు చేతులును గాళ్ళును బాధాతిశయముచేతఁ గదలించుటకు వీలుఁ లేదు. కదలించినచో మఱల నొక క్రొత్తపోటు తగులును. వాఁడనుభవించుచున్న బాధ వానికిఁ జాలదా? ఇంకొక క్రొత్త కత్తిపోటెందులకు? వాఁడు కదలకుండ నుండుట వారి కంతటి వాంఛనీయమయిన విషయ మెందుకయ్యెను? వాని కదలికచేత బల్లెములతో నిర్మింపఁబడిన కంబము విసకిపోవునేమో యని భయము. వాఁడు కదలినచోఁ గంబము కంబముగానే నిలుచుండును. అతనికిఁ దాను బడుచున్న బాధ బాధగాఁ గనిపించలేదు. తన గుఱ్ఱము పడుచున్న బాధ వానినిఁ దలఁచుటకు వీలు లేని, యూహాకందని, మానవప్రపంచకమున కనుభూతికి రాని యే నరకలోకమునందో జీవుఁ డనుభవించెడి బాధ ననుభవింపఁజేయుచున్నది. ఒకానొకని కొక ప్రియురా లున్నది. ఆమె పరునిభార్య. దానిమీఁద నితనికిఁ గామము కొన్ని సంవత్సరములుగా నున్నది. ఆమెమీఁద నతనికిఁగల వాంఛ తీరుట యసంభవము. ఆమెభర్త యామెను సర్వదా రక్షించుచుండును. ఆమెకు నితనిమీఁద లోలోన నెచ్చటనో గోర్కె కలదు. ఎప్పుడో యాభర్త యామెను వదలి యెచ్చటికో పోవుట తటస్థించెను. ఆ సమయమున నతఁ డామెనుఁ బ్రోత్సహించెను. ఆమె నెచ్చటికో తీసికొని పోయెను. వారిద్ద ఱట్టి మహాపాపమునుఁ జేసిరి. ఆ యిద్దఱుజీవులు నరక లోకమునకుఁ

బోయిరి. యమలోకమున యమభటులు వారిద్దఱట్లొకరొక రినిఁ జూచుచుండఁగా హింసలు పెట్టుచుండిరి. ఇతఁడు చూడఁగా నామెను హింసఁబెట్టిరి. ఆమె చూడఁగా నితనిని హింసించు చుండిరి. అట్టి యాజీవుఁడు నరకలోకమున నెట్టి యాతన పడుచుండునో యా పురుషుఁ డట్టియాతన పడు చుండెను. ఆ యశ్వము నల్లింకకు హింసింతురు ? ఒక్కసారి నరికివేయుఁడని యాతఁడు వారిని రెండు మూఁడు సారులు ప్రార్థించెను. ప్రతి ప్రార్థనకు వానికిఁ గలిగిన ఫలితముగా చపేటము. మూఁడవచపేటము జరిగినపుడు వాని దంతములు రెండు రాలిపోయెను. ఆ నెత్తురు వాని పెదవుల వెంటఁ ప్రవహించి మెడమీఁద ధారగాఁ గట్టి వాఁడు తొడిగి కొనిన గళ ప్రదేశమునందలి యంగీపై బొందునం దింకి పోయెను. వాఁడు తుడుచికొనవలయు ననుకొనెను. తుడుచి కొనుటకు వీలు లేదు. ఏ పనిచేయుటకు వీలులేదో యాపని చేయవలయునన్న యూహ పొడముట యే యాశ్చర్యము. కాలుసేతులాడినపుడు మానిసి నిర్బంధితుఁడయి యున్నప్పుడు స్వేచ్ఛావిహారము సాగుచునే యున్నప్పుడు కూడఁ దన కసా ధ్యమయిన కోరికలు వచ్చును. ఆ యూహలకు నీ యూహ లకు భేద మున్నది. ఆ యూహాలు సద్యశ్శరీర గతకించి ద్దుఃఖ నివారణ భావజనకములు కావు. తన శరీరమునకు బాహిరము లయిన విషయములయొక్క యూహాలు. ఇప్పుడతనికి వచ్చు నూహాలు తన దేహమునందుఁ దేళ్ళు ప్రాకుచున్నవి. ఒడలు మండిపోవుచున్నట్లు కుట్టుచున్నవి. పాములు పెనవేసినవి. నడుము నడుమఁ గఱచుచున్నవి. అయ్యో! చేతితో నొక

చోటఁ గానిచో నింకొకచోట నయినఁ దుడిచికొనుటకు వీలు లేదే? మానవునియొక్క బాధ మానసికమయిన దధిక మైనదా? శారీరకమైన దధికమయినదా? మానసికమయిన దెంతయైన నోర్చికొనవచ్చునేమో? శారీరకమైన దెంతయైన నోర్చికొనుటకు సాధ్యముకానట్లున్నది. మానసికమయిన బాధ శరీరము నుడికించును. అణుపణువున నిప్పులలోఁ జొచ్చి పొరలించిన ట్లుండును. ఆ బాధ పిలితీణమయినది. ఎచ్చటనో యగ్ని యున్నది. ఆయగ్నియొక్క వేడి శరీరమునం దంతటను వ్యాపించుచున్నది. శరీరగత ప్రత్యణువునందుఁ దదౌష్ణ్యము సమానముగ ప్రసరించుచున్నది. నఖశిఖా పర్యంతము బాధ పడుచున్నాఁడు. ఆ బాధలో నొక సహ్యత యున్నది. శరీర గతమయిన యీ బాధలో నంతటి సహ్యతాగుణము లేదు. శరీరమునం దేకదేశమున నొకఁడు కత్తిపెట్టి పొడుచును. దాని పోట్లు శరీరమునందున నరనరములకు వ్యాపించును. మానసిక మయిన బాధలో నొడలియం దట్లు పోట్లు పొడుచుట యుండదు. ఒకానొక బాధ శరీరగత సర్వాణు పరివ్యాప్తమై యుండును. ఆ బాధ దేహమునందు సర్వత్ర యేకాకారము కలదిగా నుండును. దానియం దొక సహ్యత యున్నది. చేయి తీసికొనిపోయి సలసల క్రాఁగుచున్న నీళ్ళలోఁ బెట్టెదవు. చేయిమీఁదనున్న చర్మము మంగిపోవును. దాని బాధ తక్కిన శరీరమంతయు ననుభవించు చుండును. సర్వదేశమునందు సమానముగా బాధ యభివ్యాప్తమై యుండఁగా నొక దుస్థితి సర్వదేశమునందు వ్యాపించి, వ్యాపించిన ప్రథమదశయందు బాధయొక్క పరమ నిశితత్వ మనుభవించినను మఱునిము

సమునుండి యీ సర్వదేశమునకు నొక సమానమయిన స్థితి యుండును. ఏకదేశ గతబాధ యటువంటిది కాదు. తగులఁబడిన ప్రదేశము కత్తిదెబ్బతిన్న ప్రదేశము దానిబాధ యది పడుచు, సుస్థితిలోనున్న తక్కిన శరీరభాగమునందు నది పోట్లు పొడుచుచుండును. ఇది యధిక బాధాహేతువు. కారణ మేమనఁగా – మొదట గోరువెచ్చని నీళ్లు పోసి కొనుము. క్రమక్రమముగా నంతకంటె నధికాధికముగానున్న యుష్ణజలమునుఁ బోసికొనుము. చివరికిఁ బరమోష్ణమయిన జలమునుఁ బోసికొనినప్పుడు మిక్కిలి బాధయుండదు. దేహ ములో నొకచోట గాయము తగిలినది. ఆ భాగము చెడినది. తక్కినభాగము సుస్థితిలోనున్నది. ఆ సుస్థితిలోనున్న భాగము నకు నీబాధ మాటిమాటికి వ్యాపించుటచేఁత దక్కిన శరీర భాగమునందలి బాధ నిత్యప్రత్యగ్రమై యుండును. అది యధిక బాధాహేతువు. బాధయేకాని తత్పూర్వ బాధాస్వరూపము కలది గాదు. అట్టి బాధ నా జీవుఁడు పడుచుండెను.

ఇట్లుండఁగా నా యనుచరులలోని కొందఱు నా గుఱ్ఱ మును వెంటనే మడియించవలయునని పట్టుపట్టిరి. ప్రాణ ముండఁగాఁ జంపిన జంతువుయొక్క మాంసమే మేము తిందుము గాని శవముయొక్క మాంసమును మేము తిన మనిరి. మాన వులలో నాచారములవలనఁ గలుగు భేదము లనంతములు. కొందఱు చేపలు తిందురు. మాంసమునుఁ దినరు. వారికి మాంసమునుఁ దినెడివారియం దేవగింపు. కొందఱు కోడి గ్రుడ్లు తిందురు. చేపలనుఁ దినరు. మఱలఁ గోడిమాంసమునుఁ దినరు. వారు కోడిగ్రుడ్లు శాకాహార మందురు. మత్స్య

భుక్కులు కూడ మత్స్య మాంసము శాకాహార మందురు. కొందఱు కోడి మాంసమునుఁ దిందురు. లేఁడి మాంసమునుఁ దిందురు. మేక మాంసమునుఁ దిందురు. గొఱ్ఱె మాంసమునుఁ దిందురు. పందిమాంసమునుఁ దినరు. మొదటివారు పంది మాంసమునుఁ దినెడివారినిఁ దక్కువగాఁ జూతురు. పంది మాంసము తినెడివారు గొడ్డుమాంసమునుఁ దినెడివారినిఁ దక్కువఁగాఁ జూతురు. పాములనుఁ దిందురు కొందఱు. కప్ప లనుఁ దిందురు. వానపాములనుఁ దిందురు. కొందఱు సుళ్ళను వేయించికొని తిందురు. ఇది తిందు రిది తిన రన్న నియమ మేమి? కోతిమాంసమునుఁ దినెడివా రున్నారు. వైదిక మతే తరమయిన జాతులందఱు వైదిక మతస్థులమీఁద విరోధ మునుఁ బాటించు నప్పుడు వారంద ఱొక్కటియే. లేనప్పుడు వారిలోనున్న భేదములు వైదిక మతస్థులలో లేనే లేవు. వారందఱు యవనులు యుధిష్ఠిర యుగము ప్రాప్తించిన తరువాత ననఁగా గలియుగము ప్రవేశించిన తరువాత సుమారు పందొమ్మిదివందల పదునేను సంవత్సరములు గడచి నవి. మగధరాజ్యమున జరాసంధుని నాఁటినుండి మొదలు బార్హద్రథవంశము వేయి యిరువదొక్క సంవత్సరములు తరువాతఁ బ్రద్యోతవంశము నూఁటముప్పది యెనిమిది సంవ త్సరములు తరువాత శిశునాగ వంశము మూఁడువందల యిరువది యేండ్లు తరువాత నందుఁడు నతని కొమార్తైన మంత్రమునుఁ గలసి వందయేండ్లు, నటు పిమ్మట మౌర్యవంశము మూఁడువందల పదునాఱేండ్లును, రాజ్యము చేసెను. మౌర్య వంశపు రాజులు పన్నిద్దఱు. వారిలోఁ జివరి రాజు బృహద్రథ

థుఁడు. ఆయన రాజ్యమిప్పటికి నెనుఁబది రెండేండ్లు సాగినది. నందుఁడు కలి ప్రవేశించిన తరువాతఁ బదునేను వందల సంవత్సరములకు నార్యావర్తమునం దున్న సర్వ క్షత్రియవంశ నిర్మూలనముచేసి సర్వదేశమునకు బలవంతులయిన శూద్రులను రాజులనుగా జేసెను. మౌర్యులును శూద్రులే. వారిలోఁ జివరివాఁడు బృహద్రథుఁడు. అతఁడు వృద్ధు. కాముకుఁడు. ఆయన వయస్సు వందయేండ్లు. నందునియొక్క మంత్రిత్వ సేనాపతిత్వములు మహామంత్రియైన రాక్షసుని పాలనయం దుండఁగా నార్యావర్తమునఁ దక్కిన రాజులందఱు నందునికి వశవర్తులయి యుండిరి. ఆ రాజులందఱు నందునిచేత స్థాపింపఁ బడినవారే. నందునికెదురు తిరుగలేదు. తరువాత మగధరాజ్యమునఁ జాణక్యనీతి పరిపాలించెను. ఆ నీతియే మగధరాజ్యమును మౌర్యులు పాలించి నన్నాళ్ళు సాగెను. ఇతర రాజ్యములు మగధరాజ్యమునుఁ జూచి యనుసరించు చుండిరి. ఈ బృహద్రథుఁడు వచ్చిన తరువాత నతఁడు రాజ్యమును సరిగాఁ జూడక నిత్యము స్త్రీలోలుఁడై యుండుటచేతను బృహద్రథుఁడు బౌద్ధమతాభిమానులను బ్రాహ్మణేతరులను మంత్రులఁగా నియమించికొని రాజ్యము వారి కధీనము చేయుటచేత నార్యావర్తమునందలి తక్కిన రాజులు కూడ వారి యిష్టమువచ్చినట్లు ప్రవర్తింపసాగిరి. భారతదేశముయొక్క యీశాన్యదిశనున్న దేశము ఇప్పు డాఫ్ఘనిస్థానన్న పేరఁ బఱఁగు చున్న దేశము నాఁడు యవనరాజ్యములుగా నుండెను. యవనులనఁగా భారతదేశ నివాసులు కాకుండ నెక్కడో పుట్టినవారు కారు. ప్రథమ మానవసృష్టి యార్యావర్తమున

సరస్వతీ నదియొడ్డున జరిగెను. అది నూట తొంబదియైదు కోట్ల సంవత్సరములకుఁ బూర్వమున జరిగెను. ఎప్పటి కప్పుడు వైదికమతమునుండి భ్రష్టులయిన వారు దేశము నుండి తఱిమివేయఁ బడుచు వచ్చిరి. వారే యవనులు. వారీశాన్యపు టెల్లదాటి పోయి యచట నాటవికులుగాఁ బర్వతీయులుగా, ననాగరకులుగా బ్రదుకుచువచ్చి, కొన్నాళ్ళ కచ్చట రాజ్యములు స్థాపించికొని, తల్లిగడ్డమీఁద దండయాత్ర చేయుటయే జీవిత పరమార్థముగా భావించుచు మనుచు వచ్చిరి. ఎప్పు డెప్పుడు భారతదేశమునందున్న రాజులు బలహీను లగుదురో యప్పుడప్పుడు వారు దండయాత్రలు సాగించుచునే యుండిరి. పూర్వవంశములోని చివరివాఁడయిన యీ బృహద్రథ మహారాజు స్త్రీలోలుఁడగుటచేత రాజ్యము మంత్రుల యధీనములో నుండుటచేత నార్యావర్తములోనున్న తక్కిన రాజులుకూడ బలహీనులగుటచేత నీ యవనరాజులు పాంచాల, శూరసేన, కురు, మిథిలాది దేశములమీఁద దండెత్తి వచ్చుచుండుటయు, దోచికొని పోవుచుండుటయు జరుగు నుండెను. నేఁటి యాఫ్ఘనుస్థానము, బెలూచిస్థానము నన్ని ప్రదేశములందు యవనరాజ్యములైదు తత్కాలమునఁ బ్రసిద్ధముగా నుండెను. అవి యుత్తర జ్యోతిషము, దివ్యకటకము, సింహపురము, ఊరసదేశము, నివి బలవంతములుగా నుండెను. అభిసార దేశమని మఱియొకటి కలదు. ఈ యవనులలో మొదటి మూఁడు రాజ్యములు వైదిక మతేతరములైనను వైదికాచారములు కొన్ని యాచరించుచు వానియందుఁగొన్ని యభిమానము కలిగియుండునవి. అభిసారోరస దేశములు

పూర్తిగా మ్లేచ్ఛములు. ఉత్తర జ్యోతిష దేశస్థులు నవివక్షిత మయిన మాంసములనుఁ దినరు. ఊరసులు నభిసారులు నీ మాంసమన్న వివక్షలేక తిందురు. వారధిక క్రూరులు, నధిక దుష్టులు. ఈ గుఱ్ఱము చుట్టునున్న నలుఁబదినుంది యనను లలో ముప్పదిమంది యభిసారోరస దేశస్థులు. తక్కిన పది మందియు మిగిలిన మూఁడు దేశములవారు. ఉత్తర జ్యోతిష దేశస్థు లశ్వమాంసమునుఁ దినరే తినరు. దివ్యకటకుల కభ్యంత రము లేదు. సింహపురీయులు తిందురు. తక్కినవా రేమాంస మునుఁ బడిన నా మాంసమే తిందురు. చచ్చిన గుఱ్ఱపు మాంసమునుఁ దినమని యభ్యంతర పెట్టినవారు దివ్యకటకులు. దివ్యకటకు లందఱికంటెఁ బరాక్రమవంతులు. అభిసారోరస దేశస్థులు ఉలూయ సదృశులు. దివ్యకటకులకంటె, వారు బల వంతులే. వారి పరాక్రమముముందు వీరిబల మాగదు. అందుచే వారన్న వీరికి భయము. అవును, ప్రాణముండఁగనే చంపుదమని యంగీకరించిరి. బంధితుఁడయిన పురుషుఁడు దానినిఁ జంపకముందు తన్నుఁ జంపుఁడనెను. ఓయీ! ఆగుఱ్ఱము నాదికాదు. అది పరమోత్త మాశ్వము. దేవతాశ్వము వంటిది. అది మా మేనమామ పుష్యమిత్రునిది. ఆయన నన్ను మీరాజులకు నొక రాయబారపువార్త చెప్పు మనెను. ఆ గుఱ్ఱము నెక్కవలయునని నా కెన్నాళ్ళనో యుండి యున్నది. ఆ యశ్వము మా మేనమామలను దప్ప మఱియెవ్వని నధి రోహించనీయదు. నా యదృష్టము కొలఁది నన్నెక్కనిచ్చె యధిరోహింపనిచ్చెను. దాని నప్పుడప్పుడు నేనధిరోహింతు నన్న మాటయే మా మేనమామకుఁ దెలియదు. తెలిసినచో

నన్నిదివరకే సంహరించెడివాఁడు. ఆయనకు నాయందున్న ప్రేమయే యుండెడిది కాదు. ఆయన యీ రాయబారమునకు నన్ను వెళ్ళుమనినాఁడు. నా దురదృష్టము కొలఁది నేను బయలుదేరెడి దినమున నాయన యేదో పనిమీఁద గిరివ్రజపురమును వదలిపోయెను. నేను సాహిణీయైన సింహబలునికి లంచముపెట్టి సాయంకాలమునకుఁ దెచ్చి మందురలోఁ గట్టి వేయుదునని నచ్చఁ బలికి, నేనీ మహాప్రయాణమున వచ్చితిని. మా మామ వచ్చియుండును. కొట్టములోఁ గుఱ్ఱము కనిపింపకుండును. సింహబలుఁ డీపాటికే సంహరింపఁ బడును. ఈ రాయబారము నేను సమర్థముగా నిర్వహించి వెళ్ళినచో మా మామ నన్ను క్షమించునన్న యాశతో నీ గుఱ్ఱము నెక్కి వచ్చితిని. ఓయీ! నన్నుఁ జంపుడు. ఆ గుఱ్ఱమును వదలిపెట్టుఁడు. అది దాని యంతట గిరివ్రజపురమునకుఁ బోఁగలదు. నేను జచ్చినచో, నా మేనమామ దుఃఖించఁడు. ఆ గుఱ్ఱము చచ్చినచో నాయన దుఃఖించును. ఆయనకుఁ గోపము వచ్చును." అనఁగా వారిలో నొక్క డిట్లనెను "మీ మేనమామకుఁ గోపము రావలయుననియే యీ పనిచేయుచున్నాము. అతఁడు మగధరాజ్య సర్వసేనాపతి. వాఁడు బ్రాహ్మణుఁడు. వానిని సంహరించినఁ గాని భారతదేశమునకు ముక్తి లేదు. అదేమీ బ్రాహ్మణులు మీరే గొప్పవారనుకొందురు. బౌద్ధమతము పుట్టి యిప్పటికైదాఱు వందల యేండ్లయినది. మహాపద్మనందుఁడు సర్వ క్షత్రియులను నాశనము చేసెను. పీడ విఱుగడయై పోయెను. మీ బ్రాహ్మణ జాతి కూడ భారతదేశమునందు లేకుండఁ జేసినఁ గాని యీ

దేశమునకు విముక్తిలేదు. మీ బ్రాహ్మణులు లేనిచో మేమును దక్కినవార మొక్కటిగనే" యనుచు వాఁడు గుఱ్ఱపు మెడ నఱకెను. వాఁడొక మహా లులాయాకృతి. అంతటి బలిష్ఠుఁడగు వాని వ్రేటునకు గుఱ్ఱపు మెడ తెగలేదు. వాఁడొక్క వ్రేటులో గుఱ్ఱపు మెడ తెగనరక లేనందులకుఁ దక్కినవా రందఱు నవ్విరి. వానికిఁ బౌరుషము వచ్చెను. వానికిఁ గోపము వచ్చెను. వాఁడింకొక్క వ్రేటు వ్రేసెను. గుఱ్ఱపు మెడ తునాతునక లయ్యెను. అంతట వారందఱు గుఱ్ఱపుఁ జర్మము నొలువ నారంభించిరి. ఒలుచుట యైన తరువాత మాంసమును ఖండఖండములుగాఁ గోసిరి. నరములనుఁదీసి యాతల నుంచిరి. శరీరము నందుఁ బరిహరించఁదగిన భాగములన్నియుఁ బరిహరించిరి. ఆ హరింపఁదగిన మాంసమును ముద్దలు ముద్దలుగాఁ జేసి తమ డాళ్ళను బోర్లించి వానిపై నుంచిరి. అటు నిటుపోయి కట్టెల నేరికొని వచ్చిరి. నిప్పు ముట్టించిరి. అది మండ నారంభించెను. బల్లెములకు గ్రుచ్చి యా మాంసఖండములనుఁగాల్చిరి. అంతయు నయిన తరువాత బంధితుఁడైన పురుషునకు నా మాంసమునుఁ దినుమని యందీయఁబోఁగా నతఁడు మొగమటు నిటు త్రిప్పుకొనెను. అతఁడు బ్రాహ్మణుఁడు. వాని పెదవులకు నీ మాంస ఖండమునుఁ దగిలించి బలవంతముగాఁ గొంత పెదవులలోనికిఁ జొప్పించి వికావిక నవ్వుచు వారి యొక్క దైత్యత్వమును సంపూర్ణముగాఁ బ్రదర్శించు చుండిరి. వారిలో నుత్తరజ్యోతిషు లిద్దఱు కలరు. వారి కశ్వమాంసము ఖాద్యముకాదు. వారు చిట్టచివరికి వారించిరి. వారిద్దఱును వదలిపెట్టి తక్కిన వారందఱు నా మాంసమునుఁ దినఁ

గలిగినంత తిని, తక్కినది మూటఁగట్టికొని యీ బంధితు నేమి చేయవలయునని విచారించిరి. వానిలో నొక్కఁ డిట్లనెను. "ఇతఁడు నిజముగాఁబోయి యీవార్త పుష్యమిత్రునకుఁ జెప్ప వలయునన్నచో నతఁడు ప్రస్తుతము ప్రయాణము చేయఁలేఁడు. ఆర్యావర్తమునకుఁ బాంచాల మీఁదివరనున్నది. మగధ మీఁదివలె నున్నది. అతనికి మనము వారము దినములు చికిత్స చేయించి వాఁడు ప్రయాణము చేయఁగల శక్తి వచ్చినపుడు వానికొక గుఱ్ఱమునిచ్చి పంపవలయును. లేనిచో మనము గుఱ్ఱమును వృథాగాఁ జంపినవార మగుదుము. పైన మన మీఁ యశ్వమును మనంతటఁ జంపలేదు. మన మండలము పర్వతమార్గములను రక్షించుటకు నేర్పడి యున్నవారము. మన యైదు రాష్ట్రములకు సమష్టిగాఁ బర్వత మార్గములను రక్షించుట కేర్పడిన శింతాకరాజుఁడు మనకిచ్చిన యాజ్ఞ చొప్పున నీ గుఱ్ఱమును వధించితిమి. వీనిని హింసింపుఁడని యాయన చెప్పలేదు. అది మన స్వాపజ్ఞక మే. శింతాకరాజుఁ డైనను వీనిని వధింపుమన్నది తనయంతఁ దాను జెప్పలేదు. మన రాజులనుఁ గనుగొని వారిచ్చిన యాజ్ఞయే మనకిచ్చి నాఁడు. ఇతనిని వీని గుఱ్ఱమునుఁ బది దినములు మనము బంధించి యుంచితిమి. శింతాకరాజుఁడు వీఁడు తెచ్చిన రాయబారమును మన యైదుదేశముల రాజులకుఁ బోయి వినిపించి వచ్చెను. ఆ రాయబారమేమో మనకుఁ దెలియదు. కాని యతఁడు వీనిని సంహరించినచో బృహద్రథునకునుఁ బుష్య మిత్రునకును బుద్ధివచ్చునని చెప్పెను. దానినిఁబట్టి మనమిట్లు ప్రవర్తించితిమి. గుఱ్ఱ మేమయినదో వీఁ డేమైనాఁడో తెలి

యనిచో వారికెట్లు బుద్ధి వచ్చును? వారికిఁ దెలియవలయును. ఇది పుష్యమిత్రుని మక్కువగల గుఱ్ఱమని యితఁడు చెప్పెను. దీనితో నా పుష్యమిత్రునకు బుద్ధిరావలయును. వీనిని మనము వారము దినములు పోషించి చికిత్స చేయించి గుఱ్ఱము నొక దాసి నిచ్చి పంపుదము." అనఁగా మఱియొకఁడు "మనలో నెవని గుఱ్ఱమును వీని కీవలయును." ఇంకొక్కఁడు "మనమెందు కీవలయును? ఈ పాంచాలదేశమునందు గుఱ్ఱములే లేవా? ఒకదానిని దొంగిలించి వీని కిత్తము" మఱియొకఁడు వీఁడా గుఱ్ఱము నెక్కి పోవుచుండఁగా గుఱ్ఱమును గుర్తుపట్టి పట్టికొన వచ్చును. మనము వదలిన పనిని వారు చేయుదురు. వార్త పుష్యమిత్రునకుఁ జేరదు. "వేఱొకఁడు" ఆ దొంగిలించిన గుఱ్ఱమును మనము వాడుకొందము. వీనికి మన గుఱ్ఱములలో నొకదాని నిత్తము. వాఁ డప్పుడు సుఖముగ మగధకుఁ జేరును. పుష్యమిత్రునకు వార్తయు నందును.

అంతట నెవని గుఱ్ఱము నీయవలయునన్నచో నెవని గుఱ్ఱము నీయవలయునన్న ప్రశ్నలు పుట్టెను. ప్రతివాఁడును దన తన గుఱ్ఱమునుఁ దాను వదిలిపెట్టుట కిచ్చగింపలేదు. బంధితుఁడు నడుమ నడుమ సొమ్మసిలి పోవుచుండెను. నడుమ నడుమ స్మృతినందుచుండెను. ఆస్మృతి వచ్చిన సమయములలో నతనికి వారి కొన్ని మాటలు వినఁబడుచుండెను. ఇంతలో దివ్యకటకుఁ డొకఁ డిట్టు లనెను. ఠింతాకరాళుఁడు మనతో వీనిని సంహరింపుఁడని వచ్చెను. మనము మిక్కిలి తెలివిపోయి యీ పనినిఁ జేసితిమి. ఈ గుఱ్ఱమును మనమే తీసికొని వీనిని సంహరించినచో సరిపోయెడిది. అభిసారుఁ డొకఁ డిట్లనెను.

ఇప్పు డెవరిగుఱ్ఱము నిచ్చి సంపవలయునన్న ప్రశ్న యెట్టిదో యిప్పు డా గుఱ్ఱము నెవరు తీసికొనవలయునన్న ప్రశ్నయు నట్టిదే. అందుచేత దానినిఁ జంపుటయే మంచిది. ఉత్తర జ్యోతిషుఁ డొకఁ డిట్లనెను. 'అరే! మీ రశ్వమాంసఖాదులు. బలసి నిగనిగ లాడుచున్న గుఱ్ఱమునుఁ జూచువఱకు మీకు నోరూఱినది. బలిసిన సౌకుమార్యము వెలార్చుచున్న మానవునిఁ జూచినపుడు పిశాచములకు నోరూఱును. ఈమాటలతో నభిసార దేశీయులకుఁ గోపమువచ్చెను. 'మేము పిశాచులము. ఉత్తర జ్యోతిషులు దివ్య కటుకులు దేవతలు' వాఁడు దివ్య కటుకులనుఁ గలుపుటతో నుత్తర జ్యోతిషుల మువ్వురకు బలము చేకూరెను. అందులో దివ్యకటకుఁ డొకఁడు వివేకి. అప్పటికిని వారాఱుగురే యైనారు. అతఁడందుచే నిట్లనెను. 'మాలో సింహపురీయులనుగూడఁ గలుపవచ్చును.' ఈమాటతో సింహపురీయులు సంతోషించిరి. అభిసార దేశీయుఁడు మాటాడలేదు. వారు పదిమంది యైరి. వారు పదిమందియు నెదురు తిరిగినచో ముప్పది మందియు నేమియుఁ జేయలేరు. అపు డుత్తర జ్యోతిషుఁ డొకఁడు బంధితుని కట్లూడఁదీసి బల్లెములు పెకలించి యెవరి బల్లెములు వారికిచ్చి తన యొద్దనున్న తోలు తిత్తిలోని నీరు బంధితుని మొగమున గ్రుమ్మరించి వాని నోటిలోఁ గొంత జలమునుఁ బోసెను. స్మృతిలేని వేళఁగూడ నా బంధితుఁ డాజలము నుమిసెను. వారిలో నొకఁ డన్నాఁడు. వీఁడు బ్రదుకఁడు. వీనికి జల మిముడుట లేదు.' ఇంకొకఁడు 'అదికాదు. వాఁడు బ్రాహ్మణుఁడు. మన నీరు త్రాగఁడు' మఱియొకఁడు 'మనము వీనిని బ్రదికించుట యెట్లు? మన

జలమే త్రావనివాఁడు మనయన్నమును దినఁడు. ఈ వారము దినములు చూచితిమికదా వాఁడు వాని యన్నమును వాఁడు వండుకొనెను. వాని జలమును వాఁడే తెచ్చికొనెను. 'మఱి రొక్కఁడు వీనినిఁ గొండమీఁది నీటి గుంటవద్దకుఁ దీసికొని పోదము. వాఁడచట నీరు త్రాగును. క్రమముగా బ్రదుకును. మనలనుండి తప్పించికొని పోలేఁడుగదా! అట్లు చేసిరి. వారము దినములు గడచెను. వాని గాయములు కొంతవఱకు నెమ్మదించెను. వీరందఱు వానితో మాటాడుచునే యున్నారు. అతఁడు విడివిడిగా వారిలో నందఱి నామములు వారి గ్రామములు వారినిఁ గుఱించిన సర్వవార్తలు సేకరించికొనెను. అతఁడు మనసులో నిట్లు నిర్ణయించుకొనెను. నేను నా మేనమామ వద్దకుఁ బోనేపోను. పోయినచో నన్నతఁడు సంహరించును. ఆయనకీవార్త తెలియఁజేసెదను. నేను బ్రదికియున్నచో వీరిమీఁదఁ బగతీర్చికొందును. నేనొక్కఁడను వీరిమీఁదఁ బగ యెట్లు తీర్చికొందును? నేను గిరివ్రజమునకుఁ బోయి నా యుద్యోగమునందు మఱల నేను జేరినచో బృహద్రథ మహారాజు యవనరాజులమీఁద దండెత్తి వచ్చినచో నే నాసేనతో వచ్చి వీరిలోఁ గొందఱి సంహరించుటకుఁ బరమేశ్వరుఁ డనుకూలించినచో సంహరింతును. ఇప్పుడు నేను బోయి నా మామ యెదురఁ బడినచో నేను పగతోఁ దీర్చికొనలేను. నా వద్దనున్న ధనమును వీరు హరించిరి. వీరు తప్పకుండ నాకొక గుఱ్ఱము నిత్తురు. ఆ గుఱ్ఱము నమ్మి దానితో వచ్చిన ధనముతోఁ గొన్నాళ్లు బ్రదుకవచ్చును. తరువాతఁ బరమేశ్వరుని దయ. ఇది బ్రాహ్మణులకు యోగ్యమయిన కాలమని

కార్తాంతికులు చెప్పుచున్నారు. మింటియందు గ్రహము లన్నియు వైదిక మతమున కనుకూలముగాఁ జారము చేయుచున్నవఁట. వేద మతమున కనుకూలముగానున్న కాలము నాకు ననుకూలించునేమో?"

౨

గిరివ్రజపురమునఁ బుష్యమిత్రుని యింట నానాఁడు పెద్ద యుత్సవము. అదియొక పండుగ దినము. ప్రతిసంవత్సరమా పండుగకు నార్యావర్తమునందున్న సమస్త దేశములందున్న పండితులు గిరివ్రజపురమునకు వత్తురు. ఘనపాఠులు, క్రమపాఠులు, తార్కికులు, వ్యాకరణ వేత్తలు, కాపిలులు, జైమినీయులు, సర్వశాస్త్రవేత్తలు పుష్యమిత్రుని యింట సమకూడుదురు. ఎంతో వ్యయప్రయాసలకు లోఁబడి పుష్యమిత్రుఁ డిచ్చు భూరిసంభావనల నందుటకై సర్వదేశముల నుండి వత్తురు. పుష్యమిత్రుఁడు వారందఱిని గౌరవించును. శ్రౌతుల నాయన మఱియు గౌరవించును. ఐదాఱువందల యేండ్లుగా దేశమునందు యజ్ఞయాగాది క్రతువులయందు నిరాదరణ మేర్పడినది. క్రతువులు హింసా మూలకములన్న బౌద్ధ మతసిద్ధాంతము ప్రబలి రాజులందఱు బౌద్ధులయి, బ్రాహ్మణుల నాదరించెడివారు లేకపోయి, యెవఁడయిన సద్బ్రాహ్మణుఁడు యజ్ఞము చేయుటకు సంకల్పించినచో బౌద్ధమతానుయాయులు పదిమంది యచ్చటికిఁ బోయి

యల్లరిచేసి యా బ్రాహ్మణుని యజ్ఞమును బీభత్సము చేయు చుండిరి. 'రాజానుమతో ధర్మః' యనునట్లు రాజులందఱు బౌద్ధమతము నాదరించుటచేత బ్రాహ్మణులు నిరాశ్రయులైరి. వారి చదువులు క్షీణింప నారంభించెను. బౌద్ధపిటకములు చదివినవారే పండితులైరి. వేదశాస్త్రములు చదివిన వారికి దిక్కు దివాసు లేకపోయెను. ఎవఁడయిన వైదిక మతాభిమాని బహిరంగముగా బ్రాహ్మణుల నాదరించుటకుఁ గూడ భయపడ నారంభించెను. పూర్వము నందుఁడు సర్వ క్షత్రియవంశము లను నాశనముచేసెను. దానితో వేదధర్మమును రక్షించు ప్రభువు లంతర్హితులయిరి. ధరాపాలకులందఱు క్షత్రియేతరు లయిరి. క్షత్రియుఁడు కాని వానికి బ్రాహ్మణ ధర్మమునం దభిమాన మెందుకుండును? బ్రాహ్మణ ధర్మము రక్షించు టకు భగవంతుఁడు క్షత్రియుని సృజించెను. ఆ క్షత్రియుని నందుఁడు సంహరించెను. త్రేతాదియందుఁ బరశురాముఁడు సర్వక్షత్రియ నిర్మూలనము గావించెను. కాని యానాఁడు చాలమంది క్షత్రియులు మిగిలిరి. బ్రాహ్మణులు మఱల క్షత్రియవంశములను నిలఁబెట్టిరి. కాశ్యపుఁడు పరశురాముని వద్ద సర్వధాత్రియు దక్షిణగాఁ దీసికొని మఱల రాజుల కిచ్చి వేసెను. అంతటి మహాక్షత్రియ సంహార సమయమునందుఁ గూడఁ గోసలవంశము, జనకవంశము మొదలైన వంశములు నిర్మూలింపఁ బడలేదు. బ్రాహ్మణులే మఱల క్షత్రియులను నిలఁబెట్టిరి. మహానీతివేత్తయైన రాక్షసుని సాహాయ్య ముతో నందుఁడు క్షత్రియ సంహారమును గావించెను. తరువాతఁ జాణక్యుఁడు మురాసుతునకుఁ బట్టాభిషేకము

జేసి శూద్రరాజ్యమునే వృద్ధిపఱచెను. మా రాజయిన బృహద్రథుఁడు బౌద్ధుఁడుకాఁడు. వైదికుఁడుకాఁడు. అందు చేత బౌద్ధులు యథేచ్ఛముగా విహరించుచున్నారు. ఏ వర్ణస్థుఁ డయినను బౌద్ధుఁడు కావచ్చును. మంగలి కావచ్చును. శ్వపచుఁడు కావచ్చును. సూతుఁడు కావచ్చును. అందఱికి సులభముగా నున్నది. వేదశాస్త్ర పురాణములనుఁ దిట్టుట పరిపాటి యైపోయినది. ఇంతకు నీ బౌద్ధమతము సంపాదవ్య తెచ్చినవారు బ్రాహ్మణులు. ఈ బ్రాహ్మణులలోఁ గొందఱికి నీతియు - జాతియు లేదు. పండితులయి శాస్త్రరహస్యములఁ దెలిసికొని వేదరక్ష చేయుటకు బదులు వారి జ్ఞానమ సంతయు దుష్టమతములను సముద్ధరించుటకు వినియోగించిరి. అట్లు చేసిరి. బౌద్ధమతము విజృంభించినది. ఆ మతమునకు మ్లేచ్ఛమతములకును జాలదగ్గఱి సంబంధము. మ్లేచ్ఛమతము లకును వైదికమతమునకు నొక్కటియే భేదము. వైదికమతము నందు వర్ణాశ్రమాచార భేద మున్నది. మ్లేచ్ఛమతములం దీ భేదము లేదు. ఈ భేదము రెండు మతములకు నడుమఁగల యొక పెద్ద సముద్రమువలె భాసించుచున్నది. రెండు దేశము లకు నడుమ నొక మహాసముద్రమున్నచో నా దేశమునకు నీ దేశమునకు సంబంధము చాలదవ్వయినట్లు వర్ణాశ్రమా చార వ్యవస్థయున్నది. వైదిక వైదికేతర మతములను విభజించుచున్నది. మ్లేచ్ఛులందుఁ బలు తెగలు కలవు. వారిలోఁ బరస్పర ద్వేషములు పెక్కులు కలవు. వారి యాచార ములలో ననేకములయిన భేదములు కలవు. వారి మూల సిద్ధాంతమునందు సర్వమానవులు సమానము. అదిగొక

మాట. అది నిజముకాదు. దానిని మూర్ఖులయిన మానవులు విశ్వసింతురు. మహారాజు బౌద్ధుఁడు. వాని పుత్త్రుఁడు బౌద్ధుఁడు. మహారాజు తన పుత్త్రుఁడు పవానికి రాజ్యమును మించి యిచ్చెను. మహారాజు కుమార్తెను పుత్త్రపు వాని కుమారునికిచ్చి పెండ్లిచేయునా? వారొక వేళ ప్రేమించినచో నిద్దఱును లేచిపోవలయును. అందఱు సమానులని చెప్పెడి యీ సంఘమునందయిన నే దేశమునందైనను బరిస్థితి యిదియే. భేద మేమనఁగా వీఁడు భోజనము చేయుచున్నపుడు వాఁడు చూడవచ్చును. వానిని బ్రక్కఁ గూర్చుండఁబెట్టికొని వీఁడు భోజనము చేయఁడు. వాని లౌకికమయిన మర్యాద కది లోటు. మత సంబంధముగాఁ జేయుట కభ్యంతరము లేదని చెప్పెదరు. లౌకికమయిన భేదములచేత నట్లు చేయరు. చేసినచో మరియాద నష్టము. వాని గొప్పదనము పోవును. లోకమునందలి యీ గొప్పదన మెట్టిది? మనోనిర్మితమైనదే కదా! మత విషయకమైన భేదమును మనోనిర్మితమయినదే. ఈ మనోనిర్మితమైన భేదము మత సంబంధ మన్నచో ద్వేష్యమా? లౌకికములయిన ధనాధికారముల విషయమయినపుడు స్వీకార్యమా? ఏమి బుద్ధిహీనమయిన జాతి? సామాన్య మానవులను దుర్జనులెంత ప్రతారింతురు? నేను మహాసేనాపతిని. నేను బహిరంగముగా బ్రాహ్మణులను గౌరవించుచు [illegible] లేదు. [illegible] గాదనేవాఁ డెవ్వఁడును లేఁడు. ఎందుచేత? నా కధికార మున్నది కనుక. నేను ధనవంతుఁడను గనుక. రాజ్యము నాభుజాబలము మీఁద నాధారపడి యున్నది గనుక. నా వద్దకు వచ్చునప్పటికి బౌద్ధమత సిద్ధాం

నా వద్దకు వచ్చి యిచట దొడ్డిపని చేసికొనిన యున్నచో నేను సంతోషించి వానికింతను పెద్ద బహుమానమిత్తునని వాఁడనుకొని యుండవచ్చును. వాఁడు వేదములందలి సర్వ సిద్ధాంతములతోఁ బరిచయము కలవాఁడు, శాస్త్రజ్ఞానము కలవాఁడు, వాని వద్దకు వత్తును. నన్నుఁ జూచి భయపడి దూరముగా నుండును. ఈ వైదికబ్రాహ్మణునకు వచ్చిన యారాటము యెట్లు నివారింపఁబడును! ఎప్పుడు నివారింపఁబడును? వ్యక్తిగతమైన కాలము స్వభావసామాన్యముగను వచ్చునా? కొన్నియైన విషయములు తెలిసికొనుటకు నే నెంత ప్రయాసపడుచుంటినో వానికిఁ దెలియదు. వాఁడొక మూర్ఖుఁడు. వాఁ డిట్లు చేసెను. వాఁడు తిరిగి రానప్పటినుండి నాకుఁగల సందేహము నన్ను బాధించుచున్నది. ఒకప్పుడొక మహాజ్యోతిష్కుఁడు వానితో మాటాడుటకు వచ్చెను. నే నప్పుడు నా యీ గుఱ్ఱముమీఁద నింటికి వచ్చి దిగితిని. ఆ పండితుఁడు నాకు నమస్కరించెను. నా మేనల్లుఁ డతనిని మహాజ్యోతిర్విద్వాంసుఁడని నాతోఁ జెప్పెను. నేను నవ్వుచుఁ జమత్కారమునకు నా యీ గుఱ్ఱమును గుఱించి జ్యోతిష్యము చెప్పు మంటిని. ఆ పండితుఁ డెవ్వో లెక్కలువేసి యిట్లు చెప్పెను. ఈ గుఱ్ఱము కవల. ఇవి రెండు గుఱ్ఱములు. రెండు నాకారముచేత నొక్కటిగనే యుండును. మహా పౌరుషము

[illegible]

నిస్సూత్రమైనా బడ్డలేమ [illegible] గాఁదనేఁడనా డెవ్వఁడును లేఁడా.

ఎందుచేత? నా కధికార మున్నది కనుక. నేను ధనవంతుఁడను గనుక. రాజ్యము నాభుజాబలము మీఁద నాధారపడి యున్నది గనుక. నా వద్దకు వచ్చునప్పటికి బౌద్ధమత సిద్ధాం

యూయనకుఁ దెలియును. నా కా విషయమునం గంత సంశయింపు గలదని యూయన యనుకొనకపోవచ్చును. ఒక్క శ్రోతలకే నా చేతులతో నేను దక్షిణ లిత్తును. తక్కిన బ్రాహ్మణు లంతటి కెవరిచేతనో దక్షిణ యిప్పింతును. అందఱికి నేనే యిత్తునన్న చో నా బ్రాహ్మణుఁడు వచ్చినచో నాకుఁ గనిపించును—"పుష్యమిత్రుఁడా సంవత్సరము తన స్వహస్తములతో నొక్క శ్రోతలకే కాదు జ్యోతిర్వేత్తకుఁ గూడ సంభావన లిత్తు"నని చెప్పెను. ఆ బ్రాహ్మణులు గిరివ్రజ పురముఁ బదునేను దినము లుందురు. మహా సేనాపతి యొక నాఁడు శ్రోతలకు దానము చేసి మఱునాఁడు జ్యోతిర్వేత్త లకుఁ జేయుదు ననెను. ఆ మఱునాఁడు గుఱ్ఱముయొక్క జాతకము చెప్పిన బ్రాహ్మణునకు కనిపించెను. ఏమయ్యా! మా రెంతెన గుఱ్ఱముమాట చెప్పితివి కాదు." అని యడుగఁగా నా బ్రాహ్మణుఁడు 'ప్రభూ! ఆ గుఱ్ఱమును నాకుఁ జూపింపలేదు. తమకిక దానియందు శ్రద్ధ లేదనుకొంటిని' అనఁగాఁ బుష్యమిత్రుఁడా గ్రంథమును తెచ్చితివా? యని యడుగఁగా నా నా బ్రాహ్మణుఁడు తెచ్చితి ననెను. పుష్యమిత్రుఁడు "నా కిప్పుడు తీఱిక లేదు. ఇంక నైదాఱు దినములలో నీ బ్రాహ్మణు లంతఱు వెడలిపోదురు. నీవు తరువాత వెళ్ళుదువుగాని. నీ వంతటితోఁ బాటు సత్రములో భోజనము చేయవద్దు. నా యింటనే భోజనము చేయుచుండుము. ఆ నా గుఱ్ఱమును నా మేనల్లుఁ డెక్కి యెచటికో పోయెను. యవనదేశములకుఁ బోయి యుండునని నా కనుమాన మైనది. వెళ్ళి నెలనాళ్ళయినది. ఆ గుఱ్ఱ మేమయినదో. నాకుఁ దెలియదు. ఆ

గుల్మ మేమైనదో నాకుఁ జెప్పఁగలవా?" యనఁగా బ్రాహ్మ ణుఁడు లెక్కలువేసి "స్వామీ! ఆ గుల్మము వధింపఁబడి పదునేను దినము లయినవి. అది కొందఱినిఁ జంపి చచ్చెను. చావఁబోవుచుగూడ ముగ్గురినిఁ జంపెను." పుష్య — "నా మేనల్లుఁ డేమయ్యెను?" బ్రాహ్మణుఁడు- "అతఁడు బ్రదికియే యున్నాఁడు. ఇక్కడకు రాఁడు. పుష్య- "అసలే రాఁడా?" బ్రాహ్మణుఁడు-తమరు చాలఁ బ్రయత్నము చేసినచో నతఁడు మీకు లభింపవచ్చును. పుష్య: సరే నీవు పోకుము. ఇచటనే యుండుము. నీ దే దేశము? బ్రాహ్మణుఁడు 'మావి కోసార సేనములు' పుష్య – 'నీ విక్కడఁ గొన్నాళ్ళున్నచో మీ యింటికి ధన మేమైనఁ బంపవలయునా? పంపవలసినచోఁ బంపుదుము. నీవు కొన్నా ళ్ళుండవలసివచ్చును. "బ్రాహ్మ- చిత్తము. ప్రభువులవారియాజ్ఞ. ఇప్పుడేమియుఁ దొందఱ లేదు. ఇంటి కేదయినఁ బంపవలసిన యవసరము వచ్చినచో మనవి చేయుదును.' ఇంతలో నొక బ్రాహ్మణుఁడు వచ్చెను. అఁతన పుష్యమిత్రునితో నిట్లనెను. 'అయ్యా! తమరు మహాప్రభువులు. బ్రాహ్మణులు. బ్రాహ్మణాభిమానము కలవారు. ఈ రాజ్యమునఁ దనురుదక్క మాకొక గతిలేదు. నన్ను రక్షింపుడు. నాకు లేక లేక యొక కుమార్తె కలిగినది. దానికేనిమి దేండ్లు వచ్చి నప్పటినుండి నేనామెకు వివాహము చేయవలయునని యెన్ని ప్రయత్నములు చేయుచుంటినో నాకుఁ దెలియదు. వచ్చిన సంబంధములన్నియు వెనుఁదిరిగి పోవుచున్నవి. తరువాతఁ దరు వాత దానికిఁ గారణములు తెలియవచ్చెను. రాజుగారి సమీప బంధువులలోఁ గొందఱు దానికి వచ్చిన సంబంధ

ములు చెడఁగొట్టుచున్నారు. నే నేమియుఁ జదువుకొనిన వాఁడనుగాను. ఏదో సామాన్యమైన కర్మలు చేయించుచు జీవించుచుంటిని. నేను పండితుఁడను గాకపోయినను బ్రాహ్మణ మతమునందు నా కధిక విశ్వాసము. పరలోకము లున్నవని కర్మలు చేయవలయునని యజ్ఞయాగాది క్రతువులు స్వర్గ హేతువులనియు నిట్టి మాటలు చెప్పుచుండఁగా నన్ను వారం దఱు 'నానయ్యా! కర్మలు లేనిచో నీ వెట్లు బ్రదుకుదువు? పెండిండ్లు చేయించుచు నుపనయనములు చేయించుచు బియ్య ములు కూరలు సంపాదించుచు బ్రదుకుచున్నావు. నీ వింకెట్లు మాటాడెదవు? నీకు బ్రదుకుటయే పరమార్థమయినచో నీవు బౌద్ధమతమునఁ బ్రవేశింపుము. నీకు మేము వార్షిక మిత్తుము.' అప్పఁగా నేను వారి మాటలకు లొంగలేదు. ఇట్లా యేండ్లు గడచినవి. నా పిల్లకిపుడు పదునాలుగేండ్లు. నా బ్రాహ్మణ్యమే చెడిపోయినది. ఆపద్ధర్మముగా నయిన నిప్పుడు పెండ్లి చేయుటకనుకొనుచుండఁగా నా కూఁతు నొక బౌద్ధున కిమ్మని వారు కూర్చుండిరి. వాఁడు సచ్ఛూద్రుఁడయిన కాఁడు. ఎవఁడో పరమనీచ కులజుఁడు. నేను నా భార్యయును నా కూఁతురును బ్రదుకుటయే కష్టముగా నున్నది. ఈ మహానగరమునకుఁ దూర్పుదిశయందున్న మహాబౌద్ధ విహారమునకు మఱియుఁ దూర్పుననున్న యొక చిన్న పల్లియలో నా నివాసము. ఆ బౌద్ధ సన్న్యాసులు మంగళులు. మంచివాండ్రు, మా యింటికి వత్తురు. కాదనుటకు వీలులేదు. మంచినీళ్ళిమ్మందురు. నా కూఁతుతో సరాగము లాడుదురు. అయ్యా! బౌద్ధ సన్న్యాసు లలో మహానుభావు లెంతమందియో యున్నారు. ఇంద్రియ

సులను జయించిన వారున్నారు. మహాతపస్వులున్నారు. వారితోఁబాటు నెందుకుఁ బనికిరానినీచు లున్నారు. వారి సన్యాసము కావిగుడ్డలు కట్టికొనుట మాత్రమే. విహారములో వారి కుభయసంధ్యలయందుఁ దిండి సాగుచున్నది. వారు యాత్రి వెంట నచ్చుపోసిన యాఁబోతులవలెఁ దిరుగుచున్నారు. విహారములో వారు యోగ్యముగా ప్రవర్తింతురు. బయటికి వచ్చి యథేచ్ఛముగాఁ బ్రవర్తింతురు. నే నంగీకరింపక పోయినచో నా కూఁతు నెత్తికొనిపోదురు. వారు దానికి వివాహము చేయుదురుగా. తమదర్శనమునకు నే నెన్నియోసార్లు ప్రయత్నించితిని. నట్టి యప్పుడు నాకుఁ దమదర్శనమే లభింపలేదు. నే నొక జ్యోతిర్విద్వాంసుఁడనని యబద్ధము చెప్పి యిప్పుడిట్లో ద్వారపాలకులనుఁ దప్పించికొని వచ్చితిని. వాకిటిలోనున్న యధికారి జ్యోతిర్విద్వాంసులనుఁ బ్రశ్న వేయుచుండెను. ఆయన వేసెడి ప్రశ్న లెల్లప్పుడు, నొక్కవిధముగా నే యుండును. ఆ నాల్గు ప్రశ్నలును గుత్తపెట్టికొని వానికి సమాధానములు చెప్పించికొని వానిని వల్లించి యా యధికారినిఁ దప్పించికొని లోనఁబడితిని. ఇంకఁ బ్రభువు చిత్తము. నా వంశమును మీరు రక్షింపవలయును. నాకుఁ బురుష సంతాన మెట్లును లేదు. దాపిత్రుడైన నిన్ను తిలోదకములు వదలునేమోయని యాసపడుచుంటిని. ఇన్నాళ్ళుగా నీ వెందుకు రాలేదని తమరు ప్రశ్నించినచో మనవి చేసితిని గదా. మహాధికారులైన తమ దర్శనమునకు మమ్మువ్వరిని రానీయరు. మఱియు నీ రాజ్యములో నిట్టి యిక్కట్టులెంత మంది పడుచుండిరో? అందఱను దయతో మనవి చేసి

కొన్నచో నెంతమందికని తమరు సాహాయ్యము చేయుదురు? ఇది రాజపురుషులతోఁబని. తమరు రాజపురుషులతోఁ దల తన్నినచో గ్రుడ్డిగవ్వ చేయని మావంటివారి కొఱకు విరోధము పెట్టికొందురా? తమవంటి వారి బ్రాహ్మణ్యము సాగును. మావంటివారి బ్రాహ్మణ్యము సాగునట్లులేదు. ప్రభూ! ఈ దేశమునం దెంతమంది బలవంతముగా నిట్లు బౌద్ధమతమును స్వీకరింపవలసి వచ్చుచున్నది? పండితులయినవారు వారు చెప్పెడి నిర్వాణమునందు విశ్వాసముకలవారు సన్యాసులవుదురు, కాదు. బౌద్ధుఁడయినంతనే సన్యాసము పుచ్చుకొనవలయును. సన్యాసము పుచ్చుకొని బౌద్ధు లెంతమంది! వారిబౌద్ధమతము కావిగుడ్డలు ధరించుటతో మాత్రము సరిపోవుచున్నది. మొదటఁ గొన్నాళ్ళు ధరింతురు. తరువాతఁ బరిత్యజింతురు. ఒకసారి ధరించి విడిచిపెట్టినను నష్టములేదు. వారు భిక్షులేనఁట. సాయంకాలములందు మాత్రము కావిగుడ్డలు ధరించి విహారమునకుఁ బోయి యచట నెవరో చెప్పు పిటకమునో, వినయమునో విని వత్తురు. ఆ చెప్పెడివానికే తెలియదు. వీరికేమి తెలియును? ఈ బౌద్ధమతము ప్రళయముగా నున్నది. బ్రాహ్మణుఁడు జందెము తీసివేసి బుఱ్ఱగొరిగించికొన్నంతలో బౌద్ధుఁడు. తక్కినవారి కాబాధయే లేదు. ఒక బుద్ధునిబొమ్మనుఁ దీసికొనివచ్చి తమయింటిలోఁ బెట్టికొందురు. బుద్ధ విగ్రహముల వెల పెరిగిపోయినది. ధనవంతుఁడైనచోఁ బాలఱాతితో, నేన్గుదంతముతోఁ జేసిన బుద్ధవిగ్రహముఁ గొనును. కొయ్యతోఁ జేసిన బుద్ధవిగ్రహములు, మట్టితోఁ జేసిన బుద్ధవిగ్రహములు. స్వామీ! అంగడికిఁబోయి చూడవల

యును. ఆహార పదార్థములకంటె, వస్త్రములకంటె, మఱియు జీవితమున కుపయోగించు నితర పదార్థములకంటె బుద్ధవిగ్రహములు దొరకు సంగతులసంఖ్య యెక్కువ. బుద్ధుని కేశ మీపెట్టెలోనున్నది. ఆపెట్టె దంతముతోఁ జేసినది. లోనఁ బట్టునిపట్టుగుడ్డ కట్టఁబడియుండును. అందులో నొక చిన్న కేశఖండముండును. దానివల వంద బంగారు నాణెములు. బుద్ధుని యెముకయని, బుద్ధుని చితాభస్మమని, బోధివృక్షమాక్రింద నాయన నిర్వాణము పొందినస్థలము కొన్ని గజముల మేర పెద్ద గోయిత్రవ్వి మన్నుతీసినారఁట. ఆ మృత్తన్నపేరుతోఁ గొంత యెఱ్ఱమట్టి, కొంత నల్లమట్టి విక్రయించుచుందురు. స్వామీ! నేను చేసిన పొరపాటుమనగా నా వస్తువులనుఁ బోయి కొన్నచో నాకింత బాధ యుండెడిదిగాదు. కొందఱు వివేకులు తమ బ్రాహ్మణ్యమునుఁ దాము పాలించికొందురు. విహారమునకుఁ బోయి వినయసుత్తమును ధర్మసుత్తమును విని వత్తురు. ఈ వస్తువులు విహారములందు నమ్ముదురు. అచటికిఁబోయి యెంతయో ప్రేమతోఁ గొందురు. మన మతమును నిందించుచుందురు. వారికది చాలును. అప్పుడు వాని మెడలోనున్న జంధెమునకు స్పర్శింపు లేదు. నా కా నేర్పు లేకపోయినది. నాకీ దుర్దశ వచ్చినది." పుష్యమిత్రుఁడు "నీ కూతునకు మేనమామలుగాని మేనత్తలుగాని లేరా? వారి యింటికిఁ బంపించుము. బ్రాహ్మణుఁడు "నాయింటికి నీ యాతేండ్లనుండి దివారాత్రములు వారు కాపలా. అనినయొక యష్టదిగ్బంధనము." పుష్య:- "నాఁటి యిదివఱకే నీ కూతురు నెత్తికొనిపోయి వారేల పెండ్లి చేసికొనలేదు?" బ్రాహ్మణుఁడు

కొనుచునే యుందురు. తాఁ జెడ్డకోఁతి వనమెల్లఁ జెఱచెనని వారి పట్టుదల. మనము కూడ బౌద్ధులము కావలెననియే కాని, వారిలో భేదము గురిగింజంతలేదు. అందఱు సమానులనియే యందురు. ఏమి సమానులు? ఆ ధర్మసూత్రము వినయ సూత్రము మొదలైన గ్రంథములు చదివిన వారధికులు. తక్కిన వారధములు. ఆధిక్యము నధమత్వము వారి మతగ్రంథముల జదువుటమీఁద నాధారపడియున్నపుడు సర్వజనులు సమానులన్నమాట యెక్కడిది? సమానత్వము కోడిబుఱ్ఱలు చేయించి కొనుటలోనను, గావిగుడ్డలు కట్టికొనుటలోనను, బిచ్చ మెత్తుటలోనను?" పుష్య "సరే పోవయ్యా. మీ సంగతి తరువాత విచారింతుము." బ్రాహ్మణుఁడు 'అయ్యా! నా మెడ మీఁదఁ గత్తి సిద్ధముగా నున్నది. నా మాట తరువాత విచారింతుమనఁగా నేను జచ్చిపోయిన తరువాత నేమి విచారింతురు?" పుష్యమిత్రుఁడు దీర్ఘాలోచనామగ్నుఁడై కూర్చుండెను. కొంతసేపటికి కిట్లనెను. 'దీని ననుసరించుచున్న రాజపురుషు లెవరు?' బ్రాహ్మణుఁడు "మహారాజుగారి పినతల్లి కుమారుఁడు సింహకేతనుఁడును, మేనత్త కుమారుఁడు శ్వేతాశ్వుఁడును. ఈ పట్టుదల వారిద్దఱిది. నా మీఁద వారికింత విరోధమెందుకో నాకుఁ దెలియదు." పుష్యమిత్రుఁడు "విరోధము కాదయ్యా! ధనమదాంధత్వ లక్షణము. ఆలోచనతోఁ జేసినపని కాదు. వారికట్లు తోఁచినది. ప్రక్కనున్న వారెవరో చెప్పిరి. వారు కానిమ్మనిరి. అంతకంటె నధికమేమియు లేదు. నీవు మఱి కొన్నాళ్ళు సంబాళించి పోఁగలవా?" బ్రాహ్మణుఁడు "ప్రభూ! నా చేతఁగాదు." పుష్య "నేనిద్దఱు సైనికులను

నీ కిత్తును. వారు నీ కూతును నీ బావమఱంది యింటికిఁ దీసి కొని పోదురు. ఆ యూ రెంతదూరము ? ఆ యూరిలో నీ బావ మఱందుల కేమయిన బంధుమున్నదా ?" బ్రాహ్మ "ఇక్కడికిఁ బదియామడ దూరమున శృంగగిరియను పట్టణము గలదు. ఆ యూరిలో మాజ్ఞాతు లున్నారు. వారు ధనవంతులు. మా పిల్ల వచ్చుటకిఁ జేర్చినచో నీ ముప్పు కొన్నాళ్ళవఱకు గడచి నట్లే" పుష్యమిత్రుఁ డొక యుద్యోగినిఁ బిల్చి యీ సంగతిని జెప్పి నల్గురు సైనికులనుఁ దోడిచ్చి యీ పిల్లను శృంగగిరిలో వారి జ్ఞాతుల యింటిలో దింపి, రమ్మని యాజ్ఞాపించెను. ఆ బ్రాహ్మణుఁడు వెళ్ళిపోయెను. అశ్వజాతకము చెప్పిన బ్రాహ్మణుఁ డక్కడనే కూర్చుండెను. పుష్యమిత్రుఁ డాయ నతో నిట్లనెను. 'స్వామీ! తమరి నామధేయమేమి." అతఁడు నారాయణభట్టు." పుష్య "చూచితివా ఎట్లున్నదో? ఏ రాజ్యమునందు మానవులు స్వేచ్ఛగా బ్రదుకలేరో వారి మతమును వారవలంబింపరో వారి ధర్మమును వారాచరించ లేరో వారి యన్నమును వారు తినలేరో యీ రాజు రాజా? యది రాజ్యమా స్వామీ! వేదము లున్నవి. శాస్త్రము లున్నవి. ఉపనిషత్తులున్నవి. ఆరణ్యకములున్నవి. పురాణము లున్నవి, భగవంతుఁడు చెప్పిన భగవద్గీత యున్నవి. భారత మున్నది. వీనియందుఁ గంటె నధికమయిన జ్ఞానము సృష్టిలో నుండదు. ఉండుట సంభవించదు. ఆ మహార్థములను గ్రహించ లేక యవివేకులు దుష్టమతములనుఁ బట్టుచున్నారు. కలి కాలము విజృంభించినది. నన్నేమి చేయుమందురు ? రాజు క్షత్రియుఁ డయినచో రాజా! యీ బ్రాహ్మణ ధర్మము

రక్షించుటన విధియని నేను బోయి చెప్పుదును. కలికాలము యొక్క లక్షణ మెట్టిదనఁగా బ్రాహ్మణ ధర్మమును రక్షించెడి క్షత్రియజాతియందు బ్రాహ్మణధర్మ వినాశకుఁడైన బుద్ధుఁ డుదయించుట. కంచెయే చేను మేసినఁ గలదె దిక్కు? ఈ యనంతమైన కాలములో జరుగుచున్న విషయములనుఁ బర్యాలోచించినచో నాశ్చర్యముగ నుండును. ఆ బ్రాహ్మణ్యమును నాశనము చేయుటకు బుద్ధుఁడు క్షత్రియులలో జన్మించెను. తరువాత శూద్రుఁడైన నందుఁడు వచ్చి సర్వ క్షత్రియ వంశ నిర్మూలనము చేసెను. ఇది చమత్కారముగ లేదా? బ్రాహ్మణులను వాఁడు నాశనము చేసినచో వానికంటెఁ గ్రిందివాఁడు వచ్చి వానిని నాశనము చేసెను. నాలుగువందల ఏఁబది యేండ్లనుండి సర్వ భారతము శూద్రరాజ్యమయినది. తరువాత రాజ్యము చేయఁవలసినది యెవరు? ఇంకెవరున్నారు? మ్లేచ్ఛులు, యవనులు. ఉత్తరజ్యోతిష దివ్యకటక సింహపురాభిసారోరగ దేశస్థులు. పాంచాల కౌరవ శూరర సేనాది దేశముల మీఁదికి దండెత్తి వచ్చుటయుఁ దోచుకొని పోవుటయు, జరుగునే యున్నది. ఈ యాపదనుఁ దొలఁగించుటకు నేఁడు సుక్షత్రియులు లేరు. పరాక్రమవంతులయిన సచ్ఛూద్రులయిన రాజులు లేరు. వైదికధర్మము నెవరు రక్షించవలయును. బ్రాహ్మణ ధర్మమెట్లు రక్షింపఁబడును? ఒక మగధరాజ్యమునకు సేనాపతిని నేనున్నాను. అయ్యో! బ్రాహ్మణుఁడు రాజుల నాశ్రయించి యుండవలసిన వాఁడు. వానికి లోకవృత్తాంతమునందు స్వతంత్రత లేదు. అయ్యో!

మీఁదు పోయి తేపు జ్యోతిర్విదుల సమావేశము చేయుదు. దేశ జాతక మెట్లున్నదో తెలిసికొనవలయును.

# 3

అభిసార దేశములోఁ బశ్చిమదిశయందు నొక విచిత్రమయిన పర్వతమున్నది. ఆ పర్వతము నిజానికి నాల్గు పర్వతములు. ఆ నాల్గు పర్వతములు చుట్టు నొక ప్రదేశమునకుఁ బెద్ద గోడకట్టినట్లుండును. నడిమి ప్రదేశముయొక్క వైశాల్య మెక్కువ కాకపోవుటచేత దాని గోడతనము మిక్కిలి విస్పష్టముగాఁ గనిపించును. కాని వాని నడుమ నొక పర్వతము కలదు. ఆ పర్వతము మూలముగా నిది గోడవలెఁ గనిపించదు. ఆ పర్వతము చుట్టుననున్న యీ నాల్గు పర్వతములు నడుమ నడిమి పర్వతమునకుఁ జుట్టునుఁగల నిమ్నదేశము. నిమ్నప్రదేశమువలెఁ గనిపించక యిది యొక యఖాతమువలె నుండును. అచట వానలు కురియనే కురియవు. నూటికిఁ గోటికిఁ గురిసినచో నడిమి పర్వతముమీఁదఁ బడిన చినుకు ప్రాకారపర్వతములమీఁద నొత్తట్టునఁబడిన చినుకులు సర్వమా నిమ్నప్రదేశమునఁ జేరి యది సరస్సువలె నుండును. ఆ పర్వతముమీఁదఁ బదియేండ్లకొకసారి వాన కురిసినను గురిసినట్లే. ఆ వానయే యా నిమ్నప్రదేశమునఁ జుట్టునుఁ గందకముగా నుండి దానినిండ జలముండి వాన లేనన్నినాళ్ళు జలమింకుచు నింకుచుఁ గొన్నియేండ్లు సరస్సు, కొన్నియేండ్లు బురదతోఁ

గూడిన జలము, కొన్నియేండ్లు చెమ్మగల ప్రదేశముగా నుండు చుండును. ఆ నదిమి కొండవద్ద కెవ్వరును బోరు. పోవుటకు వీలులేదు. ప్రాకార పర్వతమును దాటుటయే కష్టము. ప్రాకార పర్వతములు లోతట్టున నెక్కువ యేటవాలుగా నుండుటచేత నవరోహించుట కష్టసాధ్యము. అవరోహించిన తరువాత నిమ్నప్రదేశగత జలములుగాని పంకముగాని తరణ సాధ్యముకావు. ఆ నిమ్నప్రదేశ మంతయు క్రూరసత్త్వముల చేతఁ బెద్దపులులచేతఁ జిఱుతపులులచేత భల్లూకములచేత నితరములైన వన్యమృగములచేత నావరింపఁబడి యుండును. అచట నివసించు పురుషులు నిజానికి వానికంటెఁ దక్కువవారు కారు. ఆ మృగములనుజూచి వారు భయపడుట తక్కువ. వారినిజూచి [illegible] భయపడుట యెక్కువ. వారు క్రూరులు. పరమ ధూర్తులు. ఆ పర్వతారణ్యములందు నివసించు నెట్టి మృగము నయినను జంపి తన్మాంసఖాదనము చేయుదురు. అచట వానలు లేవు. పంటలు లేవు. మానవులున్నారు. మఱి యేమితినవలయును? "అన్నాత్ పురుషః" అన్నట్లుగా నన్నమువలనఁ బురుషుఁడు జన్మించుచున్నాఁడు. ఆ యన్న మేది? వాఁడు జన్మించినచోట నున్నదియే యన్నము. అచట ననేకములైన యరణ్యవృక్షములున్నవి. పొదలున్నవి, వాని పండ్లు తిందురు. వాని మూలములనుఁ దిందురు. భూమి దున్ని పండించుకొనుటకు వానలు కురిసి మెత్తపడి నేల యుండ వలయును. కురియుట తడవుగాఁ బడఁబోసికొను స్వాప్ని ఘురులు చూచుచుండఁగా నెండిపోయెడు దేశములో సేద్య మని యుండునా? అందుచేత వారికిఁ దత్రత్య వృక్ష ఫల మూల

ముతే కాక యచట నివసించు సర్వ జంతు మాంసమును ఖాద్య మగుచుండెను. ఇన్ని జంతువు లున్నవి. వాని కయిన జలము కావలయునుగదా! ఆ జంతువు లెచ్చటనో యొక చోట నీళ్ళు త్రాగవలయును. లేనిచో బ్రదుకవు. అట్టి నీటి ప్రదేశము లా మహాపర్వతములం దెచ్చట నున్నవి? ఆ ప్రశ్న యీ జాతిలో నొక రిద్దఱు వివేకలేశము కలవారికిఁ బుట్టి, పర్వతములను వెదకి వెదకి యొకటిరెండు చోట్ల జలముండెడి గుంటలను గనుఁగొనిరి. ఆ పర్వతములలో నాగుంట లెట్లుండెనో యెవ్వరికిని దెలియదు. ఆ గుంటలనిండ జల మెప్పుడు నుండును. ఆ జలము తరుగదు. అట్టి గుంటలు నచటనున్న మైదాలు పర్వతములమీఁద నుండెను. ఆ యభిసార దేశములో వేయిగ్రామములకుఁ దక్కు[illegible]దు. ఆ వేయి గ్రామముల జనులు వారికి సమీపముగా నున్న యిట్టి నీటి గుంటగల పర్వతము దమ కెంతదూరమందున్ననుఁ బోయి నీళ్ళు తెచ్చుకొనవలసినదే. నీళ్ళు తెచ్చుకొనుట యీ దేశములో నొక మహాయాత్ర. కొన్ని యూళ్ళవారు కలసి స్త్రీబాలవృద్ధులందఱును జలాహరణార్థము పది దినముల కొకసారి పదునేను దినముల కొకసారి యాత్రగా బయలు దేఱుదురు. తండాలు తండాలుగాఁ బోవుదురు. వారు నీళ్లు తెచ్చుకొనుటకుఁ బాత్రలు లేవు. వారు పాత్రలే యెఱుగరు. ఇండ్లదగ్గఱ వారి కుండెడు పాత్రల లక్షణ మెట్టిదనఁగా ఱాళ్లు తొలిచి ఱాళ్ళలో గుంటలు చేయుదురు. అవియే వారి పాత్రలు. ఇంక జలము లేనిచోఁ దెత్తురన్నచో వారు సంహారించిన మృగముల చర్మములతో కుట్టిన సంచులతోఁ దెత్తురు.

కన్పట సమావేశ మగుదురు. రెండు నెలలు కడచినఁగాని యీ సర్వగ్రామస్థుల జనులకు నీళ్లుండవు. ఈ హేతువునఁ నాలుతపు దినములలో గ్రామస్థులమధ్య యుద్ధములు జరుగుచుండెడివి. ఆ యుద్ధములలో స్త్రీ బాల వృద్ధులు పలుమంది మరణించుచుండిరి. కొన్నాళ్ళకా దేశమున నొక రాజేర్పడి, యారాజు జలాపహరణ విషయమునఁ బ్రతిగ్రామమునకు వంతులేర్పఱచి యుద్ధములు లేకుండఁ జేసెను. జలకుండములవద్ద యుద్ధములు జరిగినచో నా కలహమునకుఁ బ్రథమ హేతువులయినవారిని రాజభటులు సంహరించుచుండిరి. ఆశిక్ష మిక్కిలి కఠినముగా నుండెను. అట్టివారినిఁ బర్వత శిఖరమునుండి క్రిందికిఁ ద్రోయుదురు. వాని కుటుంబము నంతయు నీటితోఁ బోసిచి చంపుదురు. అందుచే జలాపహరణము వంతుల ప్రకార మేర్పడి జలకుండ యుద్ధములు దేశమునందు లేకుండఁ బోయెను. ఆ దేశపు రాజునకు జనులు చెల్లించెడి పన్ను లే చిత్రముగా నుండును. ఒక్కొక్క గ్రామము రాజునకుఁ బదునేను దినముల కొకసారి నాల్గువిత్తుల జల మీయవలయును. నాల్గు మేకల మాంసమునుఁ బంపవలయును. ఒక తొట్టెడు పండ్లు పంపించవలయును. ఆ రాజ్యములో సందఱునుఁ గటారికాండ్రను బల్లెపుఁ బోటుగాండ్రను లక్ష్యసిద్ధులు. హిమవ్యాఘ్రము మొదలయిన జంతువుల చర్మములు, తేనియ, లేడికొమ్ములు మొదలయిన వస్తువులిచ్చి పాంచాల శూరసేనాది దేశముల నుండి కత్తులు బల్లెములు గునపములు బండసూదులు మొదలయిన వస్తువులనుఁ దెచ్చికొందురు. వారి దేశములో నాతిథ్యమన్న గుణము లేనేలేదు. ఒక గ్రామస్థుఁ డింకొక గ్రామము

నకుఁబోయి బ్రదికివచ్చుట దుర్ఘటమైన విషయము. వారు క్రూరజంతువులకంటెఁ గ్రూరులు. ఆ దేశపుటాచారములు వింతగానుండును. వానిలో మానవత్వము కనిపింపదు. ఒక స్త్రీ విషయమునఁ దండ్రి కొడుకు లిద్దఱు కలహింతురు. ఒకరి నొకరు సంహరించికొందురు. ఆ దేశమట్టిది. ఇట్టి జలకుండము నాల్గుపర్వతములు ప్రాకారమువలె నుండి నడుమనున్న పర్వతముమీఁద నొకఁడున్నది. ఆజలకుండము రహస్య విషయము లందఱకునుఁ దెలియదు. మొదటి యడ్డంకి యీ ప్రాకారపర్వతము. అంతకంటె నధికమయిన రెండవ యడ్డంకి జలముచేతనో, పంకముచేతనో, యూబిచేతనో, తిరించరాని యీ నడిమి ప్రదేశము. ఇట్లయ్యు నా ప్రదేశమునకుఁ గొందఱు పోవుచు వచ్చుచుందురు. అచటికి రాకపోకలు చేయుటకు నందఱకు నధికారము లేదు. రాజానుమతి కలవారే యచ్చటికిఁ బోయి రావలయును. ఆ నడిమి పర్వతము యొక్క యొక గుహలో నిచ్చట నొకఁడు నివసించుచుండును. వాఁడు పెద్ద పండితుఁడు. ఇట్టి యాటవిక జనమునందుఁ బశుప్రాయమైన జనమునందుఁ గ్రూరమృగ సదృశమయిన జనమునందుఁ గొన్ని విద్యలు కలవు. అది యాశ్చర్యకరమయిన విషయము. ఆ విద్య లనాదినుండియు నాజనమునందుఁ బరంపరగా వచ్చుచుండెను. అవి వట్టి విద్యలు కావు. అధికమైన పరిజ్ఞానముతోఁ గూడిన విద్యలు. ఖడ్గవిద్య యొకటి వారి దేశమునందు విలక్షణమైన సంప్రదాయముతో బెంపొందుచు వచ్చెడు విద్య. రెండవది వైద్యము. తత్పర్వతగతౌషధీ పరిజ్ఞానము గలవారు వారిలో నందలమంది కలరు. అందులోఁ

కొందఱు మఱియు మహాపండితులు. వారీ వ్యాధి కుదుర్పఁ గల రీవ్యాధి కుదుర్పలేరని లేదు. వ్యాధులే కాదు. వారి యోషధీ పరిజ్ఞానము విలక్షణమైనది. ఖడ్గముతో నొకఁడు మఱియొకనినిఁ గొట్టును. అది పొడుగయిన పెద్ద గాయమగును. అట్టి గాయమును వారిలోనున్న మహావైద్యు లేదో యాకు పసరు రాచి సులభముగా నెమ్మదింపఁ జేయుదురు. ఇది యొక మహావిద్య. ఇట్టి మహావిద్య వారియం దిక్కొక్కఁడున్నది. ఈ వైద్యము వారు నివసించు ప్రదేశ పరిజ్ఞానము చేత వచ్చినది. ఈ రెండవ విద్య వారిలో నేనాఁటినుండియో వచ్చుచుండెను. ఒక వేయి సంవత్సరములకుఁ బూర్వమా జాతి భారత దేశీయులే. వారాంగ్యమత విశిష్టులై వర్ణాశ్రమ వ్యవస్థా పరిరక్షకులయిన రాజులచే వెడలఁగొట్టఁబడి, యట్టి వారు కుటుంబములతో లేచి వచ్చి తృణకాష్ఠ జలసమృద్ధికి మిక్కిలిగా లోపము లేని యవనరాజ్యములవారు కూడ వారిని నిలువనీక యొక పోవుటచేత నీ దేశమునకు వచ్చి నివాసమేర్పఱచి కొనిరి. వారిలోఁ గొందఱు పూర్వులు జ్యోతిర్వేత్తలు. భారత దేశమునందున్న శాస్త్రములలోఁ గొన్ని శాస్త్రములు నీశ్వరు నంగీకరింపవు. వానిలోఁ బ్రధానములయినవి సాంఖ్యము, న్యాయమును. మూఁడవది జ్యోతిశ్శాస్త్రము. జ్యోతిశ్శాస్త్రవిదులు కాలము ఖగోళ గత గ్రహములనుండి జరుగుచున్నదనియు, మానవుల జీవితములు వానినిబట్టి నడచుననియు, నిరూపించుటచేత గ్రహములను మించి పరమేశ్వరుఁ డొకఁ డున్నాఁడన్న సిద్ధాంతమును వా రంగీకరింపరు. ప్రధానముగానున్న యీ మూఁడు శాస్త్ర

ముల పరిజ్ఞాతలలోఁ బూర్వకాలమున నాస్తికు లుదయించు చుండిరి. సర్వశాస్త్రములు వేదాంతములుగా నుదయించిన వే. సాంఖ్యము ప్రధానము నిరీశ్వర మయినది. న్యాయము పదార్థ ప్రతిపాదకమయి పరమేశ్వరుని బహిష్కరించినది. జ్యోతిశ్శాస్త్రము గ్రహచారవశమయి యీశ్వరునిఁగా దన్నది. ఈ మూఁడు శాస్త్రములయందు నిష్ణాతులైన వారిలో నాస్తికులు బయలుదేరుటచేత వారును వారి యనుయాయులును వేదధర్మ వ్యతిరేకు లగుటచేత వారిని క్షత్రియరాజులు బహిష్కరించుచు వచ్చిరి. ఇట్లు దేశ నిష్కాసనము పొందిన జనములలో సాంఖ్యము తర్కము క్షీణించినను జ్యోతిశ్శాస్త్రము క్షీణించలేదు. ఆ శాస్త్రము వారిలో సర్వజన వేద్యముగా లేదు. ఎచ్చటనో యొకచోట నొక కుటుంబమో రెండు కుటుంబములో తచ్ఛాస్త్రమునుఁ బరంపరగా సంప్రదాయముగాఁ దండ్రినుండి కొడుకుగా నిలఁబెట్టికొనుచువచ్చిరి. ఆ జ్ఞానము వేలయేండ్లుగా నా కుటుంబములయందు నిలిచి యుండుచు వచ్చినది. సూర్యగతిని నిర్ణయించుట, చంద్రగతి తెలిసికొనుట, దిన గణనము, మాస గణనము, సంవత్సర గణనము, నితర గ్రహముల చారము వీని నన్నింటిని విచిత్రము లైన సాధనములచేత వారు గణించుచు ఫలితములను నిర్ణయించికొనుచు వారొక మహా సంస్థగా నుండుచుండిరి. ఈ ప్రాకారమువలె నున్న నాల్గు పర్వతముల నడిమి పర్వతమున నొక ప్రదేశమున్నది. అదియొక కొండ చరియ భాగము. ఆకొండకొమ్ము మూఁడుగా జీలియున్నది. దానియందు దాకలము లుండవు. సూర్యకిరణము లా నున్నవి పొడిచికొని

వచ్చిన కోణములుగాఁ దేలిన యీ పర్వతమునందుఁ బడెడి కోణములను గుర్తుపెట్టుకొనిరి. వానినిబట్టి వారు కాల గతిని నిర్ణయింతురు. అదియొక విద్య. అది పరంపరగా నొక వంశమునందు వచ్చుచున్నది. ఆ వంశము వా రా పర్వత నివాసులు. ఆ వంశముయొక్క మూలపురుషుని పేరు విలయై నసుఁడు. తొలుత తనది వాని పేరు కాదు. వానిని బహిష్క రించిన కురువంశరాజు వాని కా పేరు పెట్టెను. విలయమనఁగాఁ బ్రళయకాలము. ఏనస్సనగాఁ బాపము. విలయకాలమునం దెట్టి పాపముండునో యట్టి పాపము వానియం దున్న దని యీ కౌరవరాజు వాని కానామమును బెట్టెను. ఆ పేరు కొన్నాళ్ళకు మాఱి మాఱి 'నెలిమోనస్' అని యయ్యెను. అప్పుడప్పుడు వకారము బకా[illegible]ముగా నుచ్చ రించుట గలదు. యకారము జకారముగా నుచ్చరించుట గలదు. అనంతమయిన కాలము మీఁద సంస్కృతమయిన యొక భాష యొక యాచారము నొక జాతి యొక బుద్ధి యెన్ని మార్పులు పొందును? కొన్ని మార్పులెట్లుండు ననఁగా నది తొలినాఁటి సంస్కృత సంబంధి యనిపించదు. అది సహజ ముగా నున్నచోటనే యుద్భవించి నట్లుండును. అట్లుద్భవించుట యసంభవమన్న పరిజ్ఞానము లేనివానికి నదియే స్వయంభు వనిపించును. ఎవఁడు వైదికమతమునందు విశ్వాసము లేని వాఁడో వాని బుద్ధి యీ రీతిగాఁ బ్రసరించు నీరీతిగాఁ బ్రస రించదన్న నియమము లేదు. ఆ వంశము నెలిమోనసల వంశముగా బ్రశస్తి గాంచెను. వీరు తొలినాఁ డుత్తర జ్యోతి షమునందుఁ దత్ప్రాంతముల యందు నివసించెడి వారు.

భారతయుద్ధమైన తరువాత వేయి యేండ్లు జరిగిన తరువాత నానాఁటి వెలియోనసు వంశస్థుఁ డుత్తర జ్యోతిషధరాపతి కొక జోస్యము చెప్పెను. ఆ రాజునకు లేక లేక యొక కొడుకు పుట్టెను. వాఁడీ వెలియోనసుచేత నా కొడుకుయొక్క భవిష్యత్తు జెప్పించికొనెను. ఆ వెలియోనసు రాజు కొడుకు రెండేండ్లు పెరిగి చనిపోవు నని చెప్పెను. ఆ రాజు వాని నా రెండేండ్లు చెఱసాలలో నుంచెను. రెండేండ్ల తరువాత నా కొడుకు చనిపోయెను. మింటిలోనున్న గ్రహములు కాక రాజునకు వాఁడొక గ్రహముగాఁ గనిపించెను. వానిని వధింపుఁడని యాజ్ఞ యిచ్చెను. ఆ వెలియోనసు రాజు కొడుకు జాతకము చెప్పినట్లే సేనాపతి కొడుకు జాతకము కూడఁ జెప్పెను. వాని జాతకము బాగుగా నున్నది. ఆ సేనాపతికిఁ జెప్పిన జ్యోతిష మెట్టిదనఁగా రాజునకుఁ బుట్టిన యొక్క కొడుకును రెండేండ్లలోఁ జనిపోవుననియుఁ నతనికి మఱల సంతానము, కలుగదనియుఁ రాజునుఁ జంపి సేనానాయకుఁడు రాజగు ననియు, వానికొడుకు సర్వ యవనదేశములకుఁ జక్రవర్తి యగుననియుఁ, జెప్పెను. అందుచే వెలియోనసు మీఁద రాజునకెంత కోపమో సేనాపతికంత యనుగ్రహము. అతనిని వధించకుండ సేనాపతి వానినిఁ దప్పించి వదలి పెట్టించెను. వాఁడందందుఁ దిరిగి తిరిగి యాఱువందల యేండ్లకుఁ బూర్వ మభిసార దేశమున నీ పర్వతమునందు సూర్యకిరణపాతము రేఖలుగా సహజముగా విభజింపఁబడి కాలపునడకను సిరూపించి చూపించుచున్న యీ పర్వతమునుఁ దమవిద్యయొక్క పరంపర చెడిపోకుండ నుండుటకిప వీలుగానున్నదని గుర్తించి

యచట నివాస మేర్పఱచికొనెను. వాఁడు నివసించు ప్రదేశము పర్వతములో నొక పెద్దగుహ. ఆ గుహాలోనుండి మఱి నాలు గయిదు గుహాలలోనికిఁ ద్రోవలు కలవు. అట్లు పాఱిపోయి వచ్చిన వెలియోనసు తన భార్యతోఁ దన కొడుకుతోఁ బాఱిపోయి వచ్చెను. అతఁడీ ప్రాకార పర్వతమును దాటి యీ నిమ్నప్రదేశము నుత్తరించి సకుటుంబముగా నా పర్వతమునకు వచ్చి యీ గుహాలలో నివాస మేర్పఱచికొనెను. ఈ యాఱువందల యేండ్లనుండి యీ వంశ మచట నొక విచిత్రమైన బ్రదుకు బ్రదుకుచుండెను. వాఁడు తన వెంటఁ గొన్ని గ్రంథములు తెచ్చికొనెను. ఆ గ్రంథము లన్నియుఁ జాల పలుచని రాగిరేకులపైన వ్రాయఁబడి యున్నవి. ఈ గుహానివాస మేర్పడువఱకు కొచ్చటికిఁబోయినను వానిని మోసికొనిపోవుట వారి కుటుంబమునకు బాధగానుండెడిది. ఈ గుహానివాస మేర్పడిన తరువాత నా గ్రంథములనుఁ గదలించ నక్కఱ లేకపోయెను. ఆ గ్రంథములు తొలినాఁడు సంస్కృతభాషలోఁ గలవు. ఆ భాషోచ్చారణము తరతరములుగా వికారముపొంది యుత్తర జ్యోతిష ప్రభువుచేత వెలియోనసు వధింపఁబడుట కాజ్ఞాపించుటకు నేఁబదియేండ్లకుఁ బూర్వము క్రొత్తభాషవలె సిద్ధపడి కంఠస్థములైన యాగ్రంథములు రాగిరేకులమీఁద వ్రాయఁబడెను. ఆ వ్రాసినవ్రాఁత చదివినచో నా యక్షరములే బ్రాహ్మీలిపి కాదు. అనేకశబ్దములకు ధాతువులకు సంస్కృత భాషారూపముఁ జెడిపోయి యవనభాషాకృతి వచ్చెను. ఆ గ్రంథము లీ గుహాలోఁ జివరి గుహాయందు దాచఁబడి యుండును. వారి వంశములో

నొక్కొక్క సుతుఁ డుదయించుచు వచ్చెను. వానికిఁ దండ్రి చదువు చెప్పుచుండును. ఆ గ్రంథములుఁ బఠింపఁజేయును. కొండకొమ్ముమీఁదఁబడు సూర్య కిరణములుఁబడు రేఖలను బట్టి దినములు, పక్షములు, మాసములు, ఋతువులు నయనములు, సంవత్సరములు తెలిసికొని లెక్కలుకట్టికొను విద్య సంపూర్ణముగాఁ గొడుకులకు నేర్పుదురు. ఆ వంశములోనున్న చమత్కార మేమనఁగాఁ బందొమ్మిదివందల సంవత్సరములకుఁ బూర్వమున్న వారి పూర్వునిపేరు వెలియోనసు. ఇప్పుడున్నవానిపేరును వెలియోనసు. వెలియోన నీ గుహలో నున్నాఁడని సర్వజనులకుఁ దెలియదు. సామాన్య ప్రజలకుఁ దెలియదు. సర్వ యవనరాజ్య ధరాపతులకు మంత్రులకు సేనాపతులకుఁ దెలియును. ఆ వంశమువా రెచ్చటనున్నను దమయునికి యవనరాజ్యాధికారులకుఁ దెలియఁజేయుచుండుదురు. ఆ మొదటి వెలియోనసును బహిష్కరించిన కురురాజు పేరు నిచక్షుఁడు. అయన యుధిష్ఠిరుని నుండి యేడవ వాఁడు. జనమేజయ మహారాజు కుమారుఁడు శతానీకుఁడు. ఆయన కొడు కశ్వమేధదత్తుఁడు. ఆయనకొడు కధిసీమ కృష్ణుఁడు. ఆయన కొడుకు నిచక్షుఁడు. ఆ నిచక్షు మహారాజుమీఁద విరోధముతో మహా జ్యోతిర్వేత్తయైన ప్రథముఁడయిన యా వెలియోనసు తానొక ప్రతిజ్ఞ చేసెను. అతఁడు తానును దన వంశమును దమ జ్యోతిర్విద్యా విజ్ఞానమును సర్వదా వేలయేండ్లు గడచినను నార్యావర్త దేశమునందలి క్షత్రియ రాజ్యములను నిర్మూలనము చేయుటకు వైదిక మతమును ధ్వంసము చేయుటకు నెప్పుడెప్పుడు భారత

దేశమునకు గ్రహస్థితి బాగుండదో దేశ జాతకము బాగుం
డదో యప్పుడప్పుడు యవనరాజులచేత దండెత్తింపించి యీ
క్షత్రియ రాజ వంశములను వైదిక మతమును నిర్మూలనము
చేయుటకే ప్రయత్నము చేయుదునని. ఇట్టి ప్రతిజ్ఞ పూనెను.
ఆ ప్రతిజ్ఞ వారి వంశమునందుఁ దండ్రినుండి కొడుకునకు
సంక్రమించుచుండెను. ఆ ప్రతిజ్ఞ చేయించియే తమ కొడు
కుల కాతండ్రులు జ్యోతిర్విద్యా రహస్యములను నేర్పుదురు.
వారి విద్యలోని యుత్కృష్టవిషయ మేమనఁగా వారికి భారత
దేశముయొక్క జాతకము విస్పష్టముగాఁ దెలియును. వారు
దేశజాతకమును వ్రాయుటలో కాలములు నిరూపించుటలో
మహాసమర్థులు. ఆవిద్య వారి వంశమునం దట్లే వచ్చుచుండెను.
ఇది యిట్లుండఁగా వారి వంశ మనుస్యూతముగాఁ బరంపరగా
సాగుట కొక మహాభ్యంతర మేర్పడినది. అది యీ పర్వత
గుహానివాసము. వీరికిని బయటనున్న జాతికిని సంబంధము
లేదు. ఇచట నిట్టి యొక కుటుంబమున్నదన్న విషయము
యవనరాజులకు మంత్రి సేనాపతులకుఁదక్క మఱి యెవ్వరికినిఁ
దెలియదు. ఒక సెలియోనసునకుఁ గొడుకు పుట్టెను. వీనికిఁ
దండ్రి విద్య చెప్పెను. వానికిఁ బెండ్లి చేయవలయును వానికిఁ
బెండ్లి యెట్లగును? పిల్ల నిచ్చెడివా రెవరు? వీరి నెవ రెఱుఁగు
దురు? ఇదియొక పెద్ద సమస్యయై పోయినది. అందుచేత
నైదువందల యేండ్లక్రిందటి సెలియోనసు నాఁటి యవనరాజు
లొక పరిషత్తుగా నేర్పడుటయు నార్యావర్తముమీఁద దండె
త్తుట యీ పరిషత్తుయొక్క ప్రధానమైన యాశయముగా
నుండుటయు మొదలయిన కొన్నినిబంధనలు చేసెను. వానిలో

నొక నిబంధన యేమనఁగా దన వంశములో నేతరమున కా తరముగా వివాహ యోగ్యకాలము వచ్చిననాఁటికి నా నూతతనుఁడైన వెలియోనసునకు భార్యను సమకూర్చుట యీ పరిషత్తుయొక్క ధర్మములలో నొకటి. ఆ పరిషత్తున కొక కార్యదర్శి యుండును. వాఁడు రహస్యముగా వెలియోనసు నొద్దకు రాకపోకలు జరుపుచుండును. వాఁడే యువకుఁడైన వెలియోనసునకు భార్యను సమకూర్చవలయును. అది పెద్ద రహస్యము. వాఁడొక బాలికను దొంగిలించి రహస్యముగా నామె నిచటికిఁ దీసికొని రావలయును. ఈ సర్వమయిన నియమమూలయు నా పరిషత్కార్యదర్శి యొక్క విధి. ఈ కార్యదర్శియొక్క యుద్యోగమును సంప్రదాయానుగత మయినది. ఒక కుటుంబమునందలి తండ్రి కొడుకులే యీ యుద్యోగమున కర్హులు. అది వారి కులవృత్తి. వారి వంశమునందు స్థిరమయిన యుద్యోగము. ఇప్పు డాయుద్యోగి తింతాకరాళుఁడు. వెలియోనసన్నన్న పేరెట్టిదో తింతాకరాళుఁడన్న పేరునట్టిదే. అనఁగా నా వంశములో జన్మించు జ్యేష్ఠుని పేరు నిత్యము నదియే యన్నమాట. ఆనాఁటి వెలియోన సిచ్చట నివాస మేర్పఱచికొన్న తరువాత వందయేండ్లకొక విపరీత పరిస్థితి జరిగెను. ఆనాఁటి యువనరాజ పరిషత్తులోఁ గొందఱు వెలియోనసుయొక్క యీ కాలజ్ఞతను సంశయించిరి. అట్టి విద్యయే యుండదనిరి. అట్టి పరిజ్ఞాన మొకనికుండుట యసంభవ మనిరి. వారిచేత నొప్పించుట కష్టమయ్యెను. ఆనాఁటి వెలియోనసొక పదకమును నిర్మించెను. తింతాకరాళునితో నొక నిబంధన యేర్పఱచికొనెను. తన వంశములో నిట్లు తండ్రి

కొడుకులు జరుగుచుండఁగా నీ రహస్యమును తింతాకరాళుఁ డెవనికిని దెలియనీయరాదు. చేసిన నిర్మాణమిది. వరుసగా నాల్గు గుహ లున్నవి. వెలియోనసుయొక్క భార్యాపుత్రులును వారి గ్రంథములును జివరిగుహాలో నుందురు. వారెప్పుడును మొదటిగుహకు రానేరారు. మొదటిగుహాలో నుండి రెండవ గుహాలోనికి మార్గమున్నదనియే యెవ్వరు నెఱుఁగరు. అది యట్టి రహస్యమైన మార్గము. ఆ వెలియోనసులు జటాధారులు గడ్డములు మీసములు పెరిగియుండును. ఈ వివాహ విషయము సంపూర్ణముగా దాఁచినచోఁ దండ్రి చనిపోఁగాఁ గొడుకు మఱల వెలియోనసు అగుచుండఁగా వచ్చిన వారొక్క వెలియోనసునే చూతురు, గావున వెలియోనసు లింతమంది లేరు. వెలియోనసు నిత్యజీవి. అతఁడు వేయి యేండ్లనుండి బ్రదుకుచున్నాఁడు. వాఁ డాహారమును భుజించఁడు: నిదురపోఁడు. వానికి జరామరణములు లేవు. అతనికిఁ గాలజ్ఞానము జ్యోతిర్విద్యా ప్రభావముచేతఁ గలుగలేదు. వాఁడు మహాయోగి. వానికాజ్ఞానము సహజముగా నున్నది. ఇట్టి ప్రథనుఁ బుట్టించి యవనరాజ పరిషత్తులను స్వాధీనము చేసికొన నెంచి తింతాకరాళునితోఁ గట్టుకట్టి యీ యేర్పాటు చేసెను. దీనితోఁబాటు తత్పూర్వమందు తింతాకరాళుఁ డొక్కడే వెలియోనసునుఁ జూచుటకు వచ్చెడిది. తదనంతరమున యవనరాజులు తన్మంత్రులు తత్సేనాపతులు సందఱును రావచ్చునట్లేర్పాటు జరిగెను. అందుచేతఁ గడచిన మూఁడు నాల్గు వందల యేండ్లనుండి యవనరాజులు నా రాజ్యములలోని మహోద్యోగులును వెలియోనసునుఁ జూచు

టకు వచ్చుచునే యుందురు. ఎప్పటికప్పుడు తండ్రి కొడుకు లొక్కరీతిగనే యుందురు. తత్పర్వతగుహా నిత్యనివాసము. వారి కచ్చట దొరకెడి వృక్ష ఫలమూలములు తత్పర్వతము నందలి ప్రత్యేక స్థితియు నచటి విలక్షణములయిన వాయువు లును వృద్ధుఁడయినవానిని వృద్ధునిగఁ గనిపించనీయవు. యువకుఁ డయినవానిని యువకునిగాఁ గనిపించనీయవు. వారియందది యొక క్రీడశత్వము భాసించుచుండును. ఎంత కాదన్నను మఱియు వృద్ధుఁడైనచో వృద్ధుఁడుగఁ గనిపించుటచేత రాజు లకు రాజోద్యోగులకుఁ బరమవృద్ధుఁడయిన వెలిరోౕనసెప్పు డును దర్శనమీయఁడు. ఎనుఁబది యేండ్లుదాటిన వెలిరో నను తన భార్యతోఁ దన కోడలితోఁ దన మనుమనితోఁ జిట్టచివరి గుహాయందే యుండును. బాలుఁడైన వెలిరో ననుకు దర్శనమునకుఁ గొన్నిదినములే నిర్ణయింపఁ బడును. తక్కినప్పు డెవ్వరును రారాదు. ఎవనికి దర్శనము కావలసి నను తింతాకరాలుఁడే చేయించవలయును. అందుచేత నీ కుటుంబ రహస్యము వెలికివచ్చుటకును వీలులేదు. ఇట్లైదు వందలయేండ్లు జరిగినవి. ఈ కుటుంబ మా కొండగుహాలలో నింతటి మహావిద్యారక్షణముఁ జేసికొనుచు నేకాకులుగా బ్రదుకుట యొక మహారణ్యావృత్తి. పురుషు లీ విద్యా నిత్యా వ్యాసక్తులగుటచేత వారికిఁ గాలము నడచును. స్త్రీలకెట్లు గడచు ననఁగా వారు చెట్టుపట్టలలోని నారతీసి కట్టుగుడ్డలను నేయుటయు, మఱియు సంగీతము పాడుకొనుటయు. వేయి యేండ్లనాఁటినుండి యీ వెలిరోౕనను వంశమునందు రూఢమై యున్న విద్యలు రెండు. ఒకటి జ్యోతిర్విద్య. రెండవది

సంగీతవిద్య. కౌరవ రాజ్యమునుండి బహిష్కరింపఁ బడులకు మున్ను వారి పూర్వులు సామగానవేత్తలు. వారు యవన దేశము లాశ్రయించి నప్పటినుండి వారు యవనభాషలలోని కీర్తనలు పాడనారంభించిరి. వారి కంఠములందు మాధుర్య మొద్దారసి ప్రవహించు చుండును. క్రొత్తగా నా కుటుంబ ములో భార్యగావచ్చిన స్త్రీకూడ నా కీర్తనల నన్నియుఁ బాడుట నేర్చికొనెను. ఆ పాటలన్నియు వందల యేండ్ల క్రింది పాటలు. ఆభాష వేఱు. ఆ కొన్నిపాటలను రింతా కరాళుఁడు వినును. ఆ పాటను పాడుట వారికెట్టి సంప్ర దాయమో వానిని విని తన్మయులగుట రింతాకరాళుల కట్టి సంప్రదాయము. అవి వేయి యేండ్లక్రిందటి పాటలు. ఆఱు వందల యేండ్లక్రిందటి పాటలు. ఆ పాటలలోని స్వరపద్ధతి వేఱు. రింతాకరాళుల కాపాటలలోని కొన్ని వచ్చును. అతఁ డాపాటలలోఁ గొన్ని బయటఁ బాడుచుండును. జన మా పాటలకు ముగ్ధులై పోవుచుందురు. రింతాకరాళులకుఁ దమ యుద్యోగబల మొక్కటియేగాక యీ పాటలతోఁ బ్రజానురాగముకూడఁ గలదు.

౪

పుష్యమిత్రుని మేనల్లునకు వారు దొంగిలించి తెచ్చిన గుఱ్ఱమును వారిలో నొకరుంచికొని వారి గుఱ్ఱము నతనికిచ్చి వారతనితో నిట్లనిరి. 'నీవు పోయి మీ పుష్యమిత్రునితో

'మేమతని యశ్వము నిట్లు చిత్రవధ కావించితి'మని చెప్పుము. అతఁ డేమిచేయునో చూతము'మనిరి. ఇది యశ్వవధ జరిగిన తరువాతఁ బదునేను దినముల నాఁటిమాట. అతఁడు వారితో 'నేను బోను. నేను మీలోననే యుండిపోయెదను. నన్నింటికిఁ బోయినచో వారు బ్రదుకనీయరు. మీరీ మాత్రముగానైన నన్ను బ్రదుకనిచ్చిరి. ఆ పుష్యమిత్రుఁడు నన్ను వెంటనే సంహరించును. ఈ వార్త పుష్యమిత్రునకుఁ జేర్చుటకు నేను బోవలసినంత యవసరము లేదు. ఎట్లో యట్లు పంపించ వచ్చును. నేను మీలోఁ గలిసిపోవుదును. మీతో నుందును. నన్ను యీ తింతికరాళునకుఁ జూపించుఁడు. నే నాయనతో మాటాడెదను. ఆయన యెట్లు చెప్పినచో నట్లు చేసెదను.' అనఁగా వారు తింతికరాళుఁడు నిన్ను వధించుటకు మా కాజ్ఞ యిచ్చెను. మేము నిన్ను సంహరించలేదు. నీవు బ్రదికియుం డుట చూచి యాయన మమ్ము శిక్షించును. ఇది మా నైత్తికిఁ దేకుము. నీ దారిని నీవు పొమ్మనఁగా 'జేవు పోయెదను. మాపు పోయెద'నని కడపుచుండఁగా నా మూఁడవనాఁడు ప్రొద్దున తింతాకరాళుఁ డచటికి వచ్చెను. అతఁ డితనిని సంహ రింపుఁడని వారికాజ్ఞ యీయకమున్న వీనితో నతఁడు మాటాడెను. తింత వీనితో నిన్నుఁ జంపింతు ననెను. వీఁడత నితో నా కాయుర్దాయము చాల నున్నది. నీవు చంపలే వనెను. నీవు చంపుమనినను వారు చంపరని చెప్పెను. అప్పు డితఁ డింకొక మాట చెప్పెను. వారు నన్నుఁ జంపరు. నా జాతకము నాకుఁ దెలియును. నేను యవనులలోఁ గలిసి పోవుదును. నా భవిష్యత్తట్లున్నదని యనెను. కరాళుఁడు

నవ్వెను. సీ సీ పొమ్మనెను. వధింపుడని వారికాజ్ఞ యిచ్చెను. ఇప్పుడు తింతాకరాళుఁడు రాఁగా నితఁ డతనికిఁ గనిపించెను. కరాళుఁడు 'నీవు బ్రదికియున్నావే. ఇతఁడు 'నా జాతకమును నీకుఁ జెప్పియుంటినిగదా! ఇంక మిగిలినది, నేను మీలోఁ గలిసిపోవుట. నే నెట్లును మీలోఁ గలియుదును. వారు నన్నుఁ జంపలేదు.' కరాళుఁడు 'నీవు మాలో నెట్లు కలియుదువు?' ఇతఁడు 'నీవు నన్ను మీ యింటికిఁ దీసికొనిపొమ్ము. మీ యింటిలో నన్నిపనులు నేనుఁ జేయుదును. నీకొక ముసలితల్లి కలదు. నీ కిద్దఱు పిల్లలు గలరు. నీభార్య చనిపోయినది. నీ ముసలితల్లి యీ పిల్లలను సాకుటకు బాధపడుచున్నది. నీ యుద్యోగమునకును నీ పిల్లలను సాకుటకును నీకు సరిపోవుట లేదు. నన్నుఁ దీసికొనిపొమ్ము. నీ యుద్యోగమం నీవు చేసికొనుచుండ వచ్చును. నీ తల్లికి నేను సాహాయ్యముగా నుందును" కరాళుఁడు "నాసంగతి నీకెట్లు తెలియును? వీరిలో నెవరయినఁ జెప్పిరా?" ఇతఁడు "వారినే కనుగొనుము." కరాళుఁడు వారినిఁ గనుగొనెను. వారు కరాళుని కుటుంబవిషయ మొక్క యక్షరమైన నతనికిఁ జెప్పలేదు. కరాళుఁ డతనితో నిట్లనెను. "నీకీసంగతి యెట్లు తెలిసినది?" ఇతఁడు "నాకు జ్యోతిర్విద్య తెలియును. నే నందులోఁ బెద్దపండితుఁడను. నాకు సర్వరాజ్యములందున్న జ్యోతిర్విద్వాంసులతో సంబంధము కలదు. నేను నిన్ను మొదటిసారి కలిసికొనిన వేళయందు లగ్నముకట్టి నీ జాతకమునుఁజూచితిని. నాకివి యన్నియుఁ దెలియవచ్చెను. కరాళుఁడు "నాకీ విద్యలయందు విశ్వాసములేదు." ఇతఁడు

"లేదా? ఉన్నది. ఎంతోయున్నది. నీ యుద్యోగము దానితో సంబంధించినది." అనఁగాఁ గరాళుఁ డులికిపడెను. ఆతఁ డిట్లడిగెను "నాభార్య పోయినదంటివి. నేను మఱల వివాహ మాడుదునా?" ఇతఁడు "ఆడుదువు." కరాళుఁడు "ఎప్పుడు?" ఇతఁడు "మీ గ్రామములో నొక యువతియున్నది. తొలుత నీవామెనుఁ బెండ్లిచేసికొన నెంచితివి. ఆమెతండ్రి యామెను నీ కీయనన్నాఁడు. మఱి యెవనికో యిచ్చి పెండ్లి చేసెను. ఆమె మగఁడు రాజాజ్ఞచేత వధింపఁబడును. ఆమెను నీవు మఱల వివాహమాడుదువు." కరాళుఁ డాశ్చర్యపడెను. కరాళుఁడు "అది యెన్నాళ్ళలో జరుగును?" ఇతఁడు "ఎన్నాళ్లో నా? పది పదేను దినములలో జరుగును? కింతునకీ జ్యోతిష్యము వెలియోనసు చెప్పెను. ఇప్పుడు మఱల వీఁడదే చెప్పెను. వీఁడు వెలియోనసంతవాఁడా? వెలియోనసును వీనినిసంయోగ పఱచవలయును. వీఁడు చండప్రచండునివలె నున్నాఁడు. కరాళుఁడు – "ఈవిద్య మా యవనులది. మీదికాదు. మా యవనులనుండి మీరు నేర్చికొనిరి." ఇతఁడు "సర్వ విద్యలు మానుండియే యవనులు నేర్చికొనిరి. ఐనను నాకిప్పుడు మీ- మా భేదములేదు. నేను యవనుఁడను గాఁబోవుచున్నాను. నేను వైదికమతమున కెదురుతిరిగితిని." కరాళుఁడు "ఎందు కెదురు తిరిగితివి?" ఇతఁడు "నేను గ్రహచారమునుఁ జూచితిని. మగధదేశముయొక్క జాతకమునుఁ జూచితిని. మగధ రాజ్యములో నొక మహావిప్లవము జరుగును. యవనుల కిది విజయకాలము. మీరు కురుపాంచాల శౌరసేనాది రాజ్యములమీఁద దండెత్తుదురు. ఇది మీకెంతో యోగకాలము.

ఇట్టి మిమ్ముఁ బరిత్యజించి యోడిపోయెడి వారిలో నే నెందు కుండవలయును? ఆ దేశములమీఁదబడి దోఁచికొని మీతోఁ బాటు నేనును ధనవంతుఁడ నయ్యెదను." కరాళునకు మఱియు నచ్చెరువు కలిగెను. వెలియోన యెన్నిమాటలు చెప్పెనో యితఁడు నట్టిమాటలే చెప్పుచుండెను. యవనరాజపరిషత్తు మఱల సంశయించుచున్నది. యవనుల కిది విజయ కాలము. వీనిని గుఱించి వెలియోనసుతోఁ జెప్పి యతఁడంగీకరించినచో వీనినిఁ దీసికొనిపోయి యతనికిఁ జూపింపవలయును.

కరాళుఁడు వానినిఁ దన యింటికిఁ దీసికొనిపోయెను. తల్లికి సాయముగా నుంచెను. వాఁడు వారి భాషను తొలుతఁ బది దినములు, తరువాత బదునేను దినములు, వారు మాటాడుచుండఁగా వినుటచేత నెంతయో నేర్చికొనెను. వాని యీ గ్రహణశక్తికిఁ గరాళుఁ డద్భుతపడెను. వాఁ డా యింటిలో నెలనాళ్లుండెను. కరాళుని తల్లికి వాఁడన్నచో నెంతయో మక్కువ యయ్యెను. కరాళుని యిద్దఱు పిల్లలు వానికిఁ జనవైరి. ఈ నెలనాళ్లలోఁ గరాళునకు వివాహమయ్యెను. ఆమె భర్త మఱల నొక జలయుద్ధమునకుఁ గారణమగునట్లు సంచరించుటయు వాని నభిసార దేశాధిపతి కొండముంచు నుండి దొరలింపించుటయు జరిగెను. భర్త చనిపోయినంతనే యీమె సూటిగా తిన్నగా కరాళుని యింటికి వచ్చెను. ఆ వచ్చుటయే పెండ్లి. పదో తీగ కడియములు వాళ్లిద్దఱొకరి చేతుల కొకరు తొడిగికొనిరి. ఊరిలోఁ బదిమందినిఁ బిలిచి భోజనము పెట్టిరి. కొందఱు స్త్రీలు పాటలు పాడిరి. వివాహమయిపోయెను. కాని కరాళుని క్రొత్త భార్య వచ్చినప్పటి

నుండి యామెకును బుష్యమిత్రుని మేనల్లునకును సరిపడలేదు. ఆమె కరాళుని ప్రథమభార్యా సంతానమునందు నిరాదరముగా మొదటిదినము నుండియుండ నారంభించెను. కరాళున కిది మనస్సునకుఁ గష్టమయ్యెను. ఏమిచేయవలయును? ఇది యిట్లుండఁగా నతఁడు వెలియోనసు వద్దకుఁ బోవలసి వచ్చెను. ఐదుగురు యవనరాజులును వారి యైదుగురు సేనాపతులును వారి మంత్రులును నీ పదునేనుమందియుఁ గలిసి వారు వెలియోనసునుఁ జూతు మనిరి. పూర్వమిట్టి దెన్నఁడును జరుగలేదు. అప్పుడప్పు డొక్కఁ డొక్కఁడుగా వీరందఱు వెలియోనసునుఁ జూచి వచ్చినవారే. అందఱు కలిసి వచ్చుచున్నారని ముందు పోయి వెలియోనసునకుఁ జెప్పి రావలయును. చెప్పకపోయినచో వెలియోనస సజాగ్రత్తమీఁద నుండును. అతఁడు చిరకాలజీవియన్న మ్మాహాసిద్ధాంతము బైటఁబడినచోఁ దన యుద్యోగమునకు భంగము వచ్చును. తన భార్య క్రొత్తగాఁ గాపురమునకు వచ్చెను. ఈమెను వదలిపోవుట యిష్టములేదు. రాజులు వారి యుద్యోగులు వెలియోనసు వద్దకుఁ బోవుటకు వారము దినములగడు వున్నది. ఈలోపుగా గరాళుఁడు వెళ్ళి చెప్పి వచ్చుటకు వీలులేదు. ప్రతిదినము వారిలో రాజునో మంత్రినో సేనాధిపతినో యితఁడు పోయి చూచుచుండ వలయును. ఒకనినిఁజూచి తిరిగి రాఁబోవుచుండఁగా నతఁడు తేపు రమ్మనును. లేదా పోయి యింకొకనితో నొక మాటచెప్పి రమ్మనును. తనకు వెలుసుబాటేమియును లేదు. వెలియోనసువద్దకు నితనిఁ బంపించినచో బాగుండునా? యనుకొనెను. బాగుగనేయుండు ననిపించెను.

అతఁడును జ్యోతిర్విద్యావేత్త. ఇతఁడును జ్యోతిర్విద్యావేత్త. వారిద్దఱును గలిసికొన్నప్పుడు కరాళుఁడు తాను ప్రక్కనుండి వారి ప్రసంగము వినవలయు ననుకొనెను. ప్రస్తుత మది పొసఁగదు. నెలనాళ్ళనుండి యితఁ డిక్కడ నున్నాఁడు. తన పిల్లలును దన తల్లియు వానియం దనురక్తులై యున్నారు. వాఁడు మిక్కిలి విశ్వాసముతోఁ బ్రవర్తించుచున్నాఁడు. వాని మెడలో జందెమున్నమాట నిజమే. వాఁడు మాంసమునుఁ దినని మాట నిజమే. పండ్లు తినును. దుంపలను స్వయముగా నుడుకవేసికొని తినును. తమ మంచితీర్థమును మాత్రము త్రాగక తప్పదు. ఆ జలములో నతఁ డేదియో కలిపి త్రాగును. వాఁ డేమి కలిపి త్రావుచున్నాఁడో తెలియదు. వాని యాచారములు భిన్నములుగా నున్నవి. వాఁడు విశ్వాసపాత్రుఁ డనుటకు సందేహములేదు. ఒకనాఁటి రాత్రి కరాళుఁడు వానితో నిట్లనెను. మా దేశములో మీ విద్యలో నిన్ను మించినవాఁడు కలఁడు. నీకతనినిఁ జూడవలయునని యున్నదా?' ఇతఁడు 'నేను నీ జాతకమునుఁ జూచినప్పుడే నీకీ విద్యతోఁ బరిచయమున్నదని నాకుఁ దెలియును. ఈవిద్యలో నీవు పెద్ద విద్వాంసుఁడవు కావు. నీకీవిద్యయం దభిమానమే కలదు. అనఁగా నీ విద్య మీ దేశములో నున్నదనియర్థము. నన్నతనివద్దకుఁ దీసికొనిపొమ్ము' కరాళుఁడు 'కాదు. నీవొక్కఁడవే పోవలయును. నేను వచ్చుటకు వీలులేదు. నీకుమార్గోపదేశమునుఁ జేసెదను. కొంతదవ్వు నీతో నొక మనిసినిఁ బంపింతును. అచటినుండి నీ వొకఁడవే పోవలయును. అది దుర్గమమయిన యరణ్యము. మహా పర్వతములు ఒక పర్వతములో

నుండి యొక పెద్ద రంధ్రము కొండవెనుకకు దారి తీయును. ఆ లోపలఁ జీకటిగా నుండును. ఆ మహారంధ్ర ముఖమున నింకొక వృక్షములేదు. అన్నియు నివే చెట్లు. ఈ చెట్టు కొమ్మను నఱికి కాష్ఠము చివర జబ్బుగాఁ గొట్టి నిప్పు ముట్టించినచో నది జ్వాలగా మండుచుండును. ఆ వెలుఁగు తోడుగా నా పర్వత బిలమార్గమునఁ బోవలయును. లోనికిఁ బోయిన తరువాత నొక వెడల్పయిన బురదతో నిండిన స్థల ముండును. అందులో జాగ్రత్తగా నడువవలయును. తప్పటడుగు పడినచోఁ గూరుకొని పోవుటయే. ఆ బురద స్థలములో దగ్గఱ దగ్గఱగా దుబ్బు లుండును. ఆ దుబ్బులమీఁద నడుగులు వేయుచు లోనికిఁ బోవలయును. పలుమంది యా బురద లోఁబడి కూరుకొనిపోయి చచ్చినవారు కలరు. ఆ నడుమ నొక పర్వత మున్నది. ఆ పర్వతమునకుఁ బ్రాగ్దిశయందు నొక గుహ కలదు. ఆ గుహలో నొకఁ డుండును. వాఁడు నిత్యజీవి. వేయియేండ్లనుండి బ్రదికి యున్నాఁడు. నిత్యయువకుఁడు. వానినిఁ గలిసికొని నా మాటగా నొకవార్త చెప్పవలయును. నేఁడు చంద్రకళ నాల్గుభాగలు పెరిగినది. ఇంక నంరెండు భాగలు పెరిగిన నాఁటికిఁ జంద్రుఁడు గుండ్రముగా నుండును. ఆ నాఁటికి వెనుక దినమున సర్వాయవనరాజ పరిషత్సభ్యులును వాని దర్శనమునకు వత్తురనియు, నతఁడు సిద్ధముగా నుండవలయుననియు, నీవు వానితోఁ జెప్పి రావలయును. చెప్పఁగలవా ?" ఇతఁడు "చెప్పఁగలను" కరాళుఁడు "నిన్నుఁ జూచిన వెంటనే యతఁడు నీ స్వరూపమంతయుఁ దెలిసికొనును. నీజీవిత మంతయు నతఁడు లెక్కగట్టును. నీ మన

సులో నెట్టియూహాలున్నవో యతఁడిట్టె గ్రహించును" ఇతఁడు "ఇది నీ కింకొక్క లాభము. నా ప్రవర్తన విశ్వాస్యముగానే యున్నది. నేను పూర్తిగా విశ్వాస్యుఁడనో కానో యతఁడు నీకుఁ జెప్పును." కరాళుఁడు నవ్వి, "నీవును నా వెలియోనసును మహావిద్వాంసులు. మీముందు రహస్యములులేవు. మీ యిద్దఱునుఁ గలిసి మాటాడుచున్నపుడు ప్రక్కనుండి నాకు వినవలెనని యున్నది. కాని నాయుద్యోగధర్మము నన్నుఁ గదలనిచ్చుటలేదు." ఆ మఱునాఁ డితఁడు వెలియోనసు నివసించు పర్వతమునకు బయలుదేఱెను. కొంతమేర నొకఁడు దారి చూపించి వెనుకకు మఱలెను. ఇతఁ డుపదేశించిన మార్గముగుండ నతఁడు పోవుచుండెను. పోవుచు నా యరణ్యము పర్వతములను ప్రతిపదమునందుఁ బరీక్షించుచుండెను. అచటనున్న తీఁగలుగాని చెట్లుగాని యతఁడు పూర్వమెప్పుడునుఁ జూడలేదు. అచటనున్న యొక్క వృక్షము పేరయిన నతఁ డెఱుఁగఁడు. దారిలోఁ గొన్ని పర్వతముల ఱాళ్ళు భిన్నవర్ణములు కలవిగా నుండెను. అవి పెద్దపెద్ద పలకలు చివరకు బిలముఖమునకుఁబోయి యొక వృక్షశాఖను ఖండించి చివర నలుగఁగొట్టి జ్వాలచేసి బిలద్వారమునందు నడచెను. ఆ బిలములోఁ బోవుచుండఁగా నతని కొకచోట దూరముగా నేదో యడ్డమున్నట్లు కనిపించెను. ఈబిలము సూటిగా నాతలి వైపునకు దారిగానున్నదని కరాళుఁడు చెప్పెను. ఈయడ్డమేమి? అది పర్వతమా? ఈ బిలముచివరివఱకు లేదా? ఏదయిన పెద్ద మృగము దారికడ్డముగా నిలుచున్నదా? మహాభల్లూకమయినచోఁ గావచ్చును. భల్లూకము లగ్నికి భయపడి పాఱి

పోవును. తనచేతిలో నుండుచున్న కాగడా వెలుతురున కది భయపడి బిలమున కావెనకు దాగిపట్టును. అది కదలుచున్నట్లు లేదు. దగ్గఱకుఁ బోయినచో నది తన మీఁదఁబడి గ్రసించు నేమో? అతని కొక్కటియే ధైర్యము. ఆపంచ యవన దేశ సైనికులు పలుఁబడి మందియుఁ దన్ను గట్టివేసి కత్తులతోఁ బొడిచినప్పుడు కూడఁ దాను జనిపోనని తనకుఁ దెలియును. అది తనకు బాధాకాలము. ఇది తనకు బాధాకాలము కూడఁ గాదు. ఈ యడ్డంకి యేమి? ధైర్యముతో నతఁడు ముందునకుఁ బోయెను. అతని కది యొక భ్రాంతిగాఁ గన్పించెను. అది జంతువు కాదు. మనుష్యుఁడు కాఁడు. ఒక యాకృతి విశేషముగా నున్నది. ఇదమిత్థమ్మని నిర్ణయింప రాకుండ నా మూర్తి విశేషమునం దొక ముఖమును నేత్రములును నోరుగాఁ దోఁచెను. ఇతఁడు 'ఎవరు నీవు? నాదారి కడ్డ మెందుకు వచ్చితివి?' భూతము 'నీవు నీ మృత్యువుదగ్గఱకుఁ బోవుచున్నావు.' ఇతఁడు 'నా కిప్పుడప్పుడే మృత్యువు లేదు' భూతము 'అతఁడు నీకంటెఁ దెలివికలవాఁడు' ఇతఁడు 'వాఁడు నిన్ను నావద్దకుఁ బంపించెనా' భూతము 'కాదు. నేనే వచ్చితిని. నిన్ను వెనుకకుఁ దిరిగి పొమ్మనుటకు వచ్చితిని.' ఇతఁడు 'నేనన్నింటికిఁ' దెగించి వచ్చితిని. నావద్ద సంజీవన మంత్రము కలదు. నేను దానిని నిత్యము మనస్సులో నను కొనుచుందును. ఆ మంత్రాధిదేవత నన్ను రక్షించుచుండును. నా క కాలమృత్యువు కలుగదు.' భూతము 'కలుగక పోవచ్చును. నిన్ను బ్రాణావశిష్టముగా బాధించవచ్చును.' ఇతఁడు 'నాకిది బాధాకాలము కూడఁ గాదు.' భూతము 'నీవా

మొండివాఁడవు. నీ రహస్యమును వాఁడు తెలిసికొనును. దంత కరాళునితోఁ జెప్పును. కరాళుఁడు నిన్ను సంహరించును. ఇతఁడు 'దానికెప్పుడును సిద్ధముగానే యుంటినిగదా! ఈ యాపదలన్నియుఁ గడచిననే నా కోర్కె సిద్ధించును. సృష్టి యారంభమయిన తరువాత ధాత్రిమీఁద జన్మించిన యనంత కోటి జీవులలో సందఱి కోర్కెలు సిద్ధించునని యున్నదా? ఎవనిదో సిద్ధించును. అందఱును శ్రీరామచంద్రుని వంటివారా? బలరామ, కృష్ణదేవులవంటివారా? అర్జును వంటివానికిఁ దుది దినములలోఁ గిరాతులవలనఁ బరాభవము తప్పినది కాదు? భూతము 'నీకర్మము నీది' అతఁడెవ్వరి కర్మము వాని దనుకొనుచుండఁగా మార్గము సువ్యక్తమయ్యెను. అచట భూతమే లేదు. తనకుఁ గన్ను చెదరినది. మఱి జరిగిన ప్రసంగ మంతయు నేమి? అది యతఁడు తన మనసులోఁ దానే నిర్మించి కొన్న వాద ప్రతివాదములు. అట్లు తన మనస్సెందుకు భావించెను? ఆ వెలియోనసుతనరహస్యము తెలిసికొను నేమో యన్న భయముగలదన్న మాట. ఈ వెలియోనసన్నవాఁ డెవఁడు? వానికింత జ్యోతిర్విద్య యెట్లు వచ్చెను? ఈ యనాగరకులలో నీ సత్యతేయులలో నవీన వరాహసదృశ జాతిలో నీ విద్య యెట్లున్నది? ఇది వేదాంగమయిన విద్య. వేదములలోనుండి సర్వశాస్త్రము లుద్భవిల్లినవి. పరమేశ్వరుఁడు తొలుత బ్రాహ్మణజాతిని నిర్మించెను. ఆయన దీక్షిత వాదమును నిర్మించెను. ఇంతా కరాళుఁ డేమన్నాఁడు? ఈ జ్యోతిర్విద్య మేము యవనులవద్దనుండి నేర్చికొన్నామనియా? ఏమి మూర్ఖుఁడు. వానికి బ్రాహ్మణ కర్మస్వరూపము తెలియదు.

బ్రాహ్మణ కర్మలనఁగానేమి? యజ్ఞ యాగాది క్రతువులనఁగా నేమి? వైదికమతము మ్లేచ్ఛుల కెట్లర్థమగును? సృష్టియొక్క రహస్యమేమి? సృష్టి యెట్లు జరిగినది? దీని రహస్యమేమి? భూమండలమునందు మానవు లెట్లుపుట్టినారు? గ్రహగతుల వలనఁ బుట్టినారు. గ్రహగతులే, భూమండలమునఁ బంచభూత వికారములయిన మానవులుగాఁ బరిణమించుచున్నవి. ఖగోళ మండలి జ్యోతిర్మండలములు స్వప్రభావముచేత భూలోకము నందు మానవులుగాఁ బరిణామమును బొందుచున్నవి. తద్గ్రహగతుల యందలి యేకదేశములే మానవులు. భగవంతుఁడు సృష్టియొక్క మొదట నీ పరిణామ రహస్యము ననుసరించి జీవునకు యోగక్షేమములు సంపాదించుటకుఁ శ్రేయస్సులు కలిగించుటకు యజ్ఞయాగాది కర్మలను నిర్మించెను. సర్వకర్మలును గ్రహగతులయొక్క వేళలనను సంధించి చేయఁబడుచున్నవి. తత్కర్మకుఁ దత్కాల గ్రహగతికి సంబంధము. అనఁగా వైదికమతము మహాకాశమునందలి జ్యోతిర్మండల సంచారముతో ననుసరించిన మానవుల ప్రవర్తనయు వారి కర్మకాండమునుఁ గలిపి వాని నొకటిగా భావించి భగవంతునిచేత నిర్మింపఁబడిన మతము. ఇట్టి బ్రాహ్మణులు జ్యోతిర్విద్యను యవనులనుండి నేర్చికొనిరట. ఓరి లింతాకరాళుఁడా! నీమతి మఱగిపోను. ఈయవనులందఱెవరు? వైదికమతభ్రష్టులై యార్యావర్తమునుండి నిష్కాసనము పొందిన బ్రాహ్మణులును క్షత్రియులును శూద్రులును. వారు వేదమతబాహిరులై యవివక్షితాన్న ఖాదులయి జలాభావముగల ప్రదేశములయందు నివసించుచు స్నానాది

శౌచక్రియాదూరులై మోటువారై క్రూరులయి దురాశా పరులై దేహబల మధికముగాఁ గలవారై తొలినాఁ డార్యావర్తమునుండి తెచ్చికొన్న కొన్ని విద్యలలోఁ దజ్ఞానిజీవిత మార్గమునందు సహజముగా మానవసిద్ధి సంపాదించికోఁగల విశేషములనుఁ గనిపెట్టి యవియన్నియు స్వోపజ్ఞకము లనుకొని యా విద్యలకుఁ దమయందు స్వయంసంభవత్వము భావించి కొని తమ యహంకారమువలనఁ దమ దురాశవలనఁ దామే యార్యుల మనుకొనుచుఁ, దమకంటె భారతీయు లనాగరికు లనుకొంచు జన్మభూమిని వదలి జీవితమంతయుఁ బరదేశమున నివసించినవాఁడు తల్లిగడ్డనే మఱచిపోయి యచట నొకస్త్రీనిఁ దన తల్లిగా భావించికొంచుఁ నచట నొకస్త్రీని వివాహము చేసికొని, యామెయందు సంతానముకని తానా దేశస్థుఁడనే యనుకొన్నట్లు, వేల సంవత్సరములమీఁద భ్రష్టులయిన యీ యార్యజాతి తాము వేఱే జాతి యనుకొనుచు శకయవనులయి యార్యావర్తముతో నిత్యమైన విరోధమునుఁ బాటించుచు విక్షిప్తమయిన మనుగడఁ గడపుచున్నారు, ఈ వెలిగోనను మున్నెప్పుడో వాని పూర్వపురుషుఁడు భారతదేశము నందలి జ్ఞాతిశ్వోత్తయై బహిష్కరింపఁబడి దేశమునుండి వెలివఱచఁ బడి యిచ్చటచేరి యా కుటుంబమునందుఁ బరంపరయా యా విద్యను రక్షించికొంచు వచ్చినవాఁడు కావలయును. వానినిఁ బోలు చూతుము. ఈ విద్యలో వాఁడు నాకంటె నధికుఁ డగుట సంభవించదు. భారతదేశమున వేదములనుండి పుట్టిన సర్వవిద్యలు సర్వకాలములయందు నుదయించుచున్న మహా పండితులయొక్క బుద్ధివిశేషముచేత నిత్యనూతనములయి

భాసించుచుండును. యవనులలో నొకవేళ నీవిద్య మిగిలినచో దాని కధికవికాసము కలిగియుండదు. కాని యీసృష్టి విచిత్ర మైనది. ఎవఁడు చెప్పఁగలఁడు? సర్వక్షారమయిన సాగరము నందు మంచినీటి బుగ్గలుండునట. నిర్జలమయిన మహాపర్వత శిఖరములయందు నీటిగుంట లుండును. అట్లు పరమరాక్షస ప్రకృతులయందుఁ గొన్ని శాస్త్రరహస్యములు భాసించును. ఇది యెవఁడు చెప్పును? దానవులకును దేవతలకు భేదమేమి? దేవతలయందు జ్ఞానమును విద్యయు సత్త్వగుణాధిక్యమును గలి గించును. దైత్యులయందు నివి రెండును రజస్తమోగుణ వివర్ధ కములై యుండును. పూర్వము బ్రాహ్మణులు మహాగ్నులను వంద విధములైనవానినిఁ గనిపెట్టిరి. ఎన్నియో యగ్నివంశము లున్నవి. వానినన్నింటిని యజించుటకు భిన్న దేవతలగాఁ జూచిరి. వారితో సర్వలోక సంహారమునుఁ జేయుటకుఁబూను కొనలేదు. అట్లనుటకును నీలులేదు. ఆగ్నేయాది మహాస్త్ర ములు శత్రుసంహారమునకేగదా యుపయోగపెట్టికొనిరి. అను కొనుచున్నంతలో నతఁడు దుబ్బును వదలి కాలువేసినచోఁ జనిపోవుదునన్న యూహకలిగి మూర్ఛగతబుద్ధి యగుచుండెను. ఇంక నూహలేదు. భావన లేదు. బ్రాహ్మణ్యములేదు. శాస్త్ర ములేదు. వైదిక మతాధిక్యములేదు. అచట నున్నది యొక్కటియే, తనకాలు జెసకి తానుజావకుండఁ జూచికొనుట. అతని కప్పుడు స్ఫురించెను. సృష్టియనఁగా నిది. ఎవనికి వాఁడు తన బ్రదుకును దాను బ్రదుకును. ఎవనికి వాఁడుగానైన వ్యక్తిత్వము వానికి వాఁడుగా బ్రదుకుటకు సౌలభ్య మేర్పడి నపుడు గ్రామముగా సంఘముగా జాతిగా నీ వ్యక్తిత్వభావన

చేసి వ్యక్తిగా నున్నప్పటి స్వార్థము పదింతలు చేసికొని వ్యక్తిగాఁ దాను జేయఁగలిగిన యఘమును సంఘమునందు జాతియం దీ వ్యక్తిత్వమును వ్యాపింపఁ జేసికొన్నప్పుడు పాపమును బదింతలుగాఁ జేసి యహంకారము నుబ్బించికొని కడుపు బూరటిల్లినట్లు క్రోధాదులను బెంచికొని భరించలేక పొట్ట పగిలినట్లు తత్ఫలితము నెప్పుడో జాతిగా సంఘముగా ననుభవించుచుండును. ప్రాగ్దిశయందలి యా గుహాద్వారము నతఁడు చేరెను. అతఁడు గుహాముఖమునుఁ జేరువఱకు లోన నిద్దఱు వ్యక్తులు కనపించిరి. ఇద్దరు నేకాకారులు. ఇద్దరు జటాధారులు. ఇద్దరు గడ్డము మీసము గలవారు. ఇద్దఱు సమవయస్కులన్నట్లుండిరి. తింటాకరాళు డిచట నొక్కఁడే పురుషుఁ డుండుననియు, వాఁడు సత్యజీవియనియు, వేయి యేండ్లుగా వాఁడు జీవించుచున్నాఁడనియు, వాఁడు మహాజ్యోతిర్విద్యావేత్తయనియుఁ జెప్పెను. తన కంటికిద్దఱు కనిపించుచున్నారు. నేఁడు తనకు భ్రాంతియే ప్రధానముగా నయినది సుమా! అచట నొక భూతము కనిపించినది. ఇచట నొకఁ డిద్దఱుగాఁ గనపడుచున్నారు. ఈ యేఁబది దినములనుండి తాను బ్రతికిన బ్రతుకు తనకేమయిన నేత్రవ్యాధినిఁ దెచ్చెనా? తెచ్చినచో నది యనుస్యూతముగా సర్వవిషయములందు భాసించవలయును. అచట నా భూతముగా నిచట నొక్కఁడున్న వ్యక్తి యిద్దఱు పురుషులుగ నీరెండు విషయములయందే భ్రాంతి యుండనేల? వానిలో నొకఁడు పెద్దవాఁడును, రెండవవాఁడు చిన్నవాఁడుగా, నవ్యక్తములుగా భాసించెను. పెద్దవాఁ డిట్లనెను. ఓయీ! రమ్ము. నీవు వత్తువనియే యెదురు

చూచుచున్నాను. ఇతఁడు 'నాకీ రహస్యము తెలిసినచో మీకు నష్టములేదా !' వెలిదొరానను నేను దాచినను నీవు లెక్క వేసి తెలిసికొందువు' ఇతఁడు 'నేఁడు చంద్రుఁడు తొమ్మిది కళలవాఁడు. పదునేనవ కళ వచ్చినప్పుడు సర్వ యవనరాజ పరిషత్తును నిన్నుఁ జూచుటకు వత్తురట. తింతాకరాళుఁడు చెప్ప మనెను" వెలిదొరానను "వారు వచ్చినపుడు మే విద్దెలమును గనిపించము. నేనొకఁడనే గన్పింతును ? అతఁ డట్లు మాటాడుచుండఁగాఁ బుష్యమిత్రుని మేనల్లుని మనస్సు గణితశాస్త్రమున బరువు లెత్తుచుండెను. అతని మనస్సున వంద మెఱుపులు మెఱసినట్లుండెను. లెక్క సాగుటయేమి ? ఫలితము భాసించుటయేమి ? చిత్ర చిత్రముగా నుండెను. తన దైవమయిన పరాశక్తి యపరరూపమయిన వృద్ధభార్గవి తన మనస్సులో నాడుచున్నట్లుండెను. తన విద్యలోఁ దన కట్టి స్ఫురణ మున్నన్నడును లేదు. నాఁడు తన మనస్సే తురగవల్గనముగ నడచుచున్నది. అశ్వప్లుతముగా నడచుచున్నది. ఆజానేయధారగా నడచుచున్నది. దానిలోఁ గనిపించిన భూతము సంశయ నివారణము చేసినది. ఎదురుగా నున్న యిద్దఱు మహా జ్యోతిస్సిద్ధాంతులు. వారి జీవితమంతయుఁ దనకుఁ గరతలామలకముగాఁ గనిపించుచున్నది. ఇది వట్టి విద్య కాదు. వేద్యాశక్తి కాదు. వృద్ధ భార్గవీ నిర్వ్యాజ కరుణావిలసనము. తన బుద్ధి యిప్పు డిట్లెందుకు భాసించుచున్నది ? తన రహస్యము ఎవరికిఁ దెలియదు. వారి విద్య మ్లేచ్ఛాభావ నియమితమయి యున్నది. తన విద్య పరమేశ్వరీ కటాక్ష చంద్రికా పరీవాహ మధుధారా

విలసితమయి యున్నది. ఇదియ వైదిక విద్యలకుఁ దదితర విద్యలకు భేదము. వారి విద్యయందు విద్యాత్వముమాత్రమే కలదు. వారి విద్యయందుఁ బరమార్థ మెప్పుడు భాసించదు. భారతీయులు దేవతోపాసకు లగుటచేతఁ బరమేశ్వరి వారి విద్యలయందు వారికి యాథార్థ్యము భాసింపఁ జేయుచుండెను. అతఁ డిట్లనెను "ఓయి వెలిరోమనసా! ఇది యవనులకు మంచికాలము. మగధ రాజ్యమునకు మహావిప్లవ సమయము. భారతయుద్ధము జరిగిన తరువాత మగధరాజ్యమున నిట్టి విప్లవము పూర్వ మెప్పుడును జరిగియుండదు. మగధరాజ్యము పుట్టినతరువాత నేకాదు. సృష్ట్యాదినుండి భారతదేశమున నిట్టి విలక్షణమైన విప్లవము జరుగలేదు. సర్వకాలము తద్విప్లవాభిముఖముగా నున్నది. మీయవనరాజ నీపరిషత్తు నీపాండిత్యము నందు సంశయము కలదిగా నున్నది. వారికి నీవు నీకొండ కొమ్ములనుఁ జూపింపుము. ఆ కొండ కొమ్ములయందలి రేఖాపాత నిరూపిత కోణహేతుక గణితములోని రహస్యము చెప్పుము. వారు విశ్వసింతురు. నిర్వ్యాజిపోదురు. నిన్ను విశ్వసింతురు. నీకొక్క రహస్యము చెప్పెదను. ఇది భారతీయులయిన పూర్వఋషులు గ్రహచారమును గణించు పద్ధతి. మీ పూర్వుఁడెవఁడో దీని నచటనుండి తెచ్చుకొనెను. నీ కది తెలియదు. అది యవనజాతిలో స్వతః ప్రతిభాజన్యమన్న మృషా విశ్వాస మున్నది. అతడు వెడలిపోయెను.

౫

నారాయణభట్టు జ్యోతిర్విద్వాంసులయొక్క పరిషత్తును సమావేశ పఱచెను. ఆ పరిషత్తు పుష్యమిత్రుని రాజభవనము యొక్క ముంగిలి సావడిలో నేర్పడెను. వారిలోఁ గొందఱు ఖగోళ విద్వాంసులు. కొందఱు జైమినీయ పారాశర్యసూత్ర రహస్యవేత్తలు. మఱికొందఱు కాలజ్ఞులు. కొందఱు ప్రశ్న ఖండవేత్తలు. కొందఱు పశుజాతకములనుఁ జదువఁగలవారు. ఈ ప్రశ్న విద్యలో ననేకములయిన శాఖ లున్నవి. తొలుత జ్యోతిషము వేదమునుండి పుట్టినది. అది వేదాంగమయినవిద్య. ఏకర్మ లెప్పుడు చేయవలయునో నిర్ణయించుటకుఁ గర్మలయం దనేకములు గ్రహగతులకు సంబంధించిన వగుటచేతఁ బర మేశ్వరుఁడు సృష్టి చేసినపుడు ప్రధానములైన గ్రహగతులకు సంబంధించిన కర్మల కనుగుణములైన వేదమంత్రములను సృష్టించెను. ఈ సృష్టి విచిత్రమయినది. కల్ప కల్పమునందు మాఱుచుండును. గ్రహములయందు జ్యోతిర్మండలముల యందుఁ దనుబంధియైన మానవసృష్టియందుఁ గల్ప కల్పము నందు ననుస్యూతమై సామాన్యమైన స్థూలవిషయములుండు చునే యుండును. కల్పముల యందలి భేదములు మిక్కిలిగా సూక్ష్మవిషయము లందుండును. ఒకొక్క కల్పము నందలి చరిత్ర యొక విధముగా నుండును. తదనంతర కల్పముల యందుఁ బూర్వాపూర్వ కల్పముల సర్వచరిత్రలు నిలువవు.

వేదమంత్రములే ఖిలములయి పోవుచుండెను. మఱలఁ గల్పము ప్రారంభించినపుడు మహర్షులు వానిని స్మరించిన నాఁటి కచ్చమయిన వేదమంత్రములు తదుక్తములయిన వేదాంగముల యొక్క తత్సంబంధ విషయములు మాత్రమే యుండును. మహర్షులు తమ తపశ్శక్తిచేతఁ దమ మేధాశక్తిచేత నా యా విద్యలవృద్ధి పొందించుచు వచ్చుచుందురు. మానవజాతి వృద్ధిపొందుచున్న కొలఁది వారి కోరిక లతిశయించుచున్న కొలఁది నా యా శాస్త్రములయందు విశేష విషయములు భాసించుచుండును. సర్వశాస్త్ర పరిజ్ఞాన మిట్లే వికాసించుచుండును. వేద కర్మలకు సంబంధము లేకుండ మానవుల కోరికలకు సంబంధించిన పరిజ్ఞానము వృద్ధిపొందుచుండును. ఈలక్షణము జ్యోతిర్విద్యయందుఁగూడఁ గలదు. ఇందులోఁ బ్రశ్నఖండ మొకటి బయలుదేరినది. ఈ ప్రశ్నభాగములో జైమినీయ పారాశర్య మతములకంటె భిన్నమాలైన మతములు కలవు. కొన్ని యవైదికములు కలవు. కొన్ని గ్రంథములు సంస్కృత భాషయందే యుండవు. దేశభాషల యందుండును. వాని పుట్టుకయే దేశభాషలయందు కొందఱు విద్వాంసులు తమ తమ యనుభవములను శాస్త్రజ్ఞానముతో జోడించి గ్రంథములను వ్రాయుదురు. ఆ ఫలితములనుఁ జెప్పువారు లౌకికముగా నధికమైన యాశ్చర్యమును గలిగింతురు. జ్యోతిశ్శాస్త్రమునందు వాస్తుశాస్త్రమునందు నిట్టి రహస్యములు వందలు వేలును గలవు. అయ్యా! నేనొక స్థలమునుఁ గొన్నాను. అది నాకు మంచి దేనా? యని యొక పండితు నడుగఁగా నతఁ డిట్లనెను. 'అది యేమయ్యా, అవి రెండు స్థలములు. నీవొక్క స్థల

మందు వేమి?' ప్రశ్న యడుగుటకుఁ బోయినవాఁడు నివ్వెఱ పోవును. నిజాని కవి రెండు స్థలములు కలిపి వీఁడు కొన్నాఁడు. వాని బుద్ధికది యొక్క స్థలముగానే కనిపించును. పండితుఁ డీమాట యన్న తరువాత నతనికిఁ దెలియును. మఱలఁబండితుఁ డిట్లనును. 'ఆస్థలము గొనినంతనే నీవు నీవద్దకు రావలసినది వాయవ్యభాగము నందున్న వేపచెట్టునుఁ గొట్టివేసితి వేమి? స్థలముయొక్క శుభము దానితోఁ జెడిపోయినది.' అనఁగా నా ప్రశ్న వేసిన వాని గుండియ జాఱిపోవును – ఒక పండితునిఁ దన యింటికిఁ బోయి చూపించుటకు గ్రామాంతరము నుండి యొక గృహస్థు తీసికొని పోవుచున్నాఁడు. అది వర్షాకాలము. దారి బురదగా నున్నది. ఒకచోట నొక గండి యున్నది. ఆ గండి దిగి పోవలయును. ఆ గృహస్థు ఈ గండియే మా యూరికే ప్రయాణము చేయుటకు బాధాకరముగా నుండు నండీ యనును. ఆ పండితుఁడు పూర్వ మా యూరికి వచ్చిన వాఁడు కాఁడు. ఆయన యిట్లనును. ఈయొక్క గండియందు వేమి? ముందున్న గండిమాట చెప్పవేమి? అనఁగా గృహస్థు తెల్ల డిల్లిపోవును. ఇట్టి చిన్న చిన్న విషయములు తెలిసికొను టకుఁ దగిన సూక్ష్మ సూక్ష్మములయిన గ్రహచలనము వారి గణితము వాని స్ఫూర్తి మొదలయిన వాని సంబంధించిన విస్తారత యీ శాస్త్రమునందు జ్యోతిర్విద్వాంసులు ప్రపంచిం చిరి. గ్రహములు వాని నడకయే కాదు. మనుష్యుఁడు మాటాడును. చేయి త్రిప్పును. ఒక పద్ధతిగా నిలుచుండును. సర్వము శాస్త్రవిషయముగా నా పండితుఁడు మాకు విస్త రింపఁ జేసిరి. వీనికి మూలకారణ మొక్కటియే. ఈలోకము

నందుఁగల సర్వవిషయము లొకదాని కొకటి సంబంధించినవి ఈ పురాతన సృష్టియొక్క చరిత్రమంతయు ఖగోళగత జ్యోతిర్మండల చారమున కెట్లు సంబంధించినదో భూలోకమందున్న భిన్నవిషయములు పరస్పర మొకదానితో నొకటి సంబంధించినవి. ఒక దాని లక్షణము రెండవ దానిని వ్యాఖ్యానించును. అది దీని ననుసంధించియే యుండును. ఇదియొక్క యఖండమైన సృష్టి. అంతయు నొక్కటియే. ఈయనంతత్వ మందలి యేకత్వమును భావనచేసి నిరూపించి పరస్పర సంబంధముయొక్క నియమములు లక్షణములు తెలిసికొన్న భారతీయ విద్వాంసుల కీవిద్య కరతలామలకమయి యున్నది. ఈభాషలో భగవంతుఁడన్న శబ్దము విచిత్రమైనది. భగవంతుఁడనఁగా భూతభవిష్యత్తు ద్వర్తమానములు తెలిసినవాఁడు. ప్రాణముయొక్క రాకడ పోకడ తెలిసినవాఁడు. వైదికమతేతరులయొక్క శాస్త్రజ్ఞాన విరహితమయిన యొక మూఢవిశ్వాసము భగవంతుఁ డెచ్చటనో యున్నాఁడని. భారతీయుల విశ్వాస మట్టిది కాదు. భగవంతుఁడు, దేవుఁడు, మొదలయిన శబ్దములయొక్క వ్యుత్పత్త్యర్థముల విచారించినచో భారతీయ విజ్ఞానముయొక్క శాస్త్రమూలత్వము తెల్లమగును. దేవుఁడనఁగాఁ బ్రకాశించువాఁడు. ప్రకాశము, జ్ఞానము, ఉనికి, ఆనందము. వీనిచుట్టును భారతీయ విజ్ఞానము, పర్యటించినది. వాని యంతరాంతరములకుఁ బోయినది. ఇంతటి గూఢమయిన మతరహస్యములను దెలిసికొనుట సామాన్యబుద్ధులకు బరువయి యీ బరువుతోఁ బాటు సీపరమసూక్ష్మ సూక్ష్మవిషయముల నుపాసించి ఫలమును బొందు

టకు నిర్మించఁబడిన కర్మకాండము నాచార సంపత్తి నియమములు మొదలయిన వాని నాచరించుటయందు సోమరులయి జనము మ్లేచ్ఛులు కాఁజొచ్చిరి. వైదిక మార్గమునుండి పరిభ్రష్టులైరి. పరమ విజ్ఞాన పేటికయైన వేదమతమునుండి బాహిరులయిరి. తనకుఁ దెలియనిది లేదన్నట్లు, తనకుఁ దోచనిది గాదన్నట్లు, తానెఱుఁగనిది మృషయన్నట్లు, మ్లేచ్ఛభావము విజృంభించెను. సృష్టిలోనున్న దోషమేమియో తెలియదు. విజ్ఞులయొక్క సంఖ్య తక్కువ. అజ్ఞుల సంఖ్య యెక్కువ. లోకము తేనెపట్టు వంటిది. మధుభాగము కొద్ది. కీటకభాగ మెక్కువ. అంతకును మధుకోశమని పేరు. మధుభాగము తెలియని మూర్ఖులు కీటభాగమునందు మధువు లేదని నిందింతురు. మధుకోశమన్న మాట, నేతిబీరకాయ వంటిదందురు. ఇట్లుండఁగా వైదికమత నిందా పరులయినవారే పోయి వారు వారు భిన్నజాతులుగా నేర్పడిరి. వారిలోనుండి మఱల విద్వాంసులు బయలుదేరిరి. ఇది మహా చైతన్యము. ఎచ్చట నేవివేక ముదయించునో తెలియదు. ఆ మ్లేచ్ఛాలయం దుదయించిన మహా విద్వాంసులు క్రొత్త క్రొత్త విషయములనుఁ గనిపెట్టుదురు. వారికి వేదమునందలి రహస్యములు తెలియవు. పరమార్థమయిన విషయము తెలియదు. పరమేశ్వర భావసంబంధము లేని మానవబుద్ధి యెంతవఱకు వికసించునో వారి బుద్ధి యంతవఱకు వికసించును. పరమేశ్వరుని దయ వారియం దంతవఱకే. ఒక్క సంగీతవిద్య యున్నది. ఆవిద్య వేదముతోఁ గలిసి పుట్టినది. సామవేదములో నుండి పుట్టినది గానము. వేదాంగము హోమాంగము. ఆ సంగీత

విద్య స్వరప్రస్తారము చేయఁబడి స్వరములు కనుఁగొనఁబడి విడిగా వృద్ధిపొందినది. పొంది కూడ భారతదేశమున భగవత్ప రమై ప్రవర్తించినది. మ్లేచ్ఛులయం దీ సంగీతవిద్య దాని కదిగా వృద్ధిపొందినది. పరమేశ్వరునకు దానికి సంబంధము లేదు. ఈ సృష్టిలో నే విద్యయైనను నే జ్ఞానమైనను నే విషయ మైనను భిన్న విషయముల సమాహారమువలెఁ గనిపించును. విభజించి చూచునప్పటికి భిన్న విషయములు కనిపించును. ఒక రసాలఫలము కలదు. శాస్త్రపరిశోధకుఁ డేమిచేయు ననఁగా దానిని విభజించును. దానియందుఁ గొంత జలమున్నది. కొంత ఘనపదార్థమున్నది. ఆ ఘనపదార్థమేమి? మృద్వి కారము లయిన కొన్ని లవణములయు గొన్ని ఖనిజములయు సమ్మిశ్రణము. ఇట్టివన్నియుఁ గలిసినచో రసాలఫల మైనది. ఆ రసాలఫలమునందలి రసము జలాధికముగల వస్తువు. దాని నదిగ సేవించినచో నొక రుచి కలదు. ఫలము ఫలముగా సేవించినచో వచ్చెడు తృప్తివేఱు. దానినుండి రసమును విడఁబఱచి సేవించినప్పుడు రుచి కలదు. అట్లే సంగీత విద్యయు నితరములైన యెల్ల విద్యలవలెను పరమేశ్వరాను బంధముగ నుపాసింపఁబడినపుడు నిర్వృతి హేతువగును. ఏకదేశ భోగమునందు రుచి యుండును. సంగీతమట్టిది. పట్టి స్వరమేళనము కలిగిన యొకరాగమో రాగచ్ఛాయయో శ్రవణపేయముగా నుండును. అది యంతటితోఁ బర్యవసిం చును. మఱియు నీ స్వరములు సర్వసృష్టియందున్న సర్వ ధ్వనులయందును వ్యాపించియున్నది. ఋషభము వృషభ కంఠధ్వని వంటిది. ధైవతము హేషవంటిది. పంచమము కోకిల

కూడినది. ఈ విద్యలోనున్న మూలసూత్రములును బ్రహ్మాండ
కమునకు బాహిరములయినవి కావు. పదార్థముల గుణము
ధ్వని జ్ఞానము భ్రమణము చలనము మొదలయిన లక్షణ వి
షయముల సమాహార మీసృష్టి. ఇవియన్నియు నొక దానితో
నొకటి యిమిడి యున్నవి. నిత్య సంబంధము కలవి. పరమార్థ
పరిజ్ఞానమునకు వీని సమష్టి స్వరూప వివేకము కలుగ
వలయుననుట వైదికమతముయొక్క యాయువు పట్టు. చేత
కదిగా సేవించి, దానికదియే పరమార్థమనుకొనుట మ్లేచ్ఛ
మార్గము వైదికమత భ్రష్టులగుగా వీరు వైదికమత భ్రష్టు
లనంగా నిది.

పుష్యమిత్రుఁడు జ్యోతిర్విద్వాంసుల యొక్క యీ
సమావేశమును సమకూర్చుటకు హేతువేమనఁగా నీవిద్వాంసు
లందఱు తలాయొక శాఖయందు నిష్ణాతులు. పుష్యమిత్రు
నకుఁ గావలసినది తద్భిన్న శాఖాపరిజ్ఞాన సమాహార విష
యము. ఒకటి నాఁటి గ్రహస్థితి యెట్టిది? వైదిక మతమున
కనుకూలమైనదియా? కాదా? సృష్టి వాని సర్వకాలము
వైదికమతమున కనుకూలము కాదు. అన్ని కాలములు నే
యొక్కదానికి ననుకూలములు కావు. సోమకాసురుఁడు వేద
ములను దొంగిలించిన కాలము వేదముల కనుకూలమైనదా?
హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు రావణుఁడు మొదలయినవారు
వేల సంవత్సరములు విజృంభించి క్రతుధ్వంసముచేసి బ్రాహ్మణ
హింసచేసి స్వర్గకవాటములను భేదించి గంగరేవులలోఁ బశు
మాంసమును గ్రోలి భాగీరథీ కచ్ఛాంబుపూరములయందు నెత్తురు
నీటి పడియలు కట్టించిన కాలము వైదికమతమున కనుకూల

మయినదియా? వారు స్థిరముగా నుండిరా? వారున్నప్పుడు వారు తామే స్థిరమనుకొనలేదా? అపుడు వారు స్థిరము గాదన్నవానిని వారు హింసింపలేదా? ఇది యింతటి పను త్కారమయిన సృష్టి. వైదికునకు మ్లేచ్ఛునకిదియే భేదము. మ్లేచ్ఛుఁడు తాను బ్రదికియున్నకాలమే సర్వకాల మనును. వాఁడు తత్కాలమరణము చేయును. వైదికుఁ డనంతకాల భావన చేయును. నిత్య వస్తు భావన చేయును. వైదికున కీసృష్టి యనిత్యము. చంచలము. వినశ్వరము. మ్లేచ్ఛున కీ సృష్టి నిత్యము. నిశ్చలము. సర్వసృష్టి కైవసము చేసికొంటి నన్న మ్లేచ్ఛుఁడు శత్రువులను గెలుచును. రాజ్యములను సంపాదించును. ధనము ప్రోవుచేయును. అవధిలేని యధికార మున కావటిల్లు చుండును. సర్వసృష్టికిఁ దాను హాయిచేసి కొంటి ననుకొనును. ఆ మఱునాఁడు వాని భార్య చని పోవును. వానికొడుకు వ్యాధిగ్రస్తుఁడగును. వానిసేన యొక చోట నిర్ఘాత మగును. మఱి వాఁడు సృష్టి నేమి గెలిచినట్లు? మ్లేచ్ఛునకుఁ గొఱవడిన జ్ఞానమిది. వైదికునకు వైదికేతరునకు భేదమిది. ఈ వైదికుఁడు నా మ్లేచ్ఛుఁడు లోకమునందుఁ దనవతె రమించక పోవుటచేత ఛాందసుఁ డగును. వైదికుని మహా స్వరూపము శబ్దార్థమునందే నలదు. ఛందస్సనఁగా వేదము. ఛాందసుఁ డనఁగా వేదార్థమునందుఁ బరినిష్ఠితమయిన బుద్ధి గలవాఁడు. వేదముయొక్క పరమార్థమే లోకముయొక్క యనిత్యత్వము. చైతన్యముయొక్క నిత్యత్వము.

రెండవది యనుకూలమయినచో నా యానుకూల్య మెట్లు సిద్ధించును? ఏమార్గమున సిద్ధించును? ఎవనివలన

సిద్ధించును? ఎట్లు సిద్ధించును? ప్రయత్న మెట్లు చేయ వలయును? ఇట్టివి వంద విషయములు తెలిసికొన వలయును. వంద విషయములు వంద మందినుండి తెలియవలయును. ఒక శాకము మిక్కిలి రుచిగలది. ఆ రుచిని సాధించుటకు భిన్న వస్తువుల సమాహారము జరుగవలయును. ఏవస్తువున కావస్తువు స్వచ్ఛమైనదిగా నుండవలయును. ఆగొప్పరుచికై దానియందు సమకూర్పఁబడవలసియున్న బహు వస్తువులలోఁ బ్రతి వస్తువు స్వచ్ఛమయినది కావలయును. పుష్టికలది గావలయును. జాగ్రత్తగా వండవలయును. ఏవిధమయిన యశ్రద్ధయుఁ బనికి రాదుఁ అప్పు డారుచి సిద్ధించును. శాకము లవణక్షారము హింగువు జీలకఱ్ఱ యావాలు మెంతులు కఱివేపాకు మొదలయిన వస్తువు లన్నియు స్వచ్ఛములైన వైనచోఁ గూర రుచి లేదు. ఇందులోఁ గొన్ని యుండును; గొన్ని యుండవు. వంకాయలు పడిలిపోయి యుండును. జీలకఱ్ఱ పుచ్చిపోయి యుండును. అంగడికిఁబోయి యింగువ తెమ్మని యెవనినో పంపినచో వాఁడు పాలయింగువ బదులు బాలింతరాండ్రకు వేయు నింగువ తెచ్చును. వాసనయందలి మోహము వదలని వారు దానినే యుపయోగింతురు. ఇట్లొక్కకూర లోకమునం దెన్ని విధములుగ వండఁబడును. సంపూర్ణమయిన రుచి కలుగునట్లుగా నెప్పుడు వండఁబడునో తెలియదు. ఇదియొక్క చిన్ని యుదాహరణము లోకవృత్తమంతయు నిట్లే యుండును. పుష్యమిత్రుఁడు వైదికుఁడు వేదకర్మలయందు నిష్ఠ కలవాఁడు వేదముయొక్క భిన్నశాఖలయందుఁ బరిజ్ఞానము కలవాఁడు. భారత యుద్ధ మయిన తరువాతఁ బదునేనువందల సంవత్సర

ములు గడచిన తరువాత నందుఁడు సర్వక్షత్రియ వంశము
లను నిర్మూలించిన తరువాత బౌద్ధమతము ప్రబలిన తరువాత
వైదిక మతమున కాశ్రయము పోయిన తరువాత దేశము
క్షీణించినదని దుఃఖించునా? నిత్యమయిన వేదధర్మమునకు
మరలఁ గొన్నాళ్ళయినఁ బునరుద్ధరణము జరుగునా యన్న
యూహతో నేయంశము నందును శోకములేని ప్రయత్నము
చేయవలయునన్న పట్టుదలతో నింతటి ప్రయత్నము పరమే
శ్వరుఁ డనుకూలించిన వానినే సఫలముగునన్న యెఱుకతో
నీ సమావేశమునుఁ జేయించినవాఁడు. ఆ సభలో నారాయణ
భట్టుకంటె నధికులయిన పండితులు కలరు. కాని నారాయణ
భట్టునకుఁ బుష్యమిత్రుఁడు ప్రాధాన్య మిచ్చెను. ఎందుచేత
ననఁగా మహాసేనాపతికిఁ దన యశ్వముమీఁద మిక్కిలి
మక్కువ. అది యుచ్చైశ్శ్రవమువంటిదని యాయన భావము.
తాను మగధరాజ్య సర్వసేనాధిపతి యైనచో నా గుఱ్ఱము
వచ్చిన వేళా విశేషమని యాయన విశ్వాసము. ఆ గుఱ్ఱము
హింసింపఁబడి వధింపఁబడినదని నారాయణభట్టు చెప్పెను. దాని
జత గుఱ్ఱ మున్నది. అవి రెండును గవలలు. సామాన్యముగా
సర్వజంతువులయందుఁ గవలలు సమానమైన భాగ్యరేఖలు
కలవిగా నుండును. కించిద్భేదమున్నను వాని జాతకములు
జంటగా నడచును. కవలలో నొకఁడు జ్యేష్ఠుఁ డొకఁడు కని
ష్ఠుఁడు. భాగలు లిప్తలు కళలుమాత్రమే యెడముగా నుద
యించెడి యీ కవల లొకటే లగ్నమునందు జన్మింతురు.
గ్రహసంపుటి యొకటిగానే యుండును. అందుచే తన రెండవ
గుఱ్ఱముకూడ వధింపఁబడును. దీని కథ యెట్టిది? దాని కథకు

దీని కథకు నేమి సంబంధము? ఆ పండితుఁ డాయశ్వ మార్యా వర్తమున కీశాన్యభాగమున నొక్క దేశమందు హింసింపఁబడి వధింపఁబడెనని నని చెప్పెను. ఆన మేసల్లుఁడు యవనరాజ్యములకుఁ బోయి యుండును. అనట వానినిఁ బట్టికొని. ఆ గుఱ్ఱము తనదియు సర్వమైన యార్యావర్తమునఁ దేలియును. తానా గుఱ్ఱమామీఁద నెక్కి యార్యావర్తమునందలి పలు రాజ్యములలోని విచారములు నణచి వచ్చినప్పటి తన వరా క్రమమునకుఁ గారణభూతమయిన యా గుఱ్ఱము నెట్లు రెఱుఁగును? యవనరాజు కాశ్వముమీఁద నెంతకన్నూ? ఆ గుఱ్ఱము వెనుకగాళ్ళతో నెంతమంది య వనులకుఁ గపాలమోక్షము చేసెను? అది చేతిలోఁ జిక్కినచో దానిని ముక్కలు ముక్క లుగా నఱికి దాని మాంసమును దిందుమని యెందఱు శత్రు సైనికులు భావించియుండరు? ఆ గుఱ్ఱము నేఁడు పోయినది? అది యన్నగారు. మిగిలినది తమ్ముఁడు. అన్నగారయిన యా గుఱ్ఱముయొక్క చావునకు బ్రతిక్రియయందుఁ దమ్ముఁడయిన గుఱ్ఱము సాయపడునా? ఈ రెండవ గుఱ్ఱమునుఁ బుష్య మిత్రుఁడు బిడ్డవలెఁ జూచికొనుచుండెనో కాని దాని వీపు మీఁద జీనన్నది వేయలేదు. ఈ గుఱ్ఱము స్వారికిఁ బగదు. యుద్ధమునకుఁ దగదు. ఆరోహణమునకు దగదు. ఈ గుఱ్ఱము ప్రతిక్రియా సాధనము కానేరదు దాని జాతక మెట్టిది? దాని బ్రతుకెట్టిది? నారాయణభట్టు చెప్పవలయును. అందు చేత నారాయణభట్టున కీసభయందు బ్రాముఖ్యము వచ్చెను. నారాయణభట్టు గుఱ్ఱమును చూచివచ్చెను. ఆవేళను గుణిం చెను. సర్వము సిద్ధము చేసెను. పుష్యమిత్రుని మనసులో

ఉన్న సర్వభావములు నారాయణభట్టునకుఁ జెప్పఁబడెను. [illegible]కు తక్కిన సర్వపండితులనుండి పుష్యమిత్రుని సర్వభావములకు సమాధానములు తెచ్చెను. ఏశాఖయందైన పండితుఁడైనవాఁడా శాఖా సంబంధమయిన పుస్తకముఁగల విజ్ఞానము నవలోకనము చేసి స్వప్రతిపత్తికముగా సిద్ధాంతము చేసికొని సభకు వచ్చిరి. సభ తీర్చియుండెను. ఆసనములలో వారినుండి [illegible] సిద్ధయింపకపోఁబోవు సమయములోఁ పుష్యమిత్రునికి రాజువద్దనుండి వార్త వచ్చెను. బృహద్రథుఁడు మహాసేనాపతిని వెంటనే రమ్మనెను. మహారాజ కార్యమేదో యున్నదఁట. పుష్యమిత్రునకుఁ దెలియును. ఏ పనియు లేదు. ఉన్నచో నంతకంటె వ్యర్థమైన పని యింకొకటి యుండదు. అతఁడు రాజు. తాను సేనాపతి. ఆయన కొలువులో మంత్రులు గలరు. వారందఱు బౌద్ధమతాభిమానులు. బౌద్ధులమని చెప్పికొనుచుందురు. తన కాధికారికముగా బౌద్ధులతో సమానమయిన ప్రతిపత్తి కలిగినను వ్యవహారదశయందు వారి యాజ్ఞలు నిర్వర్తింపవలసిన వాఁడు. లోకములలో దుష్టాధికారులు కేవల విగ్రహములయినవా రుందురు. అందఱిలో నధమాధముఁడు చెప్పెడు మాటలు వినెడివాఁడు. వారిలో నధమాధముఁడు బృహద్రథుఁడు. ఆరాజు మంత్రుల మాటలు వినినను సరిపోవును. ఎప్పుడును రాజు చెవిలో నిల్లు కట్టుకొని కూర్చున్నవా రిద్దఱు కలరు - సింహబలుఁడును; శైలాశ్వుఁడును. వారి కేయధికారమును లేదు. వారికిఁ [illegible]బడ లేదు. ఔదార్యమనఁగా నెట్టిదో వారికిఁ దెలియదు. ఉదాత్తమయిన గుణమునకును వారికిని శతయోజన

ముల మేర. వారు రాజునకు దగ్గఱి బంధువులు. రాజు చిన్నప్పుడు వారితోఁ గలిసి యాడుకొనెను. పెద్దయిన తరువాత వారు రాజ్యమునకు చేరికొనిరి. వారి యూళ్ళలో వారు దుష్టముగఁ బ్రవర్తించి, యూస్త్రీల పాడుచేసి, కితవులై, విటులై, గతిమాలి, గిరివ్రజము చేరిరి. నాఁడు మొదలు వారు రాజున కాప్తులయిరి. వారు జోక్యము కలిపించుకొనని రాజకార్యములేదు. రాజు వారిని సమాదరించెడు. నిత్యము వారి మొగముల మీఁదనే తిట్టుచుండును. కాని వారు చెప్పినది చేయుచుండును. పుష్యమిత్రునకు నిట్లనుకొనుటలో నాయూహ వచ్చెను. ఆ వైదిక బ్రాహ్మణుని కూతునుఁ దానీ సైనికులను దోడిచ్చి జ్ఞాతుల యూరు పంపించెను. ఇది యే వ్యవహారమో! ఆ విషయములో పుష్యమిత్రుఁడు రాజుతో ఖండితముగా మాటాడుటకు నిశ్చయించికొనెను. విద్వత్సభతో మఱల సమావేశము మఱునాఁటి ప్రొద్దున నని చెప్పి తాను రాజదర్శనమునకు బయలుదేఱెను. రాచనగరు చేరఁగా రాజచట లేఁడు. రాఁజచ్చట నుండఁడని పుష్యమిత్రునకుఁ దెలియును. ఆయన నిత్యమొక విలాసినీ భవనమున నుండును. అచ్చటి కెవ్వరునుఁ బోరాదు. వీరిద్దఱే పోదురు. రాజు మాటలుగా వీరితరుల నాజ్ఞాపించుచుందురు. ఈ ధూర్తత్వము వారియందు బలిసినది. తాను చాల సార్లు వినెను, మహారాజిట్లు చేయుమన్నాఁడని చెప్పుదురు. ఒకొ్కకప్పుడు రాజామాటఁ జెప్పక పోవచ్చును. వీరిద్దఱట్లు చెప్పినారన్న తరువాత విని రాజంగీకరించును. అది తాను చెప్పిన మాటయే యనును. ఈ యిద్దఱియొక్క దౌర్జన్యము

రాజ్యాసనమందు బలిసిపోవుచున్నది. ఎంతమందియో మరి యూద కలవారు, మహోద్యోగులు, రాజాజ్ఞలు వీరి నుండి గ్రహించుటకు నవకమానముగా భావించుచున్నారు. ఆ యాజ్ఞ యొక్క మంత్రివస్త్రనుండి రాదాయెను. వీరిద్దఱు నసమర్థులు, జూదగాండ్రు, దుర్విటులు, దుర్గమునందున్న పరిచారికలతోఁ దిరుగుచుండువారు. ఆ పరిచారికలచేతఁ దిర స్కరింపఁబడువారు. సేవకులచేత సేవగింపు పొందెడువారు. అయినను వారికి రాజువద్దనున్న చనువుచేత నిర్లజ్జముగా రాజు వద్దకుఁ బోఁగలిగి చెప్పఁగలుగుటచేత రాజు వారినిఁ దిట్టుచున్నను, వీరు సవ్యగలిగినవా రగుటచేతఁ జివరికి వీరిమాట రాజు కాదన లేకుండుటచేతఁ బర్ణవపానమునందు బలము కలిగిన యీ సిబ్బలులు, నీ యబలులు దుర్గమునందుఁ గంటకములుగా నుండిరి. కొలువు చావడిలో రాజు లేఁడు. పుష్యమిత్రుఁడు వెనుదిరిగి వచ్చుచుండెను. వారేమి చేయుదురు? పుష్య మిత్రుఁడు వచ్చినప్పుడు వారు లేచి నిలుచుండవలయును. సువారస్య దొరలవలెఁ గూర్చుండిరి. పుష్యమిత్రున కరికాలి మంట నెత్తికెక్కెను. వారితో మాటాడుట తనకు మర్యాదా నష్టము. అందుచేతఁ దిరిగి పోవుచుండెను. ఇపుడు వారాయ నతో మాటాడవలయును. వారికి గుండెధైర్యము చాలలేదు. వారిలో సింహబలుఁడు, ధూర్జుఁడు. బ్రాహ్మణుఁడయినవాఁడు సేనాపతి యనుటయేమి యన్న దురభిప్రాయము గలవాఁడు. బ్రాహ్మణులు భిక్షుకులు. పౌరోహిత్యము మాత్రమే చేయుట కర్హులు, వివాహాదులు చేయింపవచ్చును. వారు కొన్నిచోట్ల మంత్రులుగా నున్నారు. ఉన్నచో నుండవచ్చును. తెలివి

తేట లోకనిసాత్తా? కాని యుద్ధము చేయుట, పరాక్రమము గలిగి యుండుట, బ్రాహ్మణునందు మందునకయిన కనిపించని గుణములు. అట్టి బ్రాహ్మణుఁడు సేనాపతియా? సింహబలుఁ డిట్టిమాటలు పలుసార్లనుటఁ సు నని పుష్యమిత్రుని దాఁక వచ్చుటయు మున్నే జరిగినది. తన యీ మాటలు పుష్య మిత్రునిదాఁక పోయినవని సింహబలునికిఁ దెలియదు. సింహ బలుఁడు కొన్నాళ్ళు కత్తిపట్టినవాఁడు. అదియొక దురహం కార మతనికి నున్నది. అతఁడు ధూర్తుఁడు. దుస్సాహసము కలవాఁడు. శ్వేతాశ్వుఁడు వెనుఁదీయు చుండఁగా నతఁడు తాను ముందునకువచ్చి యార్యా! యని సంబోధించెను. పుష్యమిత్రుఁడు నిలఁబడెను. నిలఁబడినవాఁడు ద్వారమునకు మొగముంచియే నిలఁబడెనుగాని వెనుకకుఁ దిరుగలేదు. సింహ బలుఁ డిట్లనెను 'మహారాజుగారు తమతో నొకమాట చెప్ప మన్నారు.' పుష్య - 'నాకు మహారాజు వార్త పంపుటకుఁ దమకంటె నింకెవ్వరు దొరుకలేదా?' సింహ 'మేము పనికి రామా?' పుష్య 'మీరు రాజబంధువులు కారు. రాజాధి కారులు గారు. రాజునా కేదయిన వార్త పంపినచో నవి రాజ కీయ విషయమయి యుండును. అది యధికారులద్వారా రావలయును. బంధువులద్వారా సామాన్యపు మాటలు చెప్పుదురు.' సింహ 'ఇది రాజకీయ విషయముకాదు' పుష్య- నే నేదియో గొప్ప రాజ్యకార్యము మీఁద నున్నాను. సామాన్య విషయమునకు నన్నున్న వాని నున్నట్లు రమ్మని వార్త పుచ్చుట రాజుగా రెప్పుడునుఁ జేయరు.' సింహ 'నేనే యీ పనియొక్క తొందఱవలన వార్త పుచ్చితిని.' పుష్య

'మీరట్లు చేయరాదు. మీకు రాజ్యమున్న నేమో, రాజ పురుషు లన్న నేమో, తెలియక పోవుటచే నట్లు చేసితిరి.' సింహ 'ఐనచో మీరు వెళ్ళిపోవచ్చును. నేను రాజుగారి తోడనే మనవి చేసెదను. నేను జెప్పఁబోయితిని. వారు వినలేదు. ఇవి రాజుగారి యభిప్రాయమని చెప్పినను వారు తిరస్కరించిరని చెప్పుదును.' పుష్య 'నేను రాజాజ్ఞనుఁ దిరస్కరించ లేదు.' సింహ 'ఇది తిరస్కరించుట యే.' పుష్యమిత్రుఁడు సింహబలునివంకఁ జూచెను. సింహబలుఁడు వణఁకిపోయెను. పుష్యమిత్రుఁ డా సంగతి యేమియో చెప్పుమనెను. సింహబలుఁ డిట్లు చెప్పెను' గిరివ్రజపురమునకు దక్షిణదిశగాఁ బది యోజనముల మేర మహాదేవాట్టమను నొక పట్టణము కలదు. ఆ యూరిలో ధనవంతులయిన బ్రాహ్మణులు కలరు. కొందఱు రాజోద్యోగులుకూడఁ గలరు. ఆ యూరిలో బౌద్ధులసంఖ్య తక్కువ. పుల్కసులు, వేఱే గూడెము కట్టికొన యున్నట్లు బౌద్ధు లచట నొక గూడెమున లెఁ గట్టికొని యుండిరి. ఆ యూరిలో బౌద్ధ విహారము లేదు. బౌద్ధ విహారము లేని గ్రామమునందు ధర్మముండదు. నిర్వాణము లేదు. ప్రతి గ్రామమునందు బౌద్ధ విహార మొకటియుండి తీఱవలయునని మగధరాజవంశముయొక్క నిశ్చయము. ఆయూరిలో విహారనిర్మాణము చేయుటకు ధనవంతులవద్ద డబ్బు ప్రోవుచేయవలసి వచ్చెను. ఆ బ్రాహ్మణులు ధనమీయ లేదు; సరికదా బుద్ధుని బౌద్ధమతమును పిటకములను సుత్తములను నిందింప సాగిరి. అప్పటికిని బౌద్ధు లూరకుండిరి. విహార నిర్మాణసమయమునఁ బండిలో రాయి తోలనీయరు. సున్నపు గానుగ నాడనీయరు. ఎక్కడి

కక్కడికి నడ్డంకునే పెట్టుచున్నారు. వారు ధనవంతు లగుట చేత నూరిలోని సామాన్యప్రజ వారిమీఁద నాధారపడియుండు టచేత నొకబండి నిచ్చినను నొక యెద్దు నిచ్చినను బ్రాహ్మణులు వారిని దండించుటచేత నాగ్రామమున విహారనిర్మాణము సాగుటలేదు. విహారము మొదలుపెట్టి యేఁడాది యైనది. ఇంతవఱకు గోడ లడుగెత్తయిన లేవలేదు.' పుష్య 'ఈసంగతి నాతోఁ జెప్పుట యెందులకు?' సింహ 'వారికి మేము మీరిట్లు చేసినచో రాజుగారితోఁ జెప్పుదు మంటిమి. వారు తమకు మహాసేనాధిపతి యున్నాఁడన్నారు. అంతుకని.

౬

వారన్నట్లు నేను బ్రాహ్మణుఁడనే. సాత్త్వికవృత్తిని. నాయందుఁ బరాక్రమము లేదు. నాకు యుద్ధనీతి తెలియును. వ్యూహనిర్మాణకౌశల మున్నది. అందుచేత నేను మహాసేనాపతి నైతిని. మనుజుల మెడలు కత్తిరించలేను. ఈ జగత్తంతయు నశాశ్వతమని నాకుఁ దెలియును. క్రియావేశయందా భావమునకుఁ బ్రాధాన్య మీయనుగాని లేనిచో నేనొక సన్న్యాసిని. వైదికమతము చెడిపోవుచున్నదన్న దుఃఖము నాకెంతయున్నదో దానికి నేనా కర్తనన్న వైరాగ్యము నాకంత కలదు. నాకుఁ దత్కాలావేశము కలుగును. మఱు నిముస మందది సమసిపోవును. నేనుక్రియానిష్ఠుఁడనుగాను. నేను దేనియందైనఁ దీవ్రాభినివేశము చూపించినచో నది పరమేశ్వరోద్దేశ

ముచేత నడచుచున్నదిగాని నిజానికి నేఁడి యేమయిపోయిన నాకేమి? భగవంతుఁ డేమన్నాఁడు? నీ యధికారము కర్మ యందే యున్న దన్నాఁడు. ఫలమునందు లేదన్నాఁడు. కార్తాంతికులు చిత్ర చిత్ర విషయములనుఁ జెప్పినారు ఆ గుఱ్ఱము మేధీయాశ్వ మగునట. అది యశ్వమేధీయాశ్వ మగునట. అది యశ్వమేధమున సంహరింపఁబడునట. అశ్వ మేధము చేయుటకు నేఁడు సుక్షత్రియు లెవరున్నారు? వారు సర్వభారత దేశమును జయించి సర్వధాత్రీశానులయి గుఱ్ఱ మును వదలిపెట్టి దానిని పట్టికొన్నవారిని జయింపఁ గలిగిన పరాక్రమశాలులగు సేనానులు కలవారై తాము దీక్షితులయి కూర్చుండి యిట్టిమహాకార్యమునుఁ జేయఁదగిన సుక్షత్రియుఁడు క్షత్రియులే లేని కాలాన నెచటనుండి దొరకుదురు? ఈ బృహద్రథుఁడు శూద్రుఁడు. నందుని మొదలు సర్వార్యా వర్తమున రాజులందఱు శూద్రులైరి. వారికిఁ గర్వలేశం బభిమానము లేదు. మేము క్షత్రియుల మనిపించుకొన వలయు నన్న నభిమానముకూడ లేదు. క్షత్రియులై యుండుటయే యొక దోషముని భావించుచున్నారు. ఈ బృహద్రథుఁడు వృద్ధుఁడు. ఇతనికి సంతానము లేదు. వీని తర్వాత రాజ్య మేమగును? బౌద్ధులు దీని నాక్రమింతు రేమో? అపుడుగాని యిది పూర్తిగా సన్యాసి రాజ్యము కాదు. ఈ సింహబల శ్వేతాశ్వు లిద్ద ఱున్నారు. వీరును వృద్ధులు. వారి పుత్రు లున్నారు. వారికంటె దుశ్శీలురు లేరు. ఆఱుగుఱు మంత్రు లున్నారు. వారిలో రాజకీయవేత్త యన్నవాఁడు లేఁడు. అందఱును ధనము నెట్లుసంపాదింతుమా యన్న ప్రశ్నకలవారే,

వాఁడుపోయి రాజుచేత నాల్గు గ్రామములు వ్రాయించి కొనును. వీఁడు పోయి పది యూళ్ళమీఁది కప్పమునకుఁ దా నధికారియై యట్లు రాజునుండి వాగ్దానము తీసికొనును. ఆ రాజొక విచిత్రమయినరాజు. అన్నియును మంత్రులుమాటతోనే జరుగును. అతఁడు నిత్య సురాపానమత్తుఁడు. ఆ సురాపాన వివశత్వమున నుంతి తూలఁగినపుడు వీరుపోయి యీ సంగతి మనవిచేయుదురు. ఆయన యర్ధస్మృతి కాలమున నంగీకరించును. ఒడలు తెలియని సిషము లేనట్లు తదర్ధస్మృతి కాలమునఁ జేసిన వాగ్దానము కూడ జ్ఞాపకముండుటయే మనస్సుయొక్క విచిత్రమయిన జాగ్రత్త. వీరినందఱినిఁ దలఁదన్నిన వాఁడు గలఁడు. వాఁడు శతానీకుఁడు. వానివలన రాజ్యమునకుఁ జేటు రావచ్చును. వాఁడు రాజ్యము మీఁదఁ గన్నుగలవాఁడు. అందఱికంటె వానిబలమే గొప్పది. ఇప్పుడు వాని చెల్లెలధికారములో నున్నది. రాజునకు నూఱేండ్ల వయస్సు. వాని చెల్లెలు కుముద్వతి యిరువదియేండ్ల బాలిక. రాజు దానిని వివాహమాడినాఁడు. దివారాత్రములు దానితో మనుచున్నాఁడు. అది తన యన్నగారెట్లు చెప్పినచో నట్లు చేయును. దానిమాట కెదురులేదు. అదివఱకే రాజు సురాప్రియుఁడు. వీరు వచ్చిన నైదేండ్లనుండి రాజుయొక్క సురాప్రియత్వము మిక్కిలిమీఱి పోయినది. వారికది కులవిద్య. వారి తల్లి కల్లు నమ్మెడిది. దాని నొక బ్రాహ్మణుఁడు పెండ్లియాడినాఁడు. వానికి వీరిద్దఱు సంతానము. శతానీకుఁడును కుముద్వతియు, వానియందుఁ గలిగిరి. ఆ కుముద్వతి లోకోత్తర సౌందర్యవతి. ఆ బ్రాహ్మణుఁడు తన యీ సంతానమునం

సమిత్రసేన కలవాఁడు. దానికి సౌందర్యమున కది రాణి కావలయును గాని మఱియొకని భార్య యగుట కిష్టము లేక సర్వక్షేత్రముల మీఁద మంత్రియైన భద్రగజుని ప్రాపకమున రాజునకు దానినిఁ జూపించెను. ఆ భద్రగజుఁడు హాలాప్రియుఁడు. అతఁడొకనాఁడు పరి గ్రామమునకుఁ బోయెను. ఒక బ్రాహ్మణుఁడతనిఁ జిత్రవిచిత్రములయిన సురావిశేషములను కాచి సమర్పించి తన కూతును రాజునకు భార్యగాఁ జేసినచో వాఁడే ప్రధానమంత్రి కావచ్చుననియుఁ, దన కూతురతని పెంపునఁ గృతజ్ఞురాలయి యుండుననియు, నాశపెట్టెను. తన కుమారుఁడైన శతానీకుఁడు వ్యర్థుఁడు. వానికి భిన్న విధములయిన సురలను సిద్ధము చేయుట కూడఁ జేతకాదు. సురాపాకములన్నియుఁ దండ్రియైన బ్రాహ్మణుఁడే చేయును. వాఁడు బ్రాహ్మణ్యమును వదలి కొన్నియేండ్లయ్యెను. వైశ్యఁ జేర్చికొనెను. వాని భార్యయు కల్లులను విక్రయించుచుండును. వాఁడు సురావిశేష పాకవిద్యయందు నిష్ణాతుఁడు. వారెంతో ధనము సంపాదించిరి. ఆ ధనమును తినుచు శతానీకుఁడు గామ్యకాఁడై తిరుగుచుండెను. కుముద్వతి రాజు భార్యయైనచో శతానీకుఁడు రాజబంధు వగును. వాని కొక రాజమర్యాద ఘటిల్లును. ఆ బ్రాహ్మణుఁడు తన సురాపాక సాధన విద్యచేత రాజునకుఁ బ్రియుఁ డగును. కుముద్వతి రాణి యగును. రాజునకు సంతానము లేదు. కుముద్వతియందు రాజునకు సంతానము కలిగినచో సంతకంటెఁ గావలసిన దేమున్నది? తన దౌహిత్రుఁడు ప్రజాపాలకుఁ డగును. కానిచో శతానీకుఁడు రాజు కావచ్చును. ఇట్టి యూహాలతో నా

బ్రాహ్మణుఁడు భద్రగజుని మోహపెట్టి తన కూతురు వానికి కంటఁబడునట్లు చేసెను. వృద్ధుఁడయిన రాజు కుముద్వతిఁ జూచినంతనే మహా మోహగ్రస్తుఁ డయ్యెను. ఆమెను వివాహము చేసికొనెను. ఆ బ్రాహ్మణుఁడును వాని భార్యయును గోటలోనికి వచ్చిరి. కోట కల్లుపాక యయ్యెను. కోటలో నొక మహాభవనము భిన్న సురాపాకములకు స్థానమయి పోయెను. కుముద్వతీ సౌధ మానురానిర్మాణ సౌధము సయి యుండెను. శతానీకుఁడును భద్రగజుఁడును రాజ్యము నందుఁ బ్రధాన పురుషులైరి. వృద్ధుఁడుగాఁ దుదు…చున్న శతానీకుఁడు రాజస్యాలకుఁ డయినంతనే బహారాజ వ్యవహార కుశలుఁ డయ్యెను. వాఁడు చాల నిపుణుఁడు. అయిదేండ్లనుండి వాఁడు సర్వ సేనాపతి యగుటకుఁ జేయుచున్న ప్రయత్నములు విచిత్రముగా నుండెను. తనకతఁడు ప్రతిస్పర్ధి. తన్ను సేనాపతిత్వమునుండి తొలఁగించి తానా యధికారమును సంపాదించుటకు వాఁడు రాజునకుఁ గుముద్వతిచేతఁ జెప్పించును. పరమ రుచ్యమయిన సురాదానవేళఁ దండ్రిచేతఁ జెప్పించును ఒక రాజకార్యమునందుఁ గ్లిష్టత సంభవించినప్పుడు దానికి హేతువు తానుగా భద్రగజునిచేతఁ జెప్పించును. తన తల్లి చేతఁ జెప్పించును. బృహద్రథుఁడు కామినీలోలుఁడు. పరమ సురాప్రియుఁడు. కాని వానికి మూలభూతమైన జ్ఞానము తొలఁగ లేదు. ఇంతవఱకు బెణక లేదు. మీరేమైనను జెప్పుఁడు. పుష్యమిత్రుని మహాసేనాధిపతిగాఁ దొలఁగించుటను వదల లేదయినను జెప్పుఁడు. నేను జేసెదను. ఓరి మూర్ఖులారా! పుష్యమిత్రుఁడు మహాసేనాపతియొక్క పదవినుండి తొలఁగిన

మఱునాఁడు మగధరాజ్యము కుక్కలపాలై యగును. కురు పాంచాల శూరసేనాది దేశములు యవనుల దాసులకు గుడి యగుచున్నవి. పుష్యమిత్రుఁడు తొలఁగిన మఱునాఁడు వారు మగధుల మీఁదికిఁ గూడ వత్తురు. మీ కేమి తెలియును? పుష్యమిత్రుఁడే లేనిచో వారీపాటికి నార్యావర్తమునందలి సర్వదేశముల నాక్రమించియుందురు. పుష్యమిత్రుని యుద్ధనీతి వైశారద్యమువలన వారారాజ్యము నాక్రమించ లేకున్నారు. వారు దాసులను నెఱపుచున్నను వారి నెప్పటికప్పుడు పుష్యమిత్రుఁడు పాఱఁద్రోలుచున్నాఁడు. ఈనాఁడు పుష్యమిత్రుఁడే లేనిచో నార్యావర్త మీనాఁటికే యవన హస్తగతమై యుండెడిది. బౌద్ధమతము వచ్చి యీ దేశమును బాడుచేసినది. దేశమునఁ బరాక్రమ హీనతను జేసినది. దేశమంతయు సన్యాసులచేత నింపినది. ఆ బౌద్ధమతమువలన దేశమునకు గలిగిన యాపద యింతయునంతయునని చెప్పరాదు. ఆనాఁడు చంద్రుని బాహుపరాక్రమము, వందయేండ్ల తరువాతఁ జాణక్యుని నీతియు, భారతదేశమును నిలిపినది. ఓయి! ఒక దేశము సురక్షితముగా నుండవలయునన్నచో నపుడప్పుడుదయించెడి ప్రతిభావంతులచేత దేశమునందు సుస్థితి యుండదు. ప్రతిభాశాలులు పుట్టుదురు. పరాక్రమవంతు లుదయింతురు. వారున్నన్ని నాళ్ళు దేశము తేజోవంతముగా నుండును. వారి తరువాత నధోగతి పొందును. అట్లధోగతి పొందకుండ నొక వ్యవస్థ దేశమునందు నిర్మింపఁబడియుండ నా వ్యవస్థాబలముచేత దేశముయొక్క భద్రత నిత్యముగా నుండవలయును. క్షత్రియులన్న వర్ణము తాదృశ

వ్యవస్థాస్వరూపము. ఆ వ్యవస్థాబలమునఁ గొంత యస్పష్ట డప్పుడు తగ్గినను మొత్తముమీఁద దేశమునకు సేఁగిరేదు. దేశమును మహాపరాక్రమ వంతుఁడైన యొక వ్యక్తియొక్క బలము రక్షించ లేకపోయినను దద్వ్యవస్థాగతమయిన యొక మూలశక్తి దేశముయొక్క భద్రతను బెసగనీయదు. నంయఁ డట్టి వ్యవస్థను నిర్మూలించెను. అతనిచేతఁ బ్రారంభింపఁబడిన యా దోషము దేశమునందు బ్రాహ్మణశక్తి సన్నగిల్లి బౌద్ధ మతము ప్రబలి సంపూర్ణము చేసెను. పుష్యమిత్రునిగుఱించి మీరు నాతో నింక నెప్పుడు నొక్కమాటయైనఁ జెప్పరాదు. నేను సురాపాన వివశుఁడనై యున్నపుడు నాచేత 'నూ' యనిపించి మీ రాతనిసి దొలఁగించినచో నాకు స్మృతి వచ్చిన తరువాత మిమ్ముందఱను వధింపించెదను' — ఇట్టి మాటలు రాజు తిరిగి తిరిగి వారితోఁ జెప్పుచుండుటచేతఁ బుష్యమిత్రునిస్థితి భద్రముగా నుండును. ఎవ్వరును పుష్య మిత్రునివంకఁ దేఱిచూచుటకు వీలులేకుండెను. పుష్య మిత్రుఁడు నవ్వుకొనెను. అట్టిరాజును సంహరించుట యెట్లు? నేను రాజునగుట యెట్లు? నే నశ్వమేధమునఁ జేయుట యెట్లు? నాకు దేనిమీఁదనుఁ గోరిక లేదు. ఈదేశముమీఁద నభిమానము కలదు. వైదిక ధర్మమునం దభిమానముకలదు. బృహద్రథునియందుఁ బ్రేమకలదు. బ్రాహ్మణులట్లు చెప్పు చున్నారు. నేను రాజునగుట నిస్సంశయమట. నే నశ్వమేధము చేయుట నా జాతకములో వ్రాసియున్నదట. నాకుఁ బ్రాణ పదమయిన గుఱ్ఱముయొక్క వధకుఁ బ్రతిక్రియ చేసి తీఱవల యును. నా జీవునిలో నంతరాంతరమున నిగూఢముగ నీ

యశ్వమునందలి ప్రేమ యింత పాతుకొనిపోయిన దేమి ? నాకు దేనియందునులేని మమకార మా గుఱ్ఱమునం దున్నది. ఇది యేమిసృష్టి ? ఆ గుఱ్ఱము నాకు వలపుటూనికి. దాని కేవల దాని చావునకుఁ బ్రతిక్రియకోస ముద్దేశింపఁబడినది. ఆయశ్వ వధకుఁ బ్రతిక్రియ జరుగుటకు నేను గర్తను గావలయును. దానికి నే నశ్వమేధయాగము చేయవలయును. చేయుటకు నేను రాజనుఁ గావలయును. అగుటకు బృహద్రథుఁడు నా చేత వధింపఁ బడవలయునా ? శూద్రుఁడై యింత వైదికాభి మానముగల రాజును నేను జంపవలయునా ? ఆరాజు నిర పత్యుఁడు కావలయునా ? వందయేండ్లు వచ్చి యతఁడు వచ్చి కాముకుఁడు కావలయునా ? రాజ్యమింత యగతికము కావలయునా ? గ్రహములిట్లు విప్లవ హేతుకమయిన కూట మిలో నేర్పడి దీనినుండి బ్రాహ్మణ రాజ్యము సముద్భవిల్ల వలయునా ? బ్రాహ్మణులు సృష్ట్యారంభమునుండి రాజ్యము నెప్పుడును జేయలేదు. అనాదినుండియు క్షత్రియులే ధరా పాలకులు. ఆ స్థితికిఁ గలి ప్రవేశించిన తరువాతఁ బదునేను వందలయేండ్లు జరిగిన తరువాత సర్వ విచ్ఛిత్తి జరిగినది. నందుఁడు నూతనభార్గవుఁడై సర్వ క్షత్రియ రాజవంశము నిర్మూలించెను. ఆపని రాక్షసుఁడు చేసెను. నాల్గువందల యేండ్లు క్షత్రియుఁడయినవాఁడు, రాజన్నవాఁడు లేక పోయెను. ఆ భారమంతయు నేఁడు బ్రాహ్మణుఁడు తన బుజ ములయం దెక్కించికొన కున్నచో వైదికమతము నాశన మగును. భారతదేశము మ్లేచ్ఛదేశమగును. భగవంతుఁ డెచట ప్రథమ మానవసృష్టి చేసెనో, వర్ణములను సృష్టిం

చెనో, వేదములను సృష్టించెనో, యీ దేశమునందే వేదములు నశించునా! ఆ దేశమునందే వేదకర్మలు నాశనమగునా? నాశనమగుచుండ నేను జూడవలయునా? చూడలేని నేను బృహద్రథుని వధింపవలయునా? వధించిన పాపమశ్వమేధ యాగముచేసి పోఁగొట్టుకొనవలయునా? యుధిష్ఠిర చక్రవర్తి జ్ఞాతివధమును జేసెను. తదఘనివారణార్థము వ్యాసమహర్షి వచ్చి యశ్వమేధయాగము చేయుమని యాదేశించెను. అది సముచితముగా నున్నది. ఒక పాపముచేయుట సంభవించెను. దానిని నివారించుకొనుటకు నొక నిష్కృతి చేసెను. దాని కంటె నీస్థితి తలక్రిందులుగా నున్నది. ఆ పాపమున కా నిష్కృతి యున్నది. కనుక నా పాపము చేయుదము. తరు వాత దానికట్లు నిష్కృతి నెఱపుదము. ఇది యేమి పథకము? ఇది సంమజసముగా లేదు. ఈ బ్రాహ్మణులెంత పండితులు? నన్నెంత ప్రబోధించుచున్నారు? ద్రోణాచార్యుఁడు విజృం భించి పాండవ సైన్యమును సంహరించుచున్నాఁడు. ప్రతిక్రియ చేయుటకు వీలులేకుండ నున్నది. చావని యశ్వత్థామ చచ్చి నాఁడని చెప్పవలయును. దానియందబద్ధదోష మున్నది. అది చేయక తప్పదు. యుధిష్ఠిరుఁ డాయబద్ధమునుఁ జెప్పకపోయి నచో సర్వబంధు నాశనము చేసిన పాపము వచ్చును. ఈ రెండు పాపములలో నేది స్వీకార్యము? దేనియందధికదోష మున్నదో? దానిని వదలిపెట్టి యల్పదోషములు గలిగిన పాప మును స్వీకరింపవలయును. ఇపుడు వైదికమతమునకు మహా నర్థము కల్గియున్నది. భగవంతునియొక్క ధర్మము సర్వనాశన మునకు నభిముఖముగా నున్నది. దానినిఁ జూచుచు నే నూర

కున్నచో నాకుఁ బుట్టుగతులు లేవట. నేను సమర్థుఁడ నయి యూరకున్న మహాపాపము నా శిరస్సునందు వచ్చి కూర్చుండునట. ఈ రాజు నాయందుఁ బ్రేమగలవాఁడు; కాని భ్రష్టుఁడు. రాజ్యము పాలించెడిశక్తి యుడిగినవాఁడు. అనుచిత కాముఁడు. అతఁడు నాచేతఁ జంపఁబడక పోయి నను, మఱి కొన్ని యేండ్లకుఁ దనయంతటఁ దానే మరణించును గదా! అది శరీరధర్మము. నే నప్పటివఱకు నూరకుండవచ్చును గద. అట్లు కాదట. గ్రహములు తొందర పెట్టుచున్నవట. అప్పటికి మించిపోవునట. నేనిది వెంటనే చేయవలయునట. ఈ శతానీకుఁడు నీ భద్రగజుఁడు నీ సింహబలుఁడు నీ శ్వేతా శ్వుఁడు నిచ్చట నాయందు విరోధులుగాఁ బ్రవర్తించు చున్నారు. ఆరాజు చలచిత్తుఁడు. నిలుకడలేని మనస్సుకల వాఁడు. ఈ మానవ మనోభావము చిత్రమయినది. వాఁడు రాజన్నమాత్రమున వాఁడన్న మాటను వందమంది పాలిం తురు. అరే, ఈరాజు మతిభ్రష్టుఁడు. ఇతనిమాట పాలించి నచో జగద్ద్రోహమగును. ఈ రాజువలన దేశమున కేమి లాభము? మానవులకీ విచారణయే లేదు. ఆరాజువలన మనము వేతనముఁ దీసికొనుచున్నాము. వాఁడు చెప్పినపనిని మనము చేయవలయును. వ్యక్తియొక్క ధర్మమింత యల్పమనఃపరి ణామ సమయందుఁగలదు. ఎప్పుడా రాజు చంచల మనస్కుఁ డయి నన్ను వధింపుమనునో? ఒకానొకఁడు తక్కిన సర్వ విషయములందు నసమర్థుఁడై యెందుకుఁ గొఱగానివాఁడై గ్రుడ్డిగవ్వయంత వెలచేయనివాఁడై యొక దుష్టమైన రాజా జ్ఞనుఁ బాలించుటయందుఁ బరమతీవ్రుడై యుండును. వాఁ

డెవఁడో తెలియదు. ఒకప్పుడీ రాజు చుట్టునున్న దుర్జనులు రాజాజ్ఞకాని వాక్యమునందు రాజాజ్ఞగా నర్థమును జెప్పి రాజున కప్రియమయిన కార్యమును జేయవచ్చును. ఆపని జరిగిన తరువాత రాజుకూడ విచారించునేగాని యేమిచేయఁ గలఁడు? దుఃఖపడ వచ్చును. అడుగువేయువఱకే మన ప్రయత్నముకాని యది యెచ్చట పడునో, దానియందు మన ప్రయత్నములేదు. ఒకప్పు డడుగుతీయుటకును సాధ్యము కాదు. అందుచేత నే నాలస్యము చేయరాదని బ్రాహ్మణులు చెప్పు చున్నారు. రాజును సంహరించుట నాకెంతపని? సర్వసేనయు నా చేతిలో నున్నది. సేనానులందఱు నాకిష్టులు. నాయున యాయులు. గిరివ్రజపురమును నేను నిముసములోఁ గట్టు దిట్టము చేయవలయును. దుర్గములో నదుపుతెచ్చుట కన్ను మూసి కన్ను తెఱచునంతలోఁ జేయఁగలను. ఇన్నాళ్ళీ దుర్జనుల విహారము సహించితిని. నాకెందుకనుకొంటివి. నేను సేనాపతిని. నాధర్మ మేమనఁగా నితరరాజులు రాజ్యముమీఁద దండెత్తి రాకుండఁ జూచుట, రాజ్యమునందు విప్లవములు రాకుండ రక్షించుట. యవనులు మిగిలిన రాజ్యములవారికి దాడులు వచ్చుచున్నారు; గాని మగధము పొలిమేరలవంక నయినఁ జూచుటలేదు. ఒండు రెండు యవనుల దాడులు మా పొలిమేరలయందున్న గ్రామములమీఁద జరిగెను. వా రచ్చటనే సంహరింపఁబడిరి. యవనరాజులకు వార్తపంపింప నెంచితిని. కాని నా మేనల్లుఁడు చేసెను. వారు దాని నాదరింతురా? మూర్ఖుఁడై వాఁడు నా గుఱ్ఱము నెక్కి పోయెను. వారు దానిని వధించిరి. వాఁడేమయినాఁడో తెలియదు.

దీనితో నొక క్రొత్తవిషయము బయలుదేఱినది. వాఁడు జ్యోతిర్విద్యావేత్త యగుటయేమి? ఈ నారాయణభట్టు పూర్వ మునకుఁ గనిపించుటయేమి, నేను హాస్యమున కతనిని నా గుఱ్ఱ మునుఁగూర్చి ప్రశ్నించుటయేమి, యిది యిట్లు ముంచికొని వచ్చుటయేమి. నేనిట్టి కార్యకారణ సామగ్రీ విశిష్టవాగురా బద్ధుఁడ నగుటయేమి. బ్రాహ్మణులు చెప్పిన మాటలంత సమంజసములుగా నుండుటయేమి, వారైన నేమిచెప్పఁ చున్నారు? అట్టి ప్రియమైనరాజు, నట్టివిశ్వాసముగల రాజునుఁ జంపుట పాపహేతువట. ఆ పాపమును వైదికధర్మరక్షార్థము నేను జేయవలయునట. అశ్వమేధయాగము జేసి యాపాపము నకు నిష్కృతి చేసికొనవలయునట. మఱియు నా బ్రాహ్మ ణుఁడున్నాఁడే, మేధావిభట్టు. ఆయన వాదన మఱియుఁ జిత్ర ముగ నున్నది. అయ్యా! పుష్యమిత్రా! సృష్ట్యాదినుండియు ననంతకోటి జీవు లుదయించినారు. అనంతకోటి జీవులు నశించినారు. ఎన్నిఘోరమైన వధలు జరిగిన వందువు. పూర్వము మహారాక్షసులు చేసిన హింసలకుఁ గావించిన వధ లకు నంతులేదుగదా. ఆ పాపమంతయు నేమయినది? ప్రళ యములు వచ్చినవి. సముద్రములు పొంగినవి. వఱదలువచ్చి నవి. మహాధూమములు చెలరేగినవి. మహాయుద్ధములు వచ్చి నవి. భూకంపములు వచ్చినవి. ఈజగత్తులో నెన్నివిధములుగ మానవులు చచ్చిరి. చంపఁబడిరి. మానవుని బ్రదుకుకంటెఁ బరమాధమమయిన దేమున్నది? అందుచేతఁ బ్రధానమైనది ధర్మముకాని మానవజీవితము కాదు. మానవుఁడు బ్రదుకుట ధర్మరక్షకొఱకు. వైదికమతము ధర్మరక్షకొఱ కేర్పడినది.

మానవుని జీవిత మనిత్యమని చెప్పుచున్నది. మ్లేచ్ఛు లధర్మ నిష్ఠులు. అల్పమానవ జీవితనిష్ఠులు. కాని యింత సృష్టిలో మానవ జీవిత మల్పవిషయమైనను దానికిఁ బ్రాధాన్యముకలదు. దాని ప్రాధాన్యము పరిగణించిన నాధర్మప్రాధాన్యము పాటింపఁబడును. ఈసృష్టియెంతగిజిగాని గూడుగానున్నది. తీగ కదిపినచో డొంక కదలును. కల్పాంతమందు సర్వమును నశించును. కల్పాదినుండి కల్పాంతమువఱకు నడుమఁ గొన్ని కోట్లసంవత్సరములు. మానవుని జీవిత మల్పమయినది. ఈకాల మున మిక్కిలి బ్రదికినచో నూటయిరువదియేండ్లు. స్త్రీలును బురుషులునుఁ, దత్సంయోగమై మానవుల జననము. దీని కవధిలేదు. కామములు, క్రోధములు, మోహములు, ధర్మము లధర్మములు, ఆశలు, ధర్మనిష్ఠులు. కాని మానవులు నిజ ముగా ధర్మమునం దభిలాషలేని మానవులు తమయొక్క రాజ్యాశచేతఁ దమయొక్క క్రూరభావమును వెలార్చెదు సందు దొరకించికొనుటకు మతముపేరుపెట్టి ధర్మములు పేరు పెట్టి యితరులను వధించుట దండెత్తిపోవుట, యూళ్లు తగులఁ బెట్టుట, స్త్రీబాలవృద్ధులను జంపుట, అన్నమునకయిన సస్య మును దహించుట, ఇట్లు మానవులు తన్నుఁ దాను నాశనము చేసికొనుచున్నది చాలక భూకంప ప్రభంజనాదులు, యుద్ధ ములును. ఇంతటి మహాఘోరమయిన నిరవధికమయిన నిత్యహింసాకాంతలో నయ్యా పుష్యమిత్రా! యిది యొక కాలఖండము. ఇప్పుడు మీరు పరమేశ్వరో ద్దిష్టకాల ఘట నము నందుఁ గర్తృత్వము వహించుట వహించినట్లుకనఁబడుట.

ఈ యనంతమయిన సృష్టిని భావించినచో నీకాల మెంతది? ఈ దేశ మెంతది? ఇందులోని రాజెంతటివాఁడు? తమ రెంతటివారు? మే మెంతటివారు మిమ్మీకార్యము చేయుఁడని మే మెందు కడుగుచుంటిమనఁగా వైదిక ధర్మరక్ష కడుగు చుంటిమి. వైదిక ధర్మరక్షయందు మీకును మాకును విశ్వాసమే. అది భగవంతుని స్వరూపము కనుక ప్రత్యల్ప కాలా ణువు నందు భగవద్భావన చేసినచో దాని యనిత్యత్వము నందు నిత్యత్వము సాధించుట యగును. నిత్యమైనది పరమే శ్వర భావము. అది వైదిక ధర్మరూపమున నుండును. అని వేదములు చెప్పుచున్నవి. వేదము యనిత్యములు, అపౌరు షేయములు. దానినే భగవంతుఁడు తానై గీతలయందు నుపదేశించెను. పరమార్థదృష్టితోఁ దమరు లేరు. మేము లేము. బృహద్రథుఁడు లేఁడు. యవను లంతకుమున్నె లేరు. వ్యవహార దృష్టి నిదంతయు నున్నది. వ్యవహారమునందు ధర్మమునుఁ భావించుట, పరమార్థమును నిలఁబెట్టుట. మేము బ్రాహ్మణు లము. హింసావాదులము కాము. బౌద్ధులు హింసావాదులు. వా రహింసావాదులని చెప్పికొందురు. యజ్ఞమునందలి హింస యెంత హింస? యజ్ఞమునందొక మేక చంపఁబడును. ఒక యశ్వము వధింపఁబడును. హింసాబుద్ధితో చేసినహింస హింస. హింసాబుద్ధిలేని హింస హింసకాదు. రాజ్యములకొఱకు మ్లేచ్ఛు లుచేసెడి వధ కవధియున్నదా? వారు చేసెడి క్రూరకర్మలకు మొదలు తుదగలదా? వారహింసావాదులగుట యాశ్చర్యము. వాఁడు మాంసములేనిచో ముద్ద యెత్తఁడు. దానికోసము దిన

దినము శతసహస్రములయిన పశువధలు జరుగుచున్నవి. వాఁడహింసావాది. వాఁడు యజ్ఞాంశమయిన యజ్ఞవిశసనమును దూషించువాఁడు. బౌద్ధులు మాంసాశనులు. అయ్యా! జనము పెరిగిపోవుచున్నది. నేల పండించెడిపంట వీరికిఁ దిండికిఁ జాలదు. వృక్షఫలములునుఁ జాలవు. కందమూలములు చాలవు. మాంసఖాదనము చేయవలయును. మత్స్యభోజనము చేయవలయును. అప్పటికిని వీని తిండికిఁ జాలలేదు. ఒకదానితో నొకదానికి ముడిపడియుండి వివిచ్యమానముగఁ బరామర్శించుటయే పరమక్లిష్టమైన యీ మహావిషయముల యొక్క సంపూర్ణ స్వరూపావగతి కలిగిన వాఁడెవఁడు? అట్టి మహాజ్ఞానము కలవాఁడు వేదపురుషుఁ డొకఁడే. వేదపురుషుఁడనఁగా భగవంతుఁడు. భగవంతుఁడు సర్వజ్ఞుఁడు. ఆతఁడు చేసిన వర్ణాశ్రమాచార వ్యవస్థ యల్పజ్ఞులయిన బౌద్ధులకు మ్లేచ్ఛులకు నిందా హేతువయినది. అంతకంటె నల్పజ్ఞులైన భారతీయులకు మఱియు నిందా హేతువయినది. ఆ మేధావి భట్టు మఱియు నిట్లనెను. అయ్యా! పుష్యమిత్రా! దానియందు విశ్వాసములేని భారతదేశ వాసులను మ్లేచ్ఛులకంటె నల్పజ్ఞులని యెందుకంటినో తెలియునా? ఏడాది లంకలో నున్న హేతువుచేత సీతయందు దోషము చెప్పి జనులు పరమమూర్ఖులు, సీతయొక్క పరమ పావిత్ర్యము నగ్నిమయత్వము తెలిసిన రామచంద్రుఁడు దానిని విశ్వసించుట పరమ మూర్ఖులకంటెఁ బరమ మూర్ఖుఁడగునా? కాదా? అపుడు సభ యంతయు నవ్వెరి. నాకుఁ గోపము వచ్చెను. ఆ బ్రహ్మవేత్తలయిన బ్రాహ్మణులకు నాకు నెంత భేదము? నా కోపముఁ జూచి

మేధావిభట్టిట్లనెను. అయ్యా! నేను మీ మనస్సునకుఁ గొంచెము కష్టము కలిగించిన ట్లున్నది. శ్రీరామచంద్రునియందు నేనును భక్తుఁడనే. రామశబ్దము తారకనామమని నాకుఁ దెలియును. విషయమును విషయముగ నిరూపించుచున్నాను. ఆ రామచంద్రుఁడు రాజనీతికిఁ బ్రాధాన్యమిచ్చి తాను బరమ మూర్ఖుఁడు కాలేదు. భగవంతుఁ డయిన శ్రీరామచంద్రుఁడు పరమ మూర్ఖుఁ డెట్లగును? శ్రీరామచంద్రుఁడు భగవదవతారము కాదనుకొందము. ప్రజారంజనము పొంటెసంత పరమనిష్ఠుఁడు కాఁడనుకొందము. ఊరక యనుకొందము. పరమ మూర్ఖతాలక్షణ మెట్లుండు ననగా నిట్లుండునని యొక యుదాహరణము సంపాదించి కొనుట కనుకొందము. ఆ దృష్టితోఁ జూచినచో మ్లేచ్ఛులు మ్లేచ్ఛులు. వారు వేదధర్మము నర్థము చేసికొనుటకు జన్మించ లేదు. వర్ణాశ్రమాచార వ్యవస్థలోని యిహాపరలోకముల సంపుటియొక్క సామరస్యము అనఁగా భగవత్తత్త్వము అనఁగా సృష్టిరహస్యము అనఁగా సర్వజ్ఞత్వము అనఁగా మానవుఁడై జన్మించిన జీవియొక్క యథార్థమార్గ నిరూపణము. మ్లేచ్ఛజన్మ దానినిఁ దెలిసికొనుటకుఁ గలుగదు. వైదిక ధర్మమునందుఁ బుట్టిన వాఁడు దానినిఁ దెలిసికొనుటకే పుట్టును. వాఁడు మ్లేచ్ఛునివలెఁ బ్రవర్తించినచో వానికంటెఁ బరమ మూర్ఖుఁడెవఁ డుండును? శ్రీరామచంద్రుఁడు భగవంతుఁడు కానిచోఁ బరమాల్ప దేశమునందుఁ గూడఁ బ్రజారంజనము కర్తవ్యమని తీవ్రరాజ ధర్మపరిపాలనా నిష్ఠుఁడు కానిచో రామచంద్రుఁడు మూర్ఖుఁడయినాఁడు. అయ్యా! పుష్యమిత్రా! నేనింత చెప్పుచున్నాను గాని నా యావేశ

మెంత? నేనెంత? నా వేదనయెంత వైదికధర్మమును నేను సముద్ధరించెడిదేమి? తమరు సముద్ధరించెడిదేమి? ఒక్కొక్కప్పుడా వైదికధర్మమును సముద్ధరించెడువాఁడు పరమ మ్లేచ్ఛులయిన కిరాతులయం దుదయించును ప్రహ్లాదుఁడు హిరణ్యకశిపుని హృదయమునం దుదయించినట్లు. ఆ రాజును నీవు చంపవు. అనఁగా, జంపుట కిష్టములేదు. నీవు చంపుదువు. అనఁగా నీచేత భగవంతుఁడు చంపించును. గురువు నేఁడు జ్యోతిర్మండల భిన్న గ్రహసంచారమునందుఁ బరమోచ్చంగతుఁడై, స్వచ్ఛమైన స్థితియం దున్నాఁడు. ఇట్టిస్థితి సృష్ట్యాది బృహస్పతికి లేదు. అతఁడు పట్టి వైదిక ధర్మమును నిలఁబెట్టుట కాదు. బ్రాహ్మణుని రాజ్యాధికారి చేయును. ఇది నీకుఁ దప్పదు. తమ జాతకమును నేను బరిశీలించితిని. తమరికి ధరాపాలనయోగ మున్నది. కాలజ్ఞుఁ డయిన నిరాతంకభట్టు చెప్పుచున్నాఁడు. కలి ప్రారంభించిన తర్వాతఁ బందొమ్మిది వందల యిరువదియేండ్లు గడిచిన తరువాత మగధరాజ్యము బ్రాహ్మణ ప్రభువులచేతఁ బరిపాలింపఁ బడునట. మూఁడు వందలయేండ్లు మీ వంశము మగధరాజ్యమునుఁ బరిపాలించును. అట్లు వ్రాయఁబడి యున్నది. నీచేత యవనులు నిర్మూలింపఁ బడుదురు. బౌద్ధమతముయొక్క యాధిక్యము తగ్గును. నీవశ్వమేధమునుఁ జేసితీరెదవు. ఆ పాపమునకు నిష్కృతి యది. అది శాస్త్రములయందుఁ జెప్పఁబడిన విషయము. ఆ పాపముయొక్క స్వరూపమెట్టిదో దానికి నిష్కృతి యెట్లు కలుగునో దాని స్వరూపమెట్లుండునో యీ సర్వమును భావవిషయములు. బుద్ధిచేతఁ దెలిసికొనఁ బడునవియేగాని కన్నులకుఁ

గణియించునవి కావు. ఇట్లు మేధావిభట్టు చెప్పెను. ఇచటఁ గర్తృత్వమునకు లేదు. లేకనుపోలేదు. యథార్థమునకు నేను సాధనమను. నన్ను భగవంతుఁ డుపయోగించికొనును. కానిమ్ము నేనేమిచేయఁ గలను? అట్లు వ్రాసియున్నచో ముందు నాకుఁ దెలిసినది. కనుక నేను గిరివ్రజపురమును నా యధికారమున లోనికిఁ దీసికొనవలయును. ఎక్కడికక్కడ బిగించి యుంచవలయును. రాజు మరణించిన మఱుక్షణమునందు శత్రానీకాదులు లేవు.

## ౭

మగధరాజ్య సర్వసేనాపతి భవిష్యన్మగధరాజ్య ధరాపతి వైదికధర్మ రక్షణావతారమూర్తి శ్రీ శ్రీ శ్రీ పుష్యమిత్రులకుఁ జరణాభివందనములు చేసి శ్రీ వారికిఁ బరమభక్తుఁడును వారిదయ కయోగ్యుఁడును దన సొంత పేరుతోఁ దన్ను గురించి చెప్పికొనుట కయోగ్యుఁడును శ్రీ వారికినిఁ దనకుఁ గల బంధుత్వమునుఁ బురస్కరించికొనిన వరుసతోఁ దన్నన్ను కొనుటకుఁ దనయందు ననుచితము సంపాదించికొన్న వాఁడును నగునవాఁడు ప్రస్తుతము యవనదేశనివాసి తనకుఁ దానే నిర్ణయించికొన్న శిక్షచేత జీవితాంతము యవనదేశమునందే యుండుటకు నిశ్చయించుకొన్నవాఁడు నయిన యొక ద్రోహి. ఈ ద్రోహియొక్క ద్రోహము బహుముఖములుగా నున్నది. మొదటిది వైదికమత ద్రోహము. వాఁడు తాను యవను

లలోఁ గలిసిపోయి వైదిక ధర్మచ్యుతుఁ డయినాఁడు. రెండు చిన్నప్పుడే తలి దండ్రులు చనిపోఁగాఁ బెంచి పెద్దవానిఁ జేసి యొక్క చిన్న సేనాని పదవినిచ్చి పుత్రనిర్విశేషముగాఁ బెంచిన మేనమామకుఁ బరమప్రియమైన యశ్వరాజమును హరించి వాఁడు. మూఁడు, ఆ యశ్వమును యవనులు హింసించి చిత్ర వధ చేయఁగాఁ గనులారఁ జూచుచు నిస్సహాయుఁడై యూరక కున్నాఁడు. ఈ నిస్సహాయత వానియందు గుణాదానము చేయదు. అట్టి హింసను నిస్సహాయుఁడై చూచుచుంచుట యున్నది. వాని పూర్వజన్మకృత పాపఫలితము. ఆ పాపము నందు వానికిఁ గర్తృత్వము గలుగుట తత్ఫల దర్శనమునందుఁ గర్తృత్వమును దొలఁగఁ బెట్టదు. నాల్గు. భీరువయి శ్రీవారి వద్దకు వచ్చి నేనీ దోషమును చేసితిని. నాకు యోగ్యమైన శిక్ష విధింపుడు. అని చెప్పికొను సాహసమును ధైర్యమును ధర్మగుణమును లేకపోయినవాఁడు. అట్టి వాఁడు పాదాభి వందనముచేసి వ్రాయుచున్న లేఖ, శ్రీ పుష్యమిత్రుఁడు వాని యందున్న దోషనుములఁ బొంటె నీజాబునుఁ జదువరాకున్న భావమునుఁ బెట్టికొని పరిహరించకుండఁ జదువవలయునని విజ్ఞప్తి చేయుచుఁ, జదివినచో శ్రీ పుష్యమిత్రుల యౌదా ర్యము, దయాగుణము ద్యోతమానములగునని మనవిచేయుచు నతఁడిట్లు వ్రాయుచున్నాఁడు. పమరికి జ్ఞాపకమున్నచో నారాయణభట్టను నొక జ్యోతిర్విద్యాంసుఁ డున్నాఁడు. ఆయనను దమరు పూర్వమొకప్పుడు మీ యశ్వజాతకము నడిగినారు. అతఁడు చెప్పినాఁడు. దాని ఫలితమే మద్దేశక ముగ జరిగినది. నేనిచ్చట నుండియు నిత్యమును మగధదేశ

జాతకమును దదిత రార్యావర్తదేశ జాతకములను మృతమయిన యీ యశ్వముయొక్క కేవల జాతకమునుఁ బరిశీలించుట తప్ప మఱియొక పని చేయుటలేదు. నేను యవనుఁడ నయినను, మదిష్ట దేవతయైన వృద్ధ భార్గవీ కరుణాకటాక్షములు నాయందుఁ బోలేదు. ఆ సనాతనియొక్క దయ భ్రష్టుఁడ నయిన నాయందు నే హేతువున నింక నిట్లున్నదో నేను విచారించుకొనఁగా నాకుఁ దెలిసినవిషయ మేమనఁగా నావలన భారత దేశమునకుఁ గొంత యుపకారము జరుగవలసి యున్నది. వేదమూర్తియై వేద రక్షాపరినిష్ఠుఁడైన పరమేశ్వరికిఁ దత్కారణముగా నాయం దింకనుఁ గరుణయున్నది. రేపు వచ్చెడు కార్తికీక పూర్ణిమనాఁడు బృహద్రథ మహారాజు మరణించును. వధింపఁబడును. అతని వధ శ్రీ పుష్యమిత్రుల చేతిలో నున్నది. ఆత్మరక్షణకొఱకుఁ బుష్యమిత్రులు బృహద్రథుని వధింతురు. వధించక తప్పదు. జయద్రథుని చుట్టు దుష్టగ్రహములు చేరినవి. అవి సర్వదా పుష్యమిత్రునిఁ బదవీచ్యుతునిఁ జేయుటకుఁ బన్నాగములు పన్నుచుండును. వలసినచోఁ బుష్యమిత్రులను వధించుటకు వారు సిద్ధము నుండిరి. అందులోఁ బ్రధానుఁడు శతానీకుఁడు. వీనినిగుఱించి చెప్ప నక్కఱ లేదు. బృహద్రథ వధమువలనఁ బుష్యమిత్రులకు మిత్రవధ జనితదోషము సంక్రమించును. ఆ దోషము పరిహరించుటకుఁ బుష్యమిత్రులు మగధరాజ్య సింహాసనాసీనులైన తరువాత నశ్వమేధయాగము చేయుదురు. దేశమంతయు నందుఁడు చేసిన క్షత్రియవధ హేతువుగా శూద్ర హస్తాపతితమై బౌద్ధమత దూషితమయి వైదికేతర మార్గమున

నడుచుచున్నది. యజ్ఞయాగాది క్రతువులయందుఁ గ్రతు మహార్థ విరహితమయిన లోకమునకు ద్వేష మేర్పడినది. (శ్రీ) పుష్యమిత్రులు హయమేధమునుఁ జేయుదురు. అప్పుడు పలుమందికిఁ గ్రతుమహార్థము తెలియును. ఆ హయమేధ ముతో సర్వార్యావర్తమునందుఁ బుష్యమిత్రుల యాజ్ఞ రూఢమగును. మఱల వైదికధర్మము తలయెత్తును. ఈ కృత ఘ్నుఁడై ద్వేషియైన వానివలనఁగూడఁ బుష్యమిత్రునకు సాహాయ్యము ఘటిల్లఁగలదు. మేధీయాశ్వమును యవన రాజులు హరింపలేరు. యవనరాజ్యములన్నియు నాఁటికి నీ కృతఘ్నుని వశమునందుండును. హయము యథేచ్ఛా సంచారము చేయఁగలదు. ఆర్యావర్తముయొక్క యీశాన్య దిశయందుఁ బూర్వము భారత దేశమునకు విరోధులుండిరి. కొన్ని వందల యేండ్లవఱకు నా విరోధము లేకుండ నీ భవ త్పాదరేణువు చేయఁగలదు. బృహద్రథవధమవశ్య కరణీయము. అశ్వమేధయాగ మంతకంటె నవసరము. ఈ మీ పాదరేణు వునకుఁ బుష్యమిత్రుల వైరాగ్యభావము తెలియును. నిర్మ మత్వము తెలియును. ఏది యెట్లు జరుగునో యది యట్లు జరుగును. మనకెందుకన్న వైదికధర్మ గాఢ ప్రవిష్టయ బుద్ధి లక్షణము తెలియును. అందుచేత నితఁడు తిరిగి తిరిగి చెప్పుచున్నాఁడు. ఈ భవచ్చరణ దాసుఁడు జ్యోతిర్విద్యా నిష్ణాతుఁడని ప్రభువులకుఁ దెలియును. వానిని మన్నించ వలయును. ప్రధానమైనది యశ్వమేధయాగము. వధింపఁ బడిన మహాశ్వరాజసుయొక్క తమ్ముఁడయిన . గుఱ్ఱము నే వదలిపెట్టవలయును. ఆ యశ్వము నూటిగా నిచ్చటికివచ్చును.

పశుపులకున్న జ్ఞానము విచిత్రమైనది. అది తన యన్న వధింపఁబడిన చోటునకు వచ్చును. ఆ యశ్వ మిచటికి రావలయును. అప్పుడీ భవచ్చరణరేణువు చేయవలసినపని కొంత యున్నది. ఆ యశ్వము తన యన్నయైన యశ్వముయొక్క వధకు ప్రతీకారమును వాంఛించుచున్నది. ఆ ప్రతీకారము జరుగకుండఁ దమ రాచరింపఁబోవు హయమేధమునకు సంపూర్ణ ఫలము లేదు. ఇది నా యహంకారమువలెఁ దమరియొక్క కర్తృత్వము వలెఁ గనిపించవచ్చును. కాని సర్వము నట్లు నిర్దేశింపఁ బడియున్నది. ఇది జరుగును. కార్తికీక పూర్ణిమనాఁడు తమరు సర్వదా సర్వథా జాగరూకులయి యుండవలయును. తమరిచేఁ జేయఁబడఁబోవు ప్రయోగము తమకుఁ బరమాప్తులైన వారిద్వారా చేయఁబడును. నేను కృతఘ్నుఁడను. నా కృతఘ్న క్రియచేతఁ బర్యవసితమైనదిగాని నా మనోభావము నంటు లేదు. అచట మనోభావమునందుఁ గృతఘ్నతను రూపు కట్టించుకొన్నవారు కలరు. తమరు పూర్వ మెవరికి మహోపకారము చేసిరో వారి వారి విషయమున జాగ్రత్త వహింపవలయును. రాజునందు దోషములేదు. దోషము సంక్రమింపఁ జేయఁబడఁబోవుచున్నది. అశ్రుకూటమునందుఁ గుమూద్వతి యొక్కర్తుకయే సుశీల. ఆమెనుఁగూడ వధింతురేమో తెలియదు. ఆ అమాయక జీవినిఁ బ్రభువులు రక్షించుటకుఁ బ్రయత్నము చేయవలయును. ఆమెను రక్షించి యేమి లాభము? ఇరువదియేండ్లు దాటని పిల్ల. విధవరాలయి యెనుబదియేండ్లు బ్రతుకవలయును. భగవంతుఁ డొక్కొక్క జీవి కెట్లు వ్రాయునో తెలియదు. క్షంతవ్యుఁడైన సేవకుఁడు.

ఈ యుత్తరము పుష్యమిత్రుఁడు పదిసార్లు చదివి కొనెను. ఈ యుత్తరమునుఁ జదువుచుండఁగా నారాయణభట్టు వచ్చెను. పుష్యమిత్రుఁ డాలేఖను నారాయణభట్టునకుఁ జూపించెను. అతఁ డాశ్చర్యపోయెను. ఆ కార్తిక పూర్ణిమ నాఁడు రాజవధము జరుగునని యీయన నిశ్చయించెను. అది యెట్లు ? అవునవును. అతనికి రాజజాతకము తెలిసి యుండవలయును. రాజునకు గోచారము బాగుగ లేదు. మారకగ్రహములానాఁడు బలవత్తరములయియుండియుండును. అయ్యా నే నెప్పుడును రాజజాతకము జూడలేదు. ఆయనకుఁ దెలియునా ? అందుచేత నిర్ణయించెను.' పుష్య 'నే నెవ్వరి కుపకారము చేసితినో వారు నాకు ద్రోహము చేయుదురని యతఁడు వ్రాయుచున్నాఁడు.' నారాయణ 'సామాన్యముగా రాజునుఁజుట్టి పరివేష్టించియున్న వారిలోఁ దమవలనఁ బూర్వ ముపకారముపొందినవా రుందురు. వారిమీఁదఁ దమ రాధారపడి యుందురు. రాజవంశమునందలి వార్తలు తమరికి వారిద్వారా తెలియుచుండును. వారింతవఱకుఁ దమరికి వ్యతిరేకముగాఁ బ్రవర్తించి యుండకపోవచ్చును. దుష్టగ్రహములట్లు సమకూడునప్పటికి వారి బుద్ధులయందు వైపరీత్యము సంభవించును.' పుష్య 'అపుడు మనము చేసెడిదేమి ?' నారాయణ 'అట్లుకాదు. పూర్వము తమవలన నుపకారము పొందిన వానివలన నిట్టియాపద రాఁబోవుచున్నది. కావునఁ దమరిచేతఁ బూర్వమునం దనుపకృతులయిన వారినిఁ గొందఱి నచట నుంచినచో దానికిఁ బ్రతివిఘాతము జరుగును.' పుష్య 'ఏమయ్యా ! మీరు మాకంటె లౌకికులవలెఁ గనిపించుచున్నారు.'

నారాయణ 'స్వామీ ! శాస్త్రమనఁగా విశేషపరిజ్ఞానముతోఁ గూడిన లౌకికమే. లౌకికమన్నచో నేమియో తెలియని మూఢులు శాస్త్రజ్ఞానమును నిందింతురు. శాస్త్రము లెచట నుండి వచ్చినవి? ప్రధానముగా లోకమునుండి వచ్చినవి. అలౌకిక పరిజ్ఞానము లౌకికజ్ఞానముతో సంబంధింపఁ జేయు టయే శాస్త్రము. 'నపరదారాన్ గచ్ఛేత్' అని యున్నది. లోకము కామప్రవృత్తికలది. కామ విషయమునఁ బరితోష మును గోరునది. తత్పరి తృప్తివిషయమున శాస్త్రము పరిహార ణీయమయిన దానిని బోధించుచున్నది. అది పరిహారణీయము కానిచో నాపదగలుగుట లోకసిద్ధమయిన విషయమే. ఆ యాపద నిశ్చితా నిశ్చితముగా నుండును. ఈ ద్వైధీభావము నందు మోహాగ్రస్తమయిన లోక మనిశ్చిత విషయమునందు నిరాదరణగలిగి ప్రవర్తించును. మోహము మూఢత్వమును సంపాదించి పెట్టును. వాఁడు శాస్త్రమును లెక్కచేయఁడు. లెక్కచేయక పోవుటకు వాఁడు శాస్త్రమునందలి యలౌకిక విషయమునుఁ దీసికొని పరిహాసించును. 'పరదారాభి గమనము లౌకికముగా నాపద్ధేతుక మగుచుండఁగా నీ యాపద్ధేతుకృత మందు ననిశ్చిత భావము కనిపించుచుండఁగా శాస్త్ర మింకొక విషయమునుఁ జెప్పును. ఈ పరదారాభి గమనము నరక హేతువని శాస్త్రము చెప్పును. నరకలోకముయొక్క స్థితి లౌకిక బుద్ధి కనవగతమయిన విషయము. వాఁడు సులభముగా దానిని నిరాదరించవచ్చును. ఒకఁడు ప్రతిభావంతుఁడు. ఆ ప్రతిభయన్నది ధనముకాదు. శరీర బలముకాదు. స్థలము కాదు. అది బుద్ధిచేతఁ దెలిసికోఁ దగినది. దీని నీర్ష్యాగ్రస్తుఁడు

కాదనును. ఏమిచేయఁగ నగునయును? నాస్తికులును మ్లేచ్ఛులును వైదిక ధర్మాచరణ ఫలితములైన స్వర్గాదులు లేవనినచో నిరూపించుట యెట్లు? వాఁడు సత్పురుషుఁడు వానియం దౌదార్యము కలదు. వాఁడు పరాక్రమవంతుఁడు. వాని కధికారమున్నది. వాఁడు మరియాద కలవాఁడు. ఈ మర్యాదాది గుణములను జూపించుట యెట్లు? వాని ప్రవర్తనచేత వాఁడు చేసెడి కార్యములచేత నవి యనుమీయమానములైన గుణములు. వాని కీర్తి దశ దిశలయందు వ్యాపించినదియన్న వాక్యమున కర్థమేమి? ఏ యూరుపోయినను వానినిఁ గూర్చి ప్రశంసించు మానవులున్నారని యే యర్థమా? కీర్తియను నొక పదార్థము గగనమునందు వ్యాపించి యున్నదని యర్థమా? ఇది క్లిష్టమయిన యర్థము. వాఁడు మర్యాద కలవాఁడనఁగా మర్యాదాలక్షణము ప్రదర్శించు నవసరము వచ్చినపుడు వాఁడట్లు ప్రవర్తించునని యర్థము. ప్రవర్తించిన సమయమునందు సరే. తదితర సమయముల మఱియొక గుణమువలె దానికొక స్థితియున్నట్లు లోకము భాషించుచున్నది. ఈ భాషణముయొక్క యర్థము పూర్వమం దతఁడు ప్రవర్తించిన ప్రవర్తనయొక్క స్మరణమని చెప్పుటయునా? లేనిచో నా మర్యాదయన్న గుణమొకటి యున్నదని చెప్పవలయునా? స్మరణమని మాత్రమే చెప్పాదము. స్మరణమనఁగా నేమి? ఒకప్పుఁ డొకపని జరిగినది. అనంతర కాలమున జరిగినపని జరిగినప్పుడు చూచినవాఁడు దానిని స్మరించును. ఈ నడిమి కాలమునందుఁ, దత్కార్యమెట్లున్నది? వాని మనస్సునం దున్నదా? కాలమునం దున్నదా? వాయువునం దున్నదా? ఆ స్మరణ యెట్లు

జరుగుచున్నది? మనస్సునకట్టి శక్తియున్నదందము. ఆ శక్తిని గూర్చియే యిప్పుడు విచారించుచున్నది. ఆ శక్తి యేకాల మునందిమిడియున్నది? గగనమునం దిమిడియున్నది. అన్నా దులందు దిమిడియున్నది. వాడన్నము తినుచుండినగదా వాడు బ్రదికియుండుటయు, వాని మనస్సున కాశక్తి యుండు టయు. అందుచేత నన్నాదులయందుఁ గూడ నీ శక్తిలేదను టకు వీలులేదు. గగనమునందు లేదనుటకు వీలు లేదు. కాల మునందు లేదనుటకు వీలులేదు. అనఁగా నేమగుచున్నది? ఆ మర్యాదయున్న గుణమునకు స్వతంత్రమయిన స్థితియున్న దని చెప్పవలసి వచ్చును. ఆస్థితి యెచ్చట నున్నది? ఆకాశ మునందు దిక్కులయందుఁ గాలమునందు నన్నాదులయందు నున్నది. మరియీయున్న గుణమునకుఁ గీర్తించు న్న భావము నకు స్థితిస్థితి నిరూపింపఁ బడుచుండఁగాఁ బాపపుణ్యములకుఁ గర్మఫలితములకుఁ బరమేశ్వర భావమునకుఁ బరలోకములకు స్థితి లేదా? ఆలోచన శక్తియని యొకఁడున్నచో నన్నియు నున్నవి. అది లేనిచో నేమియులేదు. ఇది యెంతయైన విచా రణీయమయిన విషయము. మానవుఁడు విచారించుట కొఱకు జన్మించినాఁడు. ఆలోచనా హీనునియందు మానవత్వము లేదు. వాని బ్రదుకు, వాని లాభము, వాని యల్పసుఖము, వాని మోహము, వీనికి సంబంధించినంతవఱకే యొకఁడు మాన వుఁడుగ నుండి తదితర విషయములందు మానవత్వమునుఁ బరి హరించును. ఈ స్వసుఖమాత్ర పర్యవసితమయిన నియమిత మయిన యాలోచనాశక్తి పశువునందుఁ గంటఁగించి యున్నత మయినది. మఱియునో మహానుభావుఁడా! సర్వమానవు లెందు

చేత నాలోచనా విషయికమయిన పరాకాష్ఠనుం బొందిన బుద్ధి మత్తనుం గల్గియుండరు. ఒకండు జడబుద్ధి. ఒకండు ద్రుతబుద్ధి. ఒకండులోతయిన యూహాకలవాండు. ఒకండు పైపైయూహాలు చేయువాండు. ఇట్టి లక్షణములలోం దరతమ భేదము లనంతములు. ఇంత వైవిధ్య మీ జీవలోకమున నేందుకున్నది? దీనికి రెండే హేతువులు చెప్పవలయును. పరమేశ్వరుండే సృష్టినిట్లు చేసెనన్నది మొదటి సమాధానము. అట్లైనచో పరమేశ్వరుండన్న భావమునకుం బట్టినంత యిక్కట్లు మఱియొకదానికిం బట్టదు. వాండు నిర్దయుండు. వాం డనూహాశాలి. వాండు కిరాతుండు. వాండు పక్షపాతి. వాండు సర్వజ్ఞానము సర్వస్థలములయందు నిక్షేపింపలేని యసమర్థుండు. అందుచేత నా సమాధానము విచారణాశీలమయిన మానవబుద్ధికిం సృష్టిహేతువు కాదు. రెండవది సమాధానము దీనికంటె సహజమయి నది. సర్వసృష్టియుం గర్మాధీనమై సాగుచున్నది. పూర్వకర్మ నియమితమయి జంతువులు జనించుచున్నారు. పూర్వసంస్కారానుగతమయి వారి వివేకము భాసించుచున్నది. కాలముయొక్క యనంతత్వము నిత్యమయిన పూర్వ పూర్వస్థితి సర్వమును వ్యాఖ్యాతమగును. అది యెట్లున్నను నీసర్వము లోకజ్ఞానము. ఇదియే శాస్త్రజ్ఞానము. ఆలోచన గాఢముగ నయినకొలంది శాస్త్రమగుచున్నది. స్థూలముగా నయినకొలంది లోకమగుచున్నది. లోకము స్థూల సూక్ష్మాంశలచే విభక్తమయి యున్నది. సూక్ష్మమైనది లోకము కాకపోలేదు. జంతువులు స్థూలవిషయ నిమగ్నబుద్ధు లగుటచేత శాస్త్రము వారియం దవహేళనము నందుచున్నది.' పృష్ట 'అయ్యా!

మీా రందఱు మహాపండితులు. ఇపుడు నే నేమి చేయవల యును?' నారాయణ 'ఇంతవఱకు మీారు రాజును బరివేష్టించి యున్న జనములో మీావలనఁ బూర్వ ముపకారము పొందిన వారియందుఁ బ్రత్యయము కలిగియున్నారు. అట్టివారు కాని వారిని మఱికొందఱిని నియమింప వలయును.' పుష్య 'వారును నావలన నుపకారము పొందినవారే యగుదురు.' నారాయణ 'పూర్వము వేఱు. పూర్వ పూర్వము వేఱు. అద్యతనపూర్వము వేఱు. భూత పూర్వము వేఱు. ఉద్యోగుల నొకచోటినుండి యొకచోటికి మార్చుట రాజ్యవ్యవస్థా సహజమయినస్థితి. తమచేత సుకృతిపొందిన వారిన టనుండి తీసివేసి, నూతను లను వేయుఁడు. తమవలన పూర్వ ముపకృపొందిన వారు తమవలన నూతనోద్యోగము పొందుటచేత వారి మనసులలోఁ దమయెడల వారు చేయఁబూనిన ద్రోహము విషయమునందు లజ్జితు లగుదురు. ఈ క్రొత్తగా నియమింపఁ బడినవారు కృతజ్ఞు లగుదురు. కార్తికపూర్ణిమ సమీాపించు చున్నది. నేఁడు కార్తిక శుద్ధ దశమి. మీా ప్రతిపక్షులు పూర్వమెన్నాళ్ళ నుండియే ప్రయత్నముచేసి వారిని దమ వైపునకుఁ ద్రిప్పికొని యుందురు. దానికోసము మిక్కిలి ప్రయ త్నము చేసియుందురు. వారికి లంచములు పెట్టియుందురు. అదియంతయు నొక్క నిమేషములో వ్యర్థమయిపోవును. ఈ క్రొత్తగా నియమింపఁబడినవారిని మఱలఁ దమ వైపునకుఁ ద్రిప్పికొనుటకు వారికిఁ గాలములేదు. ఎడములేదు. ప్రయత్న సాఫల్యము కల్గుటకు సావకాశములేదు." పుష్య - అట్లు కృతఘ్నులచేత నేను వంచింపఁబడుట వ్రాయఁబడి

యుండఁగా వారినిఁ దొలఁగించినచో నా కార్యమే జరుగక పోవచ్చును. అట్లు జరుగవలసిన కార్యమునందుఁ గారణము లనుఁ బరిహరింపఁగాఁ గార్యము జనించును. రాజు నాచేత వధింపఁబడ నక్కఱ లేదు.' నారాయణ 'కార్యము నిశ్చితమైన విషయము. సృష్టిలోనున్న మూలభూతమయిన రహస్యమిది. అది యట్లు జరుగవలసియుండఁగా నది జరిగితీరును. కారణము లందు నిశ్చితత్వము లేదు. అనఁగా నిర్దిష్టమైన సామగ్రియొక్క నియతత్వము కార్యమునం దుండనక్కఱ లేదు. కార్యము జరుగవలసియుండఁగా హేతువు పూర్వ మనుకొన్న 'కారణ సామగ్రికంటె భిన్నమైన కారణ సామగ్రి కల్గవచ్చును. మన కీనాఁడు వంద బంగారు నాణెములు కావలయును. ఆ వంద నాణెములు పొలము పండి సిద్ధముగా నున్నదిగదా పంటను విక్రయించినచో వచ్చునను కొందుము. నిన్న నొకని ఋణ మడిగితిమి. వాఁ డిత్తునని వాగ్దానము చేసినాఁడు. వాఁ డిచ్చు ననుకొందుము. ధనముమాత్రము వచ్చును. ఈ రెండు ప్రదేశములనుండి కాకపోవచ్చును. అందుచేత రాజవధము జరిగితీరును. ఆయన గొప్ప గణిత శాస్త్రజ్ఞుఁడు. ఆయనచుట్టు మేమంగళము తిరుగు హేతు వాయనవలననుండి రహస్యము లప్పుడప్పుడు తెలిసికొన వలయుననియే' పృచ్ఛ 'అతఁడు నీకంటెఁ బండితుఁడా?" నారాయణ "మహానుభావుఁడా! నాకంటె బండితుఁడా యనఁగా నర్థమేమి? ఆయన చదివి నవియు మేము చదివినవియునైన శాస్త్రగ్రంథములవే. ఒక గ్రంథము నే నెక్కువ చదివియుండవచ్చును. ఒక గ్రంథ మాయన యెక్కువ చదివియుండవచ్చును. అదికాదు ప్రశ్న.

ఈ శాస్త్రమునం దాయన మేధావిలసన మట్టిది. ఆయన యీ శాస్త్రముకోసము పుట్టినాఁ డనిపించును. ఆయన యొక్కొక్కప్పుడు మాట్లాడుచుండఁగా నేనాఁడు మాటాడు చుండెనని యనుకొనలేదు. వెనుకనున్న యేదో మాటాడు చున్నది. ఏదో దేవత పలికించుచున్నది. మానవ బుద్ధి కతీతము లయిన విషయముల నతఁడు చెప్పెడివాఁడు. ఆయూహ వేఱు. ఆ తర్కము వేఱు. ఆయని చెప్పినతరువాత నా శాస్త్ర పంక్తినుండి యా యర్థము రావచ్చు" నని నా కనిపించెడిది. ఆయన బుద్ధిలోని నైశిత్యము నాబుద్ధిలోని నైశిత్యముకంటె నధికమైనదా యని యొండు రెండుసార్లు కాంచితిని. ఎంత నిశితమైనను మానవబుద్ధి ప్రసారలక్షణమునందొక యెల్లకలదు. మానవబుద్ధి దానిని దాటిపోలేదు. దేవతా ప్రసాదమున్నప్పుడు మానవబుద్ధి దాటి పైపొలములయందు విహరించును.' పుష్య 'సరే, మీరు చెప్పినట్లు చేయుదును. అధికారుల నోటినుండి వచ్చిన యిట్టి మాటకు నీవింక వెళ్ళి పొమ్మని యర్థము. నారాయణభట్టు వెడలిపోయెను.

పుష్యమిత్రుఁడు నాఁటి సాయంకాలమున రాజదర్శనార్థము వెళ్ళెను. గంధగజాదులు పుష్యమిత్రునకు రాజదర్శనము లేకుండఁ జేయవలెనని యెన్నాళ్ళనుండియో పట్టుదల. శతానీకునిద్వారా యది సాధింపఁ జేయవలయునని. శతానీకుఁడు మహారాజుతోఁ జెప్పుచుండును. ఇది నా సోదరి యంతఃపురము. తమరు కొలువుకూటములో నుండఁగా సేనాపతి తమవద్దకు రావచ్చును, పోవచ్చును. తమ దర్శనార్థము పుష్యమిత్రుఁ డిచటికి వచ్చుటయుఁ బోవుటయు నా కిష్టముగా

లేదు. పూర్వము తమదు రాణివాసములో నున్నపుడు పుష్య మిత్రుని రానిచ్చెడివారా? మేము రాజవంశమునకు సంబంధించని వారము గనుక మా చెల్లెలు సామాన్య స్త్రీ గనుక మీరాయన నిచ్చటికి రానిచ్చుచున్నారు. మొదలైనట్లు మాటాడును. రాజు చాలసార్లూరకుండెను. ఒకసారి యిట్లనెను. ఓనోయీ! నా పూర్వపురాణులసెంట వారి తల్లిదండ్రులును వారి యన్నలును రాలేదు. వచ్చినను వారికి సభిషవకర్మ తెలియదు. నీ తల్లిదండ్రులకుఁ దెలియును అనెను. శతానీకుఁ డేమిచేయును? రాజు వృద్ధుఁడయ్యెను వాక్చమత్కృతి కలవాఁడు. తీవ్రమైన ప్రకృతి కలవాఁడు. ఆయన కిష్టముకాని దాని నాయనచేత చేయించుట చాలఁ గష్టము. ఇట్లుండఁగా శతానీకుఁడు పుష్యమిత్రుఁడు లోనికి వచ్చిన తరువాతఁ గదా రాజాజ్ఞకు వ్యతిరేకముగా శతానీకుఁడు ప్రవర్తించుచున్నాఁడని తెలియుట. అందుచేత సాహసము చేసి రాజాజ్ఞ లేదని యంతఃపురము తన చెల్లెలిది కనుకఁ బుష్యమిత్రుని నివారించవలయు ననుకొనెను. ఇదివఱకను కొనుచుండెనే కాని యీ నాఁడు దాని నాచరణలోఁ బెట్టెను. పుష్యమిత్రుఁడు ద్వారము దగ్గఱకు వచ్చినంతనే ద్వారపాలకుఁడు శతానీకుని యాజ్ఞ ప్రకారము పుష్యమిత్రుని చనికేరాఁ నీయ లేదు. క్షమించవలెను. రాజాజ్ఞ లేదు. ఇది యంతఃపురము. మంత్రులనుఁ గూడ రానీయవలదని రాజుగారన్నా" రనెను. పుష్యమిత్రుఁడు తమ మేనల్లుఁడు వ్రాసిన జ్యోతిశ్శాస్త్రమున కిది ఫలితమా యనుకొనెను. మఱియు నిది శతానీకాదుల కల్పనయేమో! రాజు కనుమ్వతితో నుండఁగాఁ దా

నెన్నిసార్లు రాలేదు. పూర్వమంతః పురముకాక, నేఁడంతఃపురమయినదా? ద్వారపాలకుని 'సీ! పొమ్ము' తాను లోనికిఁ జొచ్చికొనిపోయినచో వీఁడేమిచేయును? అట్లు వెళ్ళినచో లోనఁ దన కపాయము జరుగునట్లు శతానీకాదులు నిర్మించి పెట్టిరేమో? తాను బయటఁ గట్టుదిట్టములు చేసి లోనికిఁ బోవుట మంచిది. నేఁడేకాదశియే కదా! ఇంక నాల్గు దినములున్నవి. ఇట్లు వారింపఁ బడినచోఁ బుష్యమిత్రుఁ డేమి చేయునో చూతమని, వారు నేఁడు తొలిసారి దీని రుచి తెలిసికొనుటకు నిట్లు చేసినారేమో? ఇపుడు వెనుకాడరాదని పుష్యమిత్రుఁడు లోనికిఁ బోఁదొడఁగెను. ద్వారపాలకున కడ్డము రావలయునో రావలదో తెలియ లేదు. అడ్డము వెళ్ళినచోఁ దనకు శిరచ్ఛేదము జరుగునేమో? మహాసేనాపతి ముందు సేనాపతి యెంత? ద్వారపాలకుఁ డూరకుండెను. పుష్యమిత్రుఁడు లోనికిఁ బోయెను. కుముద్వతి పుష్యమిత్రునిఁ జూచి లేచి నిలుచుండెను. నమస్కరించెను. తాను రాణియై యిట్లు చేయుట యయోగ్యమైన వర్తనమని శతానీకునికిఁ గోపము వచ్చెను. బృహద్రథుఁడు పట్టుపఱుపుల దొంతర మీఁదఁ గూర్చుండియుండెను. ఆయన చేతిలో నొక మణి మయపాత్రము కలదు. ఆయన పుష్యమిత్రునిఁ జూచి 'రావయ్యా పుష్యమిత్రా! రమ్మ'ని తాను కూర్చున్న పఱుపుమీఁద స్థలమును నిర్దేశించెను. పుష్యమిత్రుఁడు కూర్చుండెను. రాజిట్లనెను. శతానీకుఁడు ప్రక్కనే యుండెను. రాజిట్లనెను. చూచితివా నీ మహా సేనాధిపతిత్వమునుఁ దొలఁగించుమని నాతోఁ జెప్పుచున్నారు. నేను దీసివేయను.

శతానీకునకుఁ బ్రాణములు పైనఁ బోయెను. ఇది యేమి విడ్డూరము? సురాపాన వివశున కీమాట యనవచ్చు నీ మాట యనరాదని తెలియదుగదా. అందుకనియే యితనిని లోనికి రానీయఁ గూడదని ద్వారపాలకునితోఁ దా నాదేశించెను. వాఁ డెందుకు రానిచ్చినాఁడు? రాజు మఱల నిట్లనెను. యవనులు మగధముల మీఁదికి వచ్చుట లేదుగాని ప్రక్కన సర్వరాజ్యముల మీఁదికి దండెత్తి వచ్చుచున్నారు. నీ ప్రతిభా విశేషముచేత నది జరుగుచున్నది. వీరికేమి తెలియును? వీరిలో నొకఁడు మైరేయవిక్రేత. ఒకఁడు కితవుఁడు. మఱి యొకఁడు జారుఁడు. వీరికి సేనాపతిత్వ మెట్లిదో, వ్యూహ నిర్మాణమనఁగ నేమో యేమి తెలియును? పుష్యమిత్రా! నాకు వందయేండ్లు. నీ కేఁబది నిండినవా?" పుష్య 'మహారాజా! నిండినవి.' రాజు 'నన్ని కామము బాధించుచున్నదయ్యా! కామము మిక్కిలి చెడ్డది. సుమా! ఈ కుముద్వతియొక్క సౌందర్యము నన్నాకర్షించినది. నే ననాదినుండియుఁ గాముకుఁడనే.' నే నేఁబదియేండ్లు రాజ్యము చేసితిని. కడచిన ముప్పదియేండ్లును నీ బాహుబలము మీఁద నా రాజ్యము నిలిచినది. నీవు లేనిచో మగధరాజ్య మెచటనున్నది! ఇది యిప్పటి రాజ్యమా! ఈ గిరివ్రజపురము నేఁటిదా? జరాసంధుని నాఁటిది. జరాసంధుఁ డేమి, యుపరిచర వసువునాఁటిది. కలి ప్రవేశించకపుందు తొమ్మిదివందల యేండ్లకుఁ బూర్వము సుధన్వుఁడను రాజుండెడివాఁడు. అతఁడు గిరివ్రజపుర నిర్మాత. అతఁడని కొందఱు చెప్పుదురు. మఱి కొందఱేమి చెప్పుదురో. తెలియునా? కలి ప్రవేశమునకుఁ బూర్వ మాఱువందల యేండ్ల

క్రిందటఁ బ్రతీప నరపతి కలఁడు. అతఁడే యుపరిచరవసువు. అతనికి దేవయానము కలదు. ఆయనకొడుకు బృహద్రథుఁడు. ఆయనయే మగధరాజ్యమును స్థాపించి, గిరివ్రజపురమును నిర్మించెను. అందుచేత నావంశమునకు బార్హద్రథ వంశమని పేరు వచ్చెను. నాల్గయిదు వంశములు తిరిగిన వనుకొనుము. మహానీతివేత్తయైన చాణక్యుఁడు నా మౌర్య వంశమునకు మూలపురుషుఁడయిన చంద్రగుప్తుని మగధసింహాసన మెక్కించెను. ఈ వంశములో నేను పండ్రెండవ రాజును. నాతండ్రి శతధన్వుఁడు. నాకు బృహద్రథుఁడని పేరుపెట్టెను. ఎందుకుఁ బెట్టెను? మగధరాజ్యమునం దెన్నివంశములు పాలించినను మేము కౌరవులము. జరాసంధుఁడు కౌరవుఁడు. తొలి బృహద్రథుఁడు కౌరవుఁడు. ఉపరిచరవసువు కౌరవుఁడు. అప్పటికిఁ గొన్ని వేల యేండ్లక్రిందఁ గురువను రాజుండెడివాఁడు. అతనిపుత్రులే రాజ్యములువిభాగించి కొనిరి. ఆ కురువంశములో నుండి యొకశాఖ చీలి యాశాఖవారికి గిరివ్రజపురము రాజధానిగా నీ మగధరాజ్య మేర్పడెను. పుష్యమిత్రా! నాకుఁ బురుష సంతానములేదు. ఈ కుముద్వతియందు నాకు సంతానము కల్గునను కొంటిని. ఇంతవఱకుఁ గల్గలేదు. ఈమె గర్భవతి యనుచున్నారు. అది వట్టిమాట. నన్ను మోసము చేయుటకుఁ జెప్పెడుమాట. నందుఁడు దేశమున కన్యాయము చేసెను. సర్వ క్షత్రియ వంశములను నిర్మూలనము చేసెను. తరువాత నీ రాజ్యము నాకంటె శూద్రునిచేతఁ బాలింపఁ బడునేమో భయముగా నున్నది. ఈ రాజ్యము నీకు వ్రాసి యిచ్చెదను. నీవు దానినిఁ బాలింపుము. నీవు కానిచోఁ

పాలించెడివాఁ డెవఁడు? కల్లు నమ్ముకొని బ్రదికిన శతానీకుఁడా? ఉన్న యాస్తినంతయు జూదమునందు వ్యయపెట్టిన సింహబలుఁడా? స్త్రీ వ్యసనమున వినష్టుఁడయిన శ్వేతాశ్వుఁడా? ఇంక నా మంత్రులున్నారు. వారంతయు బౌద్ధులు. బౌద్ధులకు సన్న్యాసముకాని రాజ్య మెందులకు? అసమర్థులకుఁ బసిపిల్లలకువలె నూరికే తినవలయునని యుండును. తిని యఱగించికొనలేరు, తిందురు. జ్వరము వచ్చును. అక్కడినుండి వైద్యులు, శోకులు, బాలగ్రహములు, రక్షరేకులు, దృష్టి తీయుటలు, ఎఱ్ఱనీళ్ళు త్రిప్పి పాఱఁబోయుటలు, ఈ తంతు సాగును. అని బృహద్రథ మహారాజు విఱుగఁబడి నవ్వనారంభించెను. మఱల నవ్వ నారంభించెను. అయన కెక్కిళ్ళు పుట్టెను. ఆ పఱుపులమీఁదఁబడి పోయెను. కుముద్వతివచ్చి రాజు నాదుకొనెను. అరగడియ యైన తరువాత రాజు లేచెను. మఱలఁ బుష్యమిత్రునితో నిట్లనెను. చూచితివా పుష్యమిత్రా! నాస్థితి యిట్లున్నది. నాచేత వీరందఱు త్రావించుచున్నారు. నాకుఁ గుముద్వతియందుఁ బ్రేమ కలదు. వీరు నన్ను వదలిపెట్టిపోరు. నన్నును గుముద్వతిని నొక్కసారి యేకాంతముగా నుండనీరు. ఆ కుముద్వతినిఁ జూచితివా? అది బంగారపు బొమ్మ. పట్టిపైకి బంగారపు బొమ్మయనుకొనుచుంటివా? దాని హృదయమంతయు బంగారమే. వాఁడున్నాఁడే మా బావమఱఁది, యా కూర్చున్నవాఁడు; వాని మొగము చూడుము. రాజను నేను. శీవి నా కుండవలయును. వానిశీవి చూడుము. నడుమంత్రపుసిరి. నే నిట్లు మాటాడుచున్నానని వానికిఁ గోపము. ఈనాఁడు నా కల్లుగిన్నెలో నింకేదియో

కలిపినట్లున్నారు. వారి యిష్టము. దేనిలోఁ గలిపినారో? ఇచట నొక విధమయిన మద్య మున్నదనియా? వాని రుచులు ప్రమ్మమ్మ! తా! నీకుఁ దెలియదు. నాకుఁ దెలియును. వానిని నేను వదలిపెట్టలేను. త్రాగవద్దని కుముద్వతి నన్ను వారించును. నే నామెమాట వినను. నే నెవరిమాటవిందును? శతానీకుని మాట విందును. నేను రాజను. వాఁడు నాకు రాజు. నామీఁది యధికారి వాఁడు. వాఁడు నన్ను గదమాయించును. చెప్పినట్లు వినుమని ధిక్కారించును. నే నేమి వ్యాధిగ్రస్తుఁడనా? నా కేమైనఁ బక్షవాతము వచ్చెనా? నేను మంచములోఁ బడియుంటినా? నా పరిచర్యకొఱకు నేను వీరి మీఁద నాధారపడి యుంటినా? నా కెంతమంది సేవకు లున్నారు? వీఁడు వారిని నావద్దకు రానీయఁడు. నేను రాజ ననుకొంటివా? నే నిచట నొక బంధితుఁడను. నా మేనత్త కొడుకొకఁడు, నా పినతల్లి కొడుకొకఁడు. వీరిద్దఱు నీపదకము నకు వెనుక నున్నారు. నిన్ను రానీయరు. నీవు వచ్చినచో వారి యధికారము పోవునుగదా. నా మంత్రు లెవ్వరు నా మాట వినునట్లు లేదు. నీవు బ్రాహ్మణుఁడవు. నన్ను ద్రోహము చేయవు. బ్రాహ్మణుఁడు కానివానికి ద్రోహము చేయుట యనఁగా పల్లేరుమీఁద బండి నడిచినట్లే. తక్కినది యేది యెట్లయినను నీవు మగధరాజ్యమును రక్షించవలయును. నిజముగాఁ గుముద్వతి గర్భవతి యైనచో నామె కడుపునఁ బుత్రుఁ డుదయమైనచో నీవు వానిని రక్షింపుము. వానికి వయసు వచ్చువఱకు నీవే రాజ్యమునుఁ బాలింపుము. నీకొక నీతి నుపదేశింతును. వారు జాగ్రత్తపడకముందు నీవే జాగ్రత్త

పడుము. అధికార మెవ్వరిచేతిలో నుండును? సేన యెవని చేతిలో నుండునో వానిచేతిలో నుండును. సేన నీచేతిలో నున్నది. నీవు వారందఱిని బట్టి బంధింపుము. దానితో వీరితిక్క వదలును. సరేగాని పుష్యమిత్ర! నీవు నాల్గుదినము లాగి వత్తువా? పూర్ణిమనాఁడు రమ్ము. ఏమియు లేదు. ఈ సౌధమంతయు నీకుఁ జూపింపవలయును. ఇందు నీవు చూడ వలసిన వెన్నియున్నవి? ఇవి యన్నియు నీకుఁజూపింపవలయు నని యున్నది. ఈ పానగోష్ఠికలు పలువిధములయిన మైరేయ పాకములు. తెలిసికొన వలయును. ఇవి మొదటి బృహద్రథుఁడు కలి ప్రవేశించకముందు తొమ్మిది వందల యేండ్లక్రింద గిరివ్రజ పురము నిర్మించినపుడు రాజులకొఱకుఁ గట్టించిన పానశాలలు. నాఁటినుండి వచ్చుచున్నవి. నేఁటికి నావలనఁ గృతార్థములయి నవి. ఆ మొదటి బృహద్రథుని తరువాత నెంతమంది రాజు లిచ్చట రాజ్యము చేసిరందువు. ఆ బృహద్రథుని తరువాత జరాసంధునివఱకుఁ బదునొండుగురు రాజులు. జరాసంధుని కొడుకు సహదేవుఁడు. అతని కొడుకు మార్జరి. మార్జరి మొదలు బృహద్రథ వంశమువఱకు నిరువది యిద్దఱు రాజులు. వారిలోఁ జివరివాఁడు రిపుంజయుఁడు. రిపుంజయుని సంహరించి ప్రద్యోతుఁడు రాజయ్యెను. ప్రద్యోతవంశమువం దైదుగురు రాజులు. తరువాత శిశునాగ వంశము వచ్చెను. శిశునాగ వంశమునందుఁ బదిమంది రాజులు. నందవంశము తొమ్మండుగురు రాజులు. అప్పుడు మా మౌర్యవంశము వచ్చెను. నే నీ వంశములోఁ బండ్రెండవ రాజను. లెక్క వేసికొనుము. మార్జరివద్దనుండి లెక్కపెట్టుము. ఇరువది రెండు

నైదు నిరువదిగేడు. ఇరువదియేడును బదిగును ముప్పదియేడు, ముప్పదియేడును తొమ్మిది నలుబదియాఱు. నలుబదియాఱును బండ్రెండును నేఁబది యెనిమిదిమంది. కలి ప్రవేశించినది మొదలిప్పటికిఁ బందొమ్మిదివందల యిరువదియేండ్లు గడచినవి. అది మొదలిప్పటికి యేఁబది యెనమండ్రము రాజులము పాలించితిమి. అదియేమయ్యా నే నలువదియవ రాజనైనఁ గాదాయె. లెక్క తప్పకట్టితినిలే. జరాసంధుని నుండి కట్టవలయును, అట్లు కట్టినచో నే నలువదియవ రాజ నగుదును. నా దగ్గఱనుండి గిరివ్రజరాజ్యమునం దొకమాగ్ప రావలయును" – రాజునకు మఱల నెక్కుళ్ళు వచ్చెను. పుష్యమిత్రుఁ డక్లే కూర్చుండెను. శతానీకుఁడు రాజు నగుపెట్టవలయు ననుకొనెను. అతఁడు రాజు నదుపుపెట్టినపుడెల్లఁ గుముద్వతియే సహించదు. పుష్యమిత్రుఁడు సహించునా? కాని శతానీకున కొక తృప్తి కలిగినది. ఎప్పుడో యొకనాఁడు పానగోష్ఠికలనుఁ జూచుటకు భిన్నసురపాకములనుఁ బరిశీలించుటకుఁ బుష్యమిత్రు నొక్కసారి పిలువుమని తాను రాజుతోఁ జెప్పెను. ఇంత యొకటు తెలియని ధోరణిలో రాజామాటను జ్ఞాపక ముంచికొని పుష్యమిత్రుని పిలిచెను. ఇప్పుడు తానేమియు మాటాడరాదు. పూర్ణిమనాఁడు రమ్మని రాజే చెప్పెనుగదా. ఆనాఁడు రాజు రమ్మనుచున్నాఁడని పుష్యమిత్రునకు వార్త పంపించవచ్చును. అని మనసులో శతానీకుఁడానందించుచుండెను. మఱల రాజిట్లనెను. ఏమయ్యా సేనాధిపతీ! మీరు బ్రాహ్మణులుకాబోలు. సురాపానము చేయరు. చేయకపోయిన నేమి? వస్తుగుణ పరిశీలనము చేసినచో దప్పు

లేదుగదా! పూర్ణిమనాఁడు రమ్ము. ఓసి కుముద్వతీ! నా యల్లారు ముద్దు పెండ్లమా! పూర్ణిమనాఁడు పుష్యమిత్రుఁడు వచ్చును. నాకు మీరు త్రావఁబోయుదురు. నాకు నీవు జ్ఞాపకము చేయుము. నేనానాఁడు త్రాగను. పుష్యమిత్రునితో నేను జాల మాటాడవలసియున్నది. మైరేయపాన మత్తతలో నున్నపుఁడు నేను మాటాడవలసిన విషయములను మఱచిపోవుదును." అని రాజు చేతిలోని మైరేయమంతయు నొక్కసారి నోటిలోఁ బోసికొని త్రావి పడిపోయెను. పుష్యమిత్రుఁడా భవనమునందున్న యైదాఱుగురు పురుషులనుఁ దన వెంటఁ దీసికొనిపోయెను.



ఇప్పుడు తమరినేమని సంబోధించవలయునో నాకుఁ దెలియుట లేదు. నా యుత్తరము తమరికిఁ జేరునాఁటికి తమరు ధర్మాజానియగు యోగమునకు నైదు దినములే నడుమ నుండును. నేనీదేశము వచ్చి యైదేండ్లయినది. ఇప్పుడు నా పేరు తమకు వ్రాసినచో మీ రాశ్చర్యపోవుదురు. నా పేరు వ్రాసినందువలనఁ బ్రయోజనము లేదు దానియర్థము కూడ నాకుఁ జెప్పవలయును. ఇప్పుడు నాపేరు ఫుస్ - మిరత్ షాకీ నోజ్. ఇది నాపేరు. ఈ చివరి కీ నోజ్ అన్న శబ్దమప్పుడప్పుడు కోఁజి యని యుచ్చరించుటయుఁ గలదు. కియన్న యక్షరమునకు వెనుకనున్న నకారము అర్ధానుస్వారోచ్చారణము గల

దిగా మాఱి ఖోఁజియైనది ఈ ఖకారమును ముక్కులోఁ బలుకవలయును. నా కీపేరెట్లు వచ్చినదో తమకుఁ దెలియక పోవచ్చును. ఇది పుష్యమిత్ర భాగినేయ యన్న శబ్దమునకు మార్పు. పుష్యశబ్దము పుస్ అయినది. మిత్రభాయన్నది. మిరత్ ఫాయైనది. మిగిలిన యక్షరములు ఖోఁజి యగుటలోఁ దప్పేమియు లేదుగదా. ఈ దేశములోఁ గొందఱు పండితు లున్నారు. వారి శబ్దములన్నియుఁ స్వేచ్ఛంభూతము లను చున్నారు. నేను గాదనుటకు వీలులేదు. ఇప్పుడు నా స్థితి యెట్టిదో తమరికి నేను వ్రాయను. తమ యశ్వమేధయాగము పూర్తిచేయునాఁటికిఁ దమరిచేత జయింపఁ బడిన రాజులు మీకుఁ గప్పము కట్టువారే రావలసియుండును. గాన నప్పుడు వత్తును. ఇప్పుడు తమరి కీలేఖ నెందుకు వ్రాయుచున్నా ననఁగా నశ్వమును వదలిపెట్టునప్పుడు దాని వెనుక నెవరినిఁ బంపించవలయునన్న ప్రశ్న పుట్టును. నే నిచ్చటికి వచ్చునప్ప టికిఁ దమకొక కుమారుఁడు గలఁడు. ఆయన పేరగ్ని మిత్రుఁడు. ఆయన యానాఁటికి, బదియేండ్లవాఁడు. ఇప్పటి కాయనకుఁ బదునేనేండ్లుండును. ఆయన జాతకము నావద్ద నున్నది. కొద్ది దినముల క్రింద నేను దానిని మఱలఁ జూచితిని. అతఁడు మహాజాతకుఁడు. ఉదయన మహారాజు జాతక మెట్టిదో యతని జాతకమట్టిదిగా నున్నది. సంస్కృత సాహి త్యమున నతని పేరు శాశ్వతముగా నిలిచియుండు యోగ మున్నది. ఆయన బాలుఁడని సంశయించవలదు. తమరి కుమారుఁ డగుటచేత నాయనకీపాటికే సేనాశిక్షణ మంతయు జరిగియుండునని విశ్వసించుచున్నాను. కుఱ్ఱవాని నొంటిగాఁ

బంపించుట తమకు సంశయ హేతువైనచో నుపవర్షుని వెంటఁ బంపింపవలయును. ఉపవర్షుఁడు తమ తరువాత సేనాపతి. ఆయన వృద్ధు. సర్వసమర్థుఁడు. ఆయన రక్షగా నుండఁగా నగ్నిమిత్రున కేమియు భయ ముండదు. నే నీజాబు వ్రాయు చుండఁగా నా కొక సందేహము కలుగుచున్నది. నేను యవనుఁడన యి పోయితిని. నన్ను మీరు విశ్వసింపరేమోయని. కాని తమరి చార చక్షుస్త్వము నాకుఁ దెలియును. నా సంగతి పూర్తిగా మీ రిదివఱకే తెలిసికొని యుందురని యనుకొను చున్నాను. ఆ మహాజ్యోతిష్కుఁడు నారాయణభట్టు రైదు సంవత్సరములనుండి తమవద్దనే యున్నాఁడని నాకు వార్తలు వచ్చినవి. అగ్నిమిత్రుని జాతకము నాయనకుఁ జూపించియే యుందురు. ఇచ్చటికే వచ్చిన తరువాత నా జ్యోతిశ్శాస్త్ర జ్ఞానమెచ్చట నుండెనో గొంగళీయనఁగా, నేసినచోటనే యుంటి నన్నట్లున్నది. ఆ దినములలో నారాయణభట్టు ప్రముఖుల నిత్యసంపర్కముచేత నా జ్యోతిర్విద్యాజ్ఞానము దినదిన మొక్క పూవు పూయుచుండెడిది. ఇప్పుడు పూచిన పూవు వాడకుండఁ జూచికొనుటయే నాకుఁ బనిగా నున్నది. అశ్వమేధయాగమునుఁ గూర్చి నా కెక్కువ తెలియదు. కాని గుఱ్ఱము విడిచిపెట్టిన తరువాత నది యొక్క యేడాది తిరిగి రావలయుననియు నా సంవత్సరమంతయుఁ గర్తదీక్షలో నుండవలయుననియుఁ దమ సన్నిధికి వచ్చిన పండితులలో నొకా యన ప్రాసంగికముగఁ జెప్పినట్లు జ్ఞాపకము. తమరు దీక్షలో నుండఁగా నగ్నిమిత్రుఁ డశ్వరక్షకుఁడుగా రాఁగా రాజ్యవ్యవహారము లెవ్వరు చూతురని నాకుఁ బ్రశ్న పుట్టెను. మహా

సహస్థులయిన తమరివిషయము నేను విచారింపవలసిన యవసరము లేదుగాని నా కృతఘ్నత కీర్తిగా నివృత్తి కలిగించికొనవలయునన్న భావము నన్నుఁ బ్రేరేచుచున్నది. ఆ నారాయణభట్టు గొప్ప రాజకీయవేత్త. తమరి కవగతమయి యుండవచ్చును. ఆయనను మహామంత్రిగాఁ జేసినచో దీక్షాకాలమునందు రాజ్యాంగ వ్యవహారము సుష్ఠుగా నుండునని నా యుద్దేశము. ఆయన పలుసార్లు నాతో వాదించెడివాఁడు. శాస్త్రజ్ఞానము లోకమునకుఁ బాహిరమైనది కాదు. లోకజ్ఞానములోని మేలిమియే శాస్త్రజ్ఞానమని. తమరి యిష్టము. ఈ యుత్తరము తమకుఁ బంపించుట నేఁడు నాకు మిక్కిలి సులభమయిన పనియైనది. ఐదేండ్లు నావార్త తమకుఁ దెలియదు. మొదటి యుత్తరమునుఁ బంపించుట కొంత క్లేశకారియైనది. సంవత్సరము గడచిన తరువాత నశ్వమేధాంతమునఁ దమరు నా కృతఘ్నతను మన్నించినచో దమపాద సన్నిధానమునకు వచ్చి నా చరిత్రమును విన్నవించుకొందును. సర్వదా క్షంతవ్యుఁడను.

పుష్యమిత్రుఁ డీలేఖనుఁ జదివికొనెను. ఇంతట నారాయణభట్టు నచటినుండి యతేఁడునుఁ దన్నుఁ దరుముచుండిరి. ఇంతటి భూతభవిష్యద్వర్తమాన పరిజ్ఞానము కల జ్యోతిర్విద్వాంసుల బుద్ధివైభవముతోఁ బూర్వరాజులు రాజ్యము చేసిరనఁగా నాశ్చర్య మేమున్నది? వీరు చెప్పినట్లు తను రాజునైనచో నావలన వైదికమతము పునరుద్ధరింపఁ బడినచో భవిష్యల్లోకము పుష్యమిత్రునిఁ జెప్పికొనునుగాని నారాయణభట్టన్న వాఁ డొకఁ డుండెనని యెఱుఁగరు. నా భాగినేయుని

పేరు మొదటి యక్షరము ఫాగామాజీ తక్కినది ఖోజియైనదని యెఱుఁగరు. అతఁడన్నట్లు రాజు పూర్ణిమనాఁడే పుట్టెనే. రాజు మాటాడిన లక్షణమునుబట్టి రాజు నన్ను వధించవలయు నన్న యూహా కలిగియున్నట్లు లేదు. అతఁడు పైకేయపాన వివశుఁడై మహావిషయము లున్నట్లునివలె మాటాడెను. ఈ గిరివ్రజముయొక్క చరిత్ర యాయన కెంత తెలియును? అది మగధరాజు లందఱకుఁ బరంపరగా వచ్చుచున్న జ్ఞానమేమో? నాతో నెందుకుఁ జెప్పెను? ఈ రాజ్యమునకు నేను రాజును గాఁబోవుచున్నాను కనుక, నాయనకు దెలియకుండ నాతోఁ జెప్పి యుండుట చేసి నేను రాజును గాఁబోవుచున్నానన్న దానికి సూచనయేమో? నావలన నుపకారము పొందిన యాఱుగురిని రాజసౌధమునుండి తొలఁగించితిని. ఇతర గ్రామములు పంపించితిని. వారిబదులు క్రొత్తవారిని బంపించితిని. రాజయినవాని కొక్క రాజనీతియే కావలసినది? సర్వశాస్త్ర పరిజ్ఞానము కావలయును. జ్యోతిషము మిక్కిలియుఁ బ్రధానమయిన విషయమని యిప్పుడు తెలియుచున్నది. కాలము ననుకూలించినచోఁ జేయుదము. లేనిచో జేయము. వృథాప్రయత్న మెందులకు? ఆ నారాయణభట్టు మంత్రి కాఁదగినవాఁడా? మొన్న నాయనతో మాటాడిన మాటలకు నీ యుత్తరములో వ్రాసిన వ్రాఁతలకు సరిపోవుచున్నది. రాజు నాతో మాటాడ వలయునన్నాఁడు. తానా నాఁడు సురాపానము చేయకుండ నుందునన్నాఁడు. చిన్న రాణినిఁ దన్ను ప్రబోధించుమన్నాఁడు. రాజంత యిక్కట్టులో నున్నాఁడు. ఈ శతానీకున కింతటిబల మెట్లు వచ్చెను? కుముద్వతియొక్క భక్తి ద్విధాభూతమై

యుండవలయును. ఆమెకు రాజన్నచో నెంత ప్రేమయో యన్న
గారన్నచో నంత ప్రేమయే యుండవలయును. మఱియు నీ
యన్నగారు కుముద్వతిమీఁద నింత యధికారము సంపాదించు
టకుఁ గుముద్వతియొక్క యేదో రహస్యము వానికిఁ దెలిసి
యుండవలయును. ఆమె యిచ్చటికి రాకపూర్వము వారిది
పల్లెయుఁ బట్టణముకాని యూరు. అచట వారు సురావిక్రేతలు.
విక్రయశాలలో నీమె యమ్మకమునకుఁ దోడగుచున్న సౌందర్య
వతి. అప్పటి యామెలీల యెట్టిదో యారహస్యము బయటఁ
బెట్టుదునని యన్న యామెను బెదరించుచుండినచో నామె
తనకు రాజుమీఁదఁగల ప్రేమ తన భోగము తన యధికారము
తన యోగము వ్యర్థమగునని భీతిపొంది, వాఁడు చెప్పినట్లు
నడవవచ్చును ముం దీ రహస్యమునుఁ గనుఁగొనవలయును.
అచటనున్న నా రహస్య చారుల నందఱినిఁ దొలఁగించితిని.
ఇప్పు డీరహస్య మెట్లు తెలియును? ఏదియో కానున్నది కాక
మానదు. పూర్ణిమనాఁడు వెళ్ళెదను. శతానీకాదులు నన్ను
సంహరించుటకుఁ బ్రయత్నము చేసినచోఁ జూతును. బ్రాహ్మ
ణుఁడు భిక్షుకుఁడు, వివాహాదులు చేయించుటకే పనికివచ్చును.
ఈమాటల యర్థమేమో వారికిఁ దెలియఁజెప్పెదను. అదే
పరశురాముఁడు బ్రాహ్మణుఁడు కాఁడా? ద్రోణాచార్యుఁడు
కాఁడా? అశ్వత్థామ కాఁడా? చాణక్యుఁ డెటువంటివాఁ
డయినను రాక్షసుఁడు వట్టి మంత్రికాఁడే? ఆయన మహా
యుద్ధ విద్యానిపుణుఁడు. నా సంగతి వీరికేమి తెలియును?
వీరు సుక్షత్రియులు కారు. కటారికాండ్రును గారు. ఎప్పు
డైనఁ గత్తిపట్టికొని యటు నిటు త్రిప్పిరేమో తెలియదు.

అరే పూర్ణిమ యెన్నినాళ్ళలో వచ్చినది. రాజు రమ్మన్నాఁడు. నేనే పోదునా? వార్త వచ్చునా? ఇదిగో వార్త వచ్చినది. "ఔనోయీ! పొమ్ము వచ్చుచున్నానని చెప్పుము" అంతటఁ బుష్యమిత్రుఁడు తాను గవచమును ధరించెను. ధట్టీ కట్టెను. అంసభాగములందు దండలయందు మణికట్లయందు సన్నని యినుపతీగెలతోఁ జేసిన రక్షా కవచములను ధరించి పైన దుస్తులు ధరించెను. శిరసునందు వజ్ర కఠినమయిన సూక్ష్మ శిరస్త్రాణమును ధరించి పైన నుష్ణీషమునుఁదాల్చెను. డాలు పుచ్చుకొని పోవుట న్యాయముకాదు. తాను సేనాపతి కనుక ఖడ్గమును ధరింపవచ్చును. ఆ ఖడ్గము నెన్నను. తాను దొలినాఁడు మహా సేనాపతి యుద్యోగమునుఁ బొందిననాఁడు రాజు తన్నుఁ బరీక్షించిననాఁడు. తన నాఁడు మత్తానే కేప మునుఁ బురికొల్పిననాఁడు తాను ధరించిన ఖడ్గమును స్వీకరించెను. ఆ ఖడ్గముయొక్క లోహ కాఠిన్య మెట్టిదనఁగా నయో దండమును దానితోఁ గొట్టిన ఖడ్గము మొక్కవోదు. విఱుగదు. ఓయి పుష్యమిత్రా! ఎందుకింత సన్నాహము? సింహబల శ్వేతాశ్వ శతానీకుల కొఱకా? వారికొఱకుఁగాదు. వారెవ్వరినో గుప్తపఱచియుంచిన కటారికాండ్రకొఱకా? వారెవరయి యుందురు? గిరివ్రజపురవాసులా? సైనికులా? దూర దేశము నుండి వచ్చినవారా? గిరివ్రజపుర నివాసులయినచోఁ దన కెదురు తిరుగరు. దూర దేశవాసు లయినచోఁ దనకుఁ దెలియకుండ వారు దుర్గమునం దిన్నాళ్లు రహస్యముగా నెట్లుందురు?

పుష్యమిత్రుఁడు రాజభవనమునకుఁ బోయెను. చిన్నరాణి మేడకుఁ బోయెను. ద్వారమునం దెవ్వఁడును లేఁడు.

అరే! ద్వారపాలకుఁడు లేని స్థితి వచ్చెనా? రాజసౌధమునకు లోనికిఁ బ్రవేశించెను. రాజు కూర్చుండి యుండెను. తన్ను వచ్చి కూర్చుండుమనెను. పుష్యమిత్రుఁడు కూర్చుండలేదు. ఆయన ధరించిన కవచములు పుష్యమిత్రునిఁ గూర్చుండ నీయవు. అతఁడట్లే నిలబడియుండెను. రాజు పుష్యమిత్రునిఁ జూచెను. "సేనాపతీ! వచ్చితివా? నేనెంత త్రాగకుండ నుందమనినను నన్ను వీరు త్రాగించిరయ్యా. ఐనను నేను జాగ్రత్తగానే త్రాగితిని. నే నన్నియుఁ జూపించెదను. నీవు బ్రాహ్మణుఁడవు. రేపు రాజ వయినచో నీ పానగోష్ఠికలతో నీకేమి యవసరము? వీని యుపయోగమేమి? కాదు. కాదు. గిరివ్రజపురమున నెన్ని రాజవంశములు వెళ్ళినవి? సర్వరాజవంశములయందు మొదటి రాజులందఱు యోగ్యులుగానే యుందురు. ఆ రాజవంశము నశించెడి వేళకు నావంటివాఁడు పుట్టును. కుముద్వతీ! నన్నుఁ బట్టికొనుము. అడుగో నీయన్న. వానిని నావద్దకు రానీయకుము." అచటినుండి వారు తన్మహాసౌధ భిన్నప్రదేశములనుఁ దిలకించుచుఁ బోయిరి. రాజిట్లనుచుండెను "ఓయి పుష్యమిత్రా! నీవు చిత్ర విచిత్రములయిన వస్తువులు చూతువు. ఏవగించుకొనకుము. కొన్ని నీ వెప్పుడు నిట్లుండునని యూహించవు. తొలుత నీ గదియందున్న విషయములనుఁ జూపింతును. ఈ రజత భాండముల వరుసయున్నదే వీనినిండ సుర నింపఁబడియున్నది. సుర యనఁగా నీ వెంత త్రావినను త్రావుమనుచుండును. దానికిఁ గడుపు నిండుట యన్నది లేదు. పొట్టయుబికి వచ్చుచుండును. ఇంకనుఁ ద్రావుటకు లోపల స్థలముండును. వీని ప్రక్కనది కాంస్యభాండము,

ఇందులోనున్న కల్లుపేరు హాలిప్రియ. పూర్వము బలరాముఁడీ మద్యమునుఁ ద్రావెడివాఁడట. నీకుఁదెలియునో తెలియదో కృష్ణునకు జరాసంధునకు విరోధముకాని బలరామునకు జరాసంధునకు విరోధము లేదు. సురా విశేషములోని రహస్యములు గిరివ్రజపురమునుండి ద్వారకా పురమునకు, ద్వారకా పురమునుండి గిరివ్రజపురమునకు వార్తలుగా వెళ్ళుచుండెనట. ఆనాఁటినుండి దీనిపేరు హాలిప్రియ. అనేక రకములయిన కల్లులు కలవు. ఈ కుముద్వతి తండ్రికేమి తెలియును! నేను వాని నన్నింటిని పాకములు కట్టించి సిద్ధము చేయించితిని. అది యంతయు నొక గ్రంథజాలము. ఇవి యన్నియు నీకుఁ జూపించిన తరువాత నా గ్రంథభాండాగారమును నీకుఁ జూపించెదను. ఆ కుండనిండ నున్నది. హాల. అది రతివేళఁ ద్రావఁదగిన మద్యము. అది త్రావిన వానికి సిగ్గుండదు. నే నీనాఁడు త్రావిన మధ్యమేమో నీకుఁ దెలియునా? నీవు వత్తువని ప్రత్యేకముగాఁ ద్రావితిని. దానిపేరు పరిస్రుట్టు. దానినిఁ ద్రాగినవారు కూర్చుండలేరు. తిరుగుచుండవలయును. నీటివి యన్నియు నేను జూపించవలయునుగదా! అందుచేత దానిని సేవించితిని. ఆ తరువాత భాండములో నున్నది వరుణాత్మజ. అది కుముద్వతియొక్క తెలివితేటలచేత నిర్మింపఁ బడ్డది. కుముద్వతి యింకొక కల్లు త్రావదు. దానినే త్రావును. కుముద్వతి నన్నెంతయో బలవంతము చేసినది. నేనది త్రావలేదు. నేను త్రావను. అది స్త్రీలు త్రాగెడు మద్యము. రమించుటకు బదులు రమింపఁ బడుదునేమో యని. రాజు కుముద్వతివంక జూచి నవ్వెను. అన్ని కల్లి

లోకమొత్తు. ఆ మూలనున్న హేమభాండములోని కల్లొక
యొత్తు. దాని పేరు గంధోత్తమ. అందులో నీ సుగంధ
ద్రవ్యముపడు, నీ సుగంధద్రవ్యము పడదని లేదు. లోకములో
సుగంధద్రవ్యము లిన్ని యుండునని నీకేమి తెలియును?
లోకమునకు నాల్గయిదు సుగంధ ద్రవ్యముల పేర్లు తెలియును.
కొన్ని పేర్లు చెప్పెదను విందువా? కుంకుమము, కాశ్మీ
రజము, అగ్నిశిఖము, వరము, బాహ్లీకము, పీతనము, సంకోచ
పిశునము, లోహితము, దేవకుసుమము, జాయకము, కాలే
యకము, వంశనము, రాజాధరము, క్రిమిజము, అగరు,
సరే మీరంద తెలిసిగిననదే. పుష్యమిత్రా! అగురులలో మల్లి
గంధియని యొకటుండున్నది. దాని వాసన, మాఖ్యాపరీమళము
వెలార్చుచుండును. ఇంక నెన్నో పేర్లున్నవి. అవి యన్నియుఁ
జెప్పి నిన్ను విసివించుట యెందులకు? రెండందమయిన పేర్లు
గల వస్తువులున్నవి. ఒకదానిపేరు యక్షకర్దమము. మఱియొక
దానిపేరు చంద్రసంజ్ఞము. వీనిలో నొకొక్క దానిని సంపా
దించుట యెంత కష్టము. నేనీనాఁడు తొలుతఁ బరిస్రుట్టు
త్రావితిని. తరువాతఁ బ్రసన్నయను మద్యమునుఁ ద్రావితిని.
ఈ ప్రసన్ననుఁ ద్రావిన వానికి నెంత త్రావినను మనస్సు
చెడిపోదు. ఆ మూలది యిరాభాండము. ఇదిగో ఇటు రమ్ము.
దీని పేరు కాదంబరి. కాదంబరి యనఁగా దానికా పేరెట్లు
వచ్చెనో తెలియునా? గోమంతమన్న పేరున్నది. ఆ గోమంత
పర్వతము మీఁదఁ గదంబవృక్షము లుండును. ఆ కదంబ
వృక్షములనుండి తీసిన రసమునకుఁ గాదంబరి యని పేరు.
దీని విశేషమేమని యడుగుదువు? తాళవృక్షముల నుండి కల్లు,

అడుగో వాఁడున్నాఁడే శతానీకుఁడు, వాని తండ్రికి బాగుగాఁ దెలియును. వానికిఁ గాదంబరి యనఁగా బాగుగాఁ దెలియదు. కదంబవృక్షముల యందలి కల్లనఁగా నది యేమనుకొనుచుం టివి? నేను వందయేండ్ల వృద్ధుఁడను. కాని నేను యువకుఁడను. దానికిఁ గారణ మీకాందబరి. కడిమిచెట్టునం దాశక్తి యున్నదయ్యా! దేవ్యుపాసన చేయువారికిఁ దెలియును. దుర్గాదేవికున్న సహస్రనామములలో నొకటి కదంబ వన వాసిని. అనఁగా నేమి? సృష్టియందలి సర్వ స్త్రీత్వము యొక్క మూలమట్టుగాఁ జెప్పఁదగిన లైంగికశక్తియొక్క సార భూతమైన వృక్షము కదంబ వృక్షము. అది కాదంబరి. దీని పేరు వరిస్రుత. ఆ ప్రక్కది మదిర. ఇది కశ్య. హాలయుఁ బరిస్రుతయుఁ గశ్యయు మూఁడు నొకటే లక్షణములు కలవి. వానియం దెక్కువ భేదములు లేవు. ఇక్కడికివి చాలును. ప్రక్కగదిలోనికిఁబోదము, పద. చూచితివా! యిది చిన్నగది. ఈ యుండలన్నియుఁ జూడుము. ఇవి యన్నియు నవదంశ ములు. అనఁగాఁ గల్లుత్రావునపుడు వీనినిఁ దినుచు ద్రాఫు చుండవలయును. ఆ మద్యములు లోనికిఁ బోవుచు లోపలి ప్రేవులను దగులఁబెట్టుచుఁ బోవును. వీనిని దినుచుండ వలయును. ఆ మద్యము లెక్కువభాగము వీనిని మాడ్చు చుండును. అగ్ని యేమి చేయును? ముం దెదురుగానున్న దానినిఁ గాల్చును. వాని వేడిమి పార్శ్వములందున్న వారికి దెలియవచ్చును. కుక్షిస్థములైన నరములను మాడ్చకుండ దీని కెదురుగ వీనిని వేయుదుము. అచట నెన్నివిధములయిన మద్యములు కలవో యచట నన్నివిధములయిన యవదంశములు

గలవు. ఏమయ్యా! నీకు ముక్కున్నది. ఈపరిమళమునుఁ జూచితివా? ఈ పరిమళము లెంతవి? నరకలోకము నందలి దుర్వాసన యంతయు నుపశమింప జేయఁదగినంతవి. ఇవటి నుండి నిన్ను మఱికొన్ని చోట్లకుఁ దీసికొని పోవుదును. ఈ గదిలోనికి వచ్చితిమిగదా! ఇచ్చటఁ జూడుము. కొందఱు కూర్చున్నారు. రాజు వచ్చెనని వారికిఁ దెలియదు. వారు లేచి నిలుచుండనయిన నిలుచుండరు. వారు త్రాగెడి క్రమ మేదియో తెలియునా? ఇట్లు పాత్రమునోటినుండి త్రాగఁగా నట్టింకొక పాత్రయు పెదవులవద్ద నుండవలయును. దానిపేరు మధుక్రమ మందురు. అది యూవిద్యకు సంబంధించిన మాటలే. ఈ మధుక్రమమునందుఁ బ్రధానముగాఁ ద్రావఁ బడునవి రెండే మద్యములు. ఒకఁడు మధ్వాసవము. రెండవది మార్ద్వీకము. మొదటిది యిప్పపువ్వులనుండి తీయఁబడునది. రెండవది ద్రాక్షపండ్లనుండి తీయఁబడునది. మధ్వాసవమఁగా నిప్పపూవు కల్లు. మధుక్రమమునందుఁ బ్రధానముగ నదియే త్రాగఁబడును. ఏలయనఁగా వాఁడిచటినుండి లేవలేఁడు. లేచి భోజనము చేయుమనఁగా వాని కిష్టముండదు. అన్నము తినకపోయినచో వాఁడు చనిపోవునుగదా! ఇప్పకల్లు త్రాగిన వాని కాకలియుండదు. వాఁడట్లు పడియుండును. నిన్నింకొక చోటికిఁ దీసికొని పోవుచున్నాను. నీ వేమియు భయపడ వలదు. ఓయి శతానీకుఁడా! ఆ తలుపు తెఱువుము.' తెఱచి నంతనే కేకలు వినిపించెను. రా జిట్లనెను.' వినఁబడుచున్న వా? వారొక విలక్షణమైన కల్లు త్రావుదురు. దానిపేరు కిణ్వము. ఆ లోనికి మనము పోవద్దు. అచ్చట నేమున్నదితే. అసలు

చూడవలసినది వేఱే యున్నది. అచటికిఁబోయి చూపింతును. నీవు జుగుప్స వహింపవలదు. ఆ లోనికి నిన్నుఁ దీసికొని పోయెదను. ముందు దానిని గుఱించి చెప్పి తీసికొనిపోవుదును. అది వేఱే గది. ఆ గది తలుపు లెప్పుడును బిగించియుంతుము. ఒక కల్లున్నది. దానిపేరు నగ్నహూవు. దానిని ద్రావిన వారు దిస్సమొలలతో నుండురు. వారు తమ యొడళ్ళమీఁద వస్త్రములుంచుట సహింపలేరు. తక్కిన మద్యములకును దీని కిని భేదము కలదు. తక్కిన మద్యము లన్నియు నెవనికిఁ వాఁడు ద్రాపుచుండును. ఇది యట్లుకాదు. వాఁడు ద్రావు చుండును. ఇతరులను ద్రావుమనుచుండును. దిస్సమొలలతో నుండి యితరులయిన దిస్సమొలల వారిని ద్రావుమని పిలిపించు లక్షణము కలదగుటచేత దీనికి నగ్నహూ వన్న పేరు వచ్చినది. ఈకల్లు నెట్లు వండుదురో నాకుఁ దెలియదు. ఇది పరమ రహస్యము. ఈశతానీకుని తల్లియున్నదే దానికిఁ దెలియును.' ఈమాట యనినంతనే రాజు తన తల్లినిఁగూర్చి చేసిన నింద శతానీకుని తలకెక్కెను. రాజు లోనికిఁ బోదము రమ్మని పుష్య మిత్రుని హస్తము పట్టుకొనెను. శతానీకుఁడు తద్ద్వారార్గళ మునుఁ దెఱచుచుండెను. కుముద్వతి వారి యిద్దఱి కడ్డము వచ్చెను. రాజామెనుఁ దొలఁగింపఁబోయెను. ఆమె యేమైన సరే పోనీయ ననెను. రాజామెను పెడకుఁ ద్రోయుచుండెను. శతానీకుఁడు వెనుఁదిరిగి చూచెను. అతని కన్నులలోనుండి నిప్పులు రాలుచుండెను. సగము దీసిన యర్గళమును మఱల బిగించి యతఁడు చెల్లెలివద్దకు వచ్చెను. ఆమెనుఁ గొట్టునా యన్నట్లుండెను. కుముద్వతి తొందఱగా నా ద్వారమువద్దకుఁ

బోయి దానికి వ్రేలియున్న తాళమును బిగించి యా తాళపు జెవిని తన చేతిలో గట్టిగాఁ బట్టుకొనెను. శతానీకుఁ డామె చేతిలోని తాళపుఁజెవిని లాగికొన బోవుచుండెను. పుష్య మిత్రుఁ డిది యంతయు చూచుచుండెను. ఆమె రాజుభార్య. రా జచ్చట నుండెను. వాఁ డామె యన్నగారు. తానేమి చేయవలయును! ఇట్లనెను. 'ఏమోయి శతానీకా! ఆమె నీకుఁ జెల్లెలైనను నామె రాణి. నే నిచట నుండఁగా నామె మీఁదఁ జేయి వేయుకుము. ఆమెను వదలి దూరముగ నిలు చుండుము.' 'ఇది రాణికాదు. ఇది రాక్షసి. పితృద్రోహము చేయ నెంచుచున్నది. భాతృద్రోహము చేయ నెంచుచున్నది!' అనఁగాఁ గుముద్వతి 'అయ్యా మహాసేనాపతీ! యని యేమి యోచెప్పఁ బోవుచుండెను. శతానీకుఁ డామె నోటినిఁ దన చేతితో నదిమెను. వాఁ డామె నోటి నదుముచునే యుండెను. ఆమె నోటినెంటఁ గొన్ని మాటలు వచ్చుచునే యుండెను. ఆమె నోటివెంట వచ్చుచున్న మాట లిట్లు వినిపించు చుండెను. 'మిమ్ము - చంపుటకు- కటారివాండ్రు - నేఁడు - వారు త్రాగ లేదు - పన్నాగము- రాజద్రోహము- ఈమాటలు విన్నంతనే పుష్యమిత్రునకు సర్వము నవగతమయ్యెను. ఇది రాజును జంపుటకు యత్నమా? తన్నుఁ జంపుటకు యత్నమా? అత నికిఁ దెలియలేదు. పుష్యమిత్రుని చేయి తన ఖడ్గముమీఁదఁ బడెను. పుష్యమిత్రునకుఁ దెలిసిన యర్థము రాజునకుఁ దెలి సెను. రాజునకు శతానీకునిమీఁదఁ గోపము వచ్చెను. శతా నీకుఁ డిట్లనెను 'మహారాజా! ఇది దుర్మార్గురాలు. ఇది ని న్నెన్నాళ్ళు మోసము చేయుచున్నది. దీని కుపభర్త

యున్నాఁడు. వాఁడీ గదిలో నున్నాఁడు. లోనికిఁబోయినచో వాఁడు దీనిని వెంటనే కౌఁగిలించికొనును. ముద్దాడును. నీకా రహస్యము తెలియును. అందుచేతఁ జెప్పుచున్నది' అనఁగానే రాజునకుఁ గోపము వచ్చెను. ఆయన బొడ్డులోఁ జుఱకత్తె యున్నది. దానినిఁదీసి కుముద్వతినిఁ బొడువఁబోయెను. శతానీకుఁడుగూడఁ గుముద్వతినిఁ జంపుటకుఁ గత్తి నెత్తెను. పుష్యమిత్రుని ఖడ్గము శతానీకుని శిరస్సు ఖండించెను. రాజు పుష్యమిత్రు నెదిరించెను. పుష్యమిత్రుఁడు తన్ను రక్షించుకొనఁబోవుచుండఁగాఁ బుష్యమిత్రుని ఖడ్గము రాజుయొక్క గుండెలోఁ బడెను. రాజు నేలఁ బడెను.

౬

క్రిందఁ బడిపోయిన రాజుమీఁదఁ గుముద్వతి పడి యేడ్వ నారంభించెను. రాజునకుఁ బ్రాణము వెంటనే పోయెను. పుష్యమిత్రుఁడు చూచెను. పరిస్థితి యిట్లు విషమించు ననుకొనలేదు. అది యేదో కొందఱు తన్ను సంహరింపవత్తురని యందులోఁ దత్కాలావేశమున రాజు కూడఁ జేరునని తాను వధింపక తప్పక వచ్చునని యనుకొనెను. తాను కవచియై వచ్చెను. సామాన్య పరిస్థితియైనచోఁ దన యం దెంతైన దోషము భాసించెడిది. అట్లు దుఃఖించుచున్న కుముద్వతి చేతిలోనున్న యా నగ్నహాలగది తాళముచెవి తాను దీసికొని సురాపాయులున్న గదులన్నింటిని బయట

గొళ్లెములు బిగించి పుష్యమిత్రుఁడు కనిపించిన పరిచారకుల నందఱిని లోనికిఁ బో నీయకుండ బైటికిఁ బో నాజ్ఞాపించుచు నా మహాసౌధము వెలికివచ్చెను. తాను మున్నాదేశించిన ట్లుపవర్షుఁడు పదిమంది సైనికులతో వచ్చి యచట సిద్ధముగా నుండెను. పుష్యమిత్రుఁ డుపవర్షుని దగ్గఱకుఁ బిలిచి జరిగిన దంతయుఁ జెప్పెను. లోనికిఁ దీసికొనిపోయి యతనికిఁ జూపించెను. ఇరువురును బయటికి వచ్చిరి. ఉపవర్షుఁడు దుర్గమంతయు భద్రపఱచితిసని చెప్పెను. అమాత్యుల యందఱి యిండ్లనుండి పూర్వము కాపున్న సైనికులనుఁ దొలఁగించి యుపవర్షుఁడు తనకు విశ్వాస్యులయిన వారిని నియమించెను. ఆ యమాత్యులెవ్వరు బయటకు వచ్చుటకు వీలులేదు. కుముద్వతి తల్లిదండ్రులను ద్రత్ప్రాతఃకాలముననే బంధించిరి. సింహబల, శ్వేతాశ్వులు కనిపించలేదు. గంధగజుఁడునుఁ గనిపించలేదు. సర్వ మంత్రులయొక్క కార్యపుఁగొలువు చావళ్లు గలవు. అన్నిచోట్ల సైనికరక్షణ యేర్పరచఁబడెను. మహానగరమునందు రక్షకభట మహాగారమునందు సైనిక నివేశనమునందు జాగ్రత్త హెచ్చరింపఁబడెను. సర్వము భద్రముగా నుంచఁబడెను. ఉపవర్షుఁడు వెంటనే భటుల కాదేశించెను. మహానగరమునం దంతటను రాజ్యపరిస్థితి క్లిష్టముగా నున్నది. రాజవంశమునందు విప్లవము కలుగవచ్చును. మఱలఁ జాటింపఁ బడువఱకు జనులెవ్వరును వీధులవెంటఁ దిరుగ రాదు. అంగళ్ళు తెఱువరాదు. ఆజ్ఞాలంఘనము చేసిన వారిని సైనికులు సంహరించినచో నభియోగము లేదు. దుర్గమునం దంతట నిట్లే చాటింపఁబడెను. ఇది యంతయు జరిగిన తరువాత

సువర్షుఁడును బుష్యమిత్రుఁడును మఱలఁ గుముద్వతి వద్దకు వచ్చిరి. కుముద్వతి యింకను మూర్ఛలోననే యుండెను. ఆమె నేమిచేయవలయునని యాలోచింపఁగా, సువర్షుఁ డిట్లనెను. 'ఈమెవలననే యీ విపత్తంతయు వచ్చినది. ఈమెకు యావజ్జీవితము కారాగారశిక్ష విధింపఁ బడవలయును.' పుష్య 'కాదయ్యా! కాదు. ఆమె గంజాయి వనములోని తులసిమొక్క. ఆమె లేనిచో వ్యవహారమిట్లు సాగెడిదికాదు. తాను రక్తసిక్తాంగుడై బైటికి రావలసియుండెడి. ఆ గదిలో నెవ్వరున్నారో చూడవలయును. సింహబల శ్వేతాశ్వులు గంధ గజాదులు తమ యిండ్లయందు లేరు. వారిలోపల నుందురని నా యుద్దేశము. ఆ ద్వారబంధమునుఁ దెఱచి చూడవలయును. నలువురు సైనికులనుఁ బిలిచి యీపని చేయింతమా?" ఉప- 'ఈమాత్రపుఁ బనికి సైనికులు కావలయునా నేనే చూతును' పుష్య "నేనుమాత్రము తెఱచి చూడలేనా? లోనున్న వారి చేత మన కాపద జరుగునన్న భయముకాదు. ఈ సంగతి పదిమందికిఁ దెలియవలయును. మనము రాజును వధించినట్లు కనిపించను. కుముద్వతి యిచ్చటనే యుండఁగాఁ దాను చేసిన సర్వదుష్ట ప్రయత్నము లోకమునకుఁ దెలియఁజేయవలయును. బైటనున్న సైనికదళాధిపతిని లోనికిఁ దీసికొనిరమ్ము" ఆదళాధిపతి రాఁగా సువర్షుఁడు జరిగిన సంగతి యంతయుఁ జెప్పెను. పుష్యమిత్రుఁ డిట్లనెను "రాజునకు సమీప బంధువు లున్నారు. వృద్ధులయిన జ్ఞాతు లున్నారు. వారాగ్గలు, దుర్గాధిపతి, మహా నగరమునఁ బౌరజ్యేష్ఠు లున్నారు. సర్వరక్షక భటాధికారియు నగరమునందలి సైనికనివేశనాధికారులు నలువురు. వీరందఱినిఁ

బోయి పిలిచికొని రావలయును. వారందఱు వచ్చినతరువాతఁ గాని వ్యవహారము పరిష్కారము కాదు. నీవు పోయి వారి నందఱిని బిలిచికొనిరమ్ము. ఇప్పుడప్పుడే ప్రొద్దు గ్రుంకినది, నేఁడు పూర్ణిమారాత్రి. చంద్రజ్యోత్స్న నగరమునందంతట దీపములు వెలిఁగించినట్లుండును. ఎంత వెన్నెలవైనను రాత్రి పూట యగుటచేత నపాయకరమైనది. అందుకనియే మహా నగరమునం దంతటను జనులెవ్వరు బైటికి రాఁగూడదని చాటింపఁ బడినది' యని పంపింపఁగా మూఁడు గడియల కాల ములో భటులు పోయి యా యా సర్వజనులనుఁ దీసికొని వచ్చిరి. పానగోష్ఠిక యంతయు మణిదీపికలచేతఁ దైల దీపికల చేత ధగధగ లాడుచున్నది. చాలక పది దివ్విటీలు వెలిఁగింపఁ బడి సూది క్రిందఁ బడినచోఁ గనిపించుచున్నట్లున్నది. అంద ఱును వచ్చిరి. శతానీకుని శవమును రాజు శవమునుఁ జూచిరి. కుముద్వతిని జరిగిన సంగతినిఁ జెప్పు మనిరి. అప్పటి కామె కొంత దుఃఖమునుండి తేరికొన్నది. ఆమె నీచకుల సంభూత యగుటచేత నామెయందు మహారాణి లక్షణములు లేవు. ఆమె రాజును గుండెతోఁ బ్రేమించుటచేత నామె యొద్ద దాపరికములేదు. ఆమె తన యన్నగారు చేసెడు పనులకు సర్వథా వ్యతిరిక్తురా లగుటచేత నామెయందు వ్యవ హార గోపనము చేయవలసిన యవసరములేదు. తా నిప్పుడు నిస్సహాయురా లగుటచేత నామెకు యాథార్థ్యము చెప్ప వలసిన యవసర మున్నది. ఆమె వయసు కొద్దిదగుటచేత నామెకు లోకము తెలియదు. కత్తులు చేఁబూని యధి కారులు వృద్ధులు నుండుటచేత నామె భయపడెను. పుష్య

మిత్రుఁడు 'భయములేదమ్మా తల్లీ! చెప్పు' మనెను. పుష్య మిత్రుఁ డామెయందుఁ జూపించిన యాదరముచేత నచట సమావిష్టులైన యధికారులందఱికిఁ గుముద్వతిపైనున్న దురభి ప్రాయము కొంత తగ్గెను. ఆమె నీచకులప్రసూత. వృద్ధుఁడైన రాజునుఁ దన వలలో వేసికొన్నది. పాంసుల. కులట. ఆమెవలన రాజ్యమునకు విపత్తి కలిగినది, మొదలయిన యూహాలు సర్వజనులయందు నుండెను. పుష్యమిత్రుఁ డామెను గౌరవించి మాటాడుటచేత నందఱ కామెయందున్న దురభిప్రాయము కొంత యొత్తిగిలెను. పుష్యమిత్రుఁడు మఱల నిట్లనెను. "అమ్మా! చిన్నరాణీ నీయం దేమియు దోషము లేదు. సర్వసాధారణమయిన వాంఛయే నీయం దున్నది. నీయందుఁ గృత్రిమత్వము లేదు. నీవు రాజును యథార్థముగాఁ బ్రేమించితివి. నీవు పసిపిల్లవు. రాజు వృద్ధుఁడు. ఐనను రాజును నీవలెఁ బ్రేమించుట సామాన్య ప్రవృత్తులకు సామాన్యమైనది కాదు. నీవు · దేవతామూర్తివికనుకఁ దక్కిన స్త్రీలవలెఁగాక వయోభేదమునుఁ బరిగణించక రాజు నందు భోగమును వాంఛింపక రాజును సర్వదా రక్షించ వలయునని ప్రయత్నించుచు నిన్నాళ్లుంటివి. రాజువలెనే నీవు కూడ నీ వ్యూహములోఁ దగుల్కొంటివి. వీరు వంశ వృద్ధులు. ఈయన దుర్గాధిపతి. వీరంఱు పౌర జ్యేష్ఠులు, వీరు రక్షకభటాధికారులు. వీరు సైనిక నివేశనాధిపతులు, జరిగిన సంగతి సర్వజనులకునుఁ జెప్పుము. ఈయన యుపవష్టుఁడు. నేఁటినుండి యాయన మగధరాజ్య సర్వసేనాధిపతి" పుష్య మిత్రుఁ డిట్లనఁగా నందఱొకరి మొగము నొకరు చూచికొనిరి.

పుష్యమిత్రుఁ డేమగును? సన్న్యసించిపోవునా?" అంతఁ గుముద్వతి యిట్లనెను. "మహారాజా!"—అని సంబోధించుటతోడనే యందఱును నివ్వెఱపోయిరి. ఆమె మఱల నిట్లనెను. "నన్ను గంధగజుఁడు రాజునకు భార్యగాఁ జేసెను. మహారాజెక్కడ? నేనెక్కడ? యని నేను దొలుత నంగీకరించలేదు. నేను నీచ కులజను. కాని బ్రాహ్మణునకు జన్మించితిని. ఆ గర్వ మొకటి నా మనస్సులో నుండెడిది. నా తల్లియుఁ దండ్రియు నన్ను ఊఁబిలోనికి దింపినారు. నన్ను రాజునకు భార్యగాఁ జేసినచో గంధగజునికి వంద గ్రామము లిప్పింతుమని వారు వారు మాటాడుకొనిరి. ఇప్పింతుమన్నది వారు ఇప్పించవలసిన బాధ్యత నాది. మహారాజా! నేను రాజునకు భార్యనయిన తరువాత తల్లిదండ్రులవలన, నాయీ యన్నగారివలన, నేను పడిన యిబ్బంది భగవంతునకుఁ దెలియవలయును. నేను రాజుయొక్క యారోగ్యమే చూడవలయునో? రాజుచేత వారు చేయించలేమన్న పనులు చేయించవలయునో? నాకుఁ దెలియలేదు. నన్ను వారిట్టి యిక్కట్టులోఁ బెట్టిరి. రాజు తొలిసారి నన్నుఁ జూచెను. నన్ను వివాహమాడుదువా యని యడిగెను. నే నేమనవలయును? రాజు మహావృద్ధుఁడు. ఆయన మహారాజగుటవలనఁ గోరవలసినదే. స్త్రీవాంఛానుగుణముగ నెవరుకోరుదురు? కాని స్త్రీవాంఛ యేమాత్రపుది? లోకమునం దనంతజీవులు స్త్రీలుగా జన్మించుచున్నారు. అందఱికినిఁ గామవాంఛ కలదు. ఒక్క యువతియొక్క కామవాంఛ తీఱకపోయినందువలన సృష్టికి నష్టమేమి? కాని యొక మహారాజు తానొక బాలికను వాంఛించినచో

నా బాలిక తన యౌవనమును బలిదానముగా సమర్పించి నందువలన నామె యాత్మలోక యౌన్నత్యము కలుగదా ? శరీరములు క్షణభంగురములు నే నిట్లూహించుచుండఁగ రాజు మఱల ననెను. ఓసీ! నాకు సంతానములేదు. నా తరువాత నా రాజ్యమేమగునో నాకుఁ దెలియదు. నీయందు నాకొక మగసిసువు కలిగినచో నీ రాజ్యము నీవలన రక్షితమగును. అనఁగా నేను రాజుయొక్క దైన్యము నవలోకించి భగవంతుఁడు నాయందట్లనుగ్రహించునేమో యని యంగీకరించితిని. ఇచటికి వచ్చినప్పటినుండి కోట కోట యంతయు నన్ను ద్వేషించుచున్నదని నాకుఁ దెలియును. గిరివ్రజపురమంతయు నన్ను రాణిగా భావించుటలేదు. కులటగా భావించుచున్నదని నాకుఁ దెలియును. ఐనను రాజు వృద్ధుఁడు. ఆయన నా తల్లిదండ్రులయొక్కయు నా యన్నగారియొక్కయు, నన్ను రాజునకు సంధాన పఱచిన యా దుష్టుఁడైన మంత్రియొక్కయుఁ, దాదృశులయిన మఱికొందఱు దుర్మార్గుల యొక్కయుఁ, బన్నిన వలలోఁ జిక్కికొన్నాఁడు. ఈ కల్లును వండుట, పాకములుచేయుట, భిన్న భిన్నములయిన మద్యములు కలుపుట, వానిని రుచ్యాతిరుచ్యములుగ నిర్మించుట, నా తల్లి కులవృత్తికి సంబంధించినది. నా తండ్రి బ్రాహ్మణుఁడఁగనను నా తల్లితో సంబంధము పెట్టికొన్న తరువాత నాయన యీ విద్యలోని లోతుపాతులన్నియు నేర్చికొనెను. ఈ సురాపానముఁగూర్చి యనేకములయిన గ్రంథములను సంపాదించెను. వాని నన్నింటి నిచటికిఁ దెచ్చిరి. వారు వచ్చినప్పటినుండిఁ యీ రాజ్యము రాజ్యముకాక పానగోష్ఠికి యయ్యెను. రాజ్య

ము కాకపోయినను దుర్గమంతయుఁ బానశాలలయై పోయెను. దీని కొఱకెంత ధనము వ్యయించఁ బడినదో నాకుఁ దెలియును. ఇది యిట్లు సాగుటకు మహామంత్రి కారణము. మఱల నాయన బౌద్ధుఁడట. మఱియుఁ గోశాధికారి కారణము. అతఁడును బౌద్ధుఁడే. అయ్యో! పుష్యమిత్ర మహారాజా! సర్వమతములు వానియంతవెంత స్వచ్ఛత యున్నను, వదనుయాయుల దుర్వాంఛలచేత దుష్టమతములుగా భాసించును. బౌద్ధమతమున కాస్థితిపట్టినది. నేనేమి చేయఁగల్గుదును? రాజుచేత దివారాత్రములు త్రావించుచుండిరి. నన్నాయనతో నేకాంతముగా నిముసమైన నుండనీయరు. రాజు సురాపాన వివశుఁడై రాత్రిపూట రెండుజాముల వేళ నొడలు తెలియక పడిపోవును. అప్పుడు మాత్రము నన్నొంటరిగా నాయన నద్ద నుండనిచ్చెడివారు. ఎన్నివందలసార్లు నేనాయన చేతిలోని దుష్ట సురాపాత్రములను బలవంతముగా లాగికొని పాఱఁబోసితిని. అట్లు చేసినప్పుడెల్ల నానాఁటిరాత్రియో మఱునాఁటి ప్రొద్దుననో నన్ను నా తండ్రియుఁ దల్లియుఁ గొరడాలు పెట్టి కొట్టెడివారు. నాయన్న నన్నెప్పుడు కొట్టలేదు. అతఁడు నామీఁదఁ జాడీలు చెప్పుటయే పనిగా బ్రదికెను. నేనిప్పుడు రాణిని గాను గదా. నాకు రాచఠీవి లేదుగదా. నే నిపుడు భిక్షుకురాలను గాదా. బ్రాహ్మణుఁడ వయిన నీవు మహారాజువు కాఁగా నావంటిదానికి నంతఃపురమున నిలువ యోగ్యతలేదు గదా. నేను దాసిగా నుండుట కంగీకరించనుగాదా. నాకు లజ్జయెందుకు? మీరందఱునుఁజూడుఁడు' అని కుముద్వతి తనచీర తొడలవఱకుఁదీసి యొరిగి తన పిఱుదల

మీఁది, యూపస్తంభముల మీఁద, గమిలి కండెలుగట్టిన కశాఘాతము లనుఁ జూపించెను. రైక యూడఁదీసి వీపంతయుఁ జూపించెను. ఆమె వీపంతయుఁ జిన్నిచిన్ని గాయములతో నిండి యుండెను. ఆమె యేడ్వ నారంభించెను. చూచుచున్న వారందఱు నీఱుగాఁ బోయిరి. ఆమె పాంసులయని కులటయని దుర్జాతియని రాజ్య మన్యాయ క్తము చేయుటకుఁ బ్రయత్నించుచున్నదని మగధరాజ్యమునకు ధూమకేతువని యని కొన్ని భావము లన్నియుఁ దీవ్రఘణాఘాతములు తగిలిన సర్పముల వలెఁ దలలు వాంచెను. అందఱి కన్నులయందు బాష్ప ముద్ధయించెను. ఆమె మఱల నిట్లనెను. 'నాయందు మీరెవ్వరికిని జాలి వలదు. మీరు నాయందు దయపూనవలదు. నేను నిర్దోషురాలివలెఁ గనిపించినను, నాయందొక మహాదోష మున్నది. దానిని మీరు మఱచిపోరాదు. ఈ రహస్యము పూర్వ మెకప్పుడైన నేనీ పుష్యమిత్రులకుఁ జెప్పితినా? ఈరాజ్యము మొత్తముమీఁద దీనికిఁ బ్రతిక్రియ చేయఁగలవాఁ రాయన యొక్కఁడే. అది నాకుఁ దెలియును. నే నాయనతోఁ జెప్పలేదు. మంత్రులందఱు సేవ్యూహములో సంతయో యింతయో యిమిడియున్నవారే. మహారాజునకు నీ పుష్యమిత్రునియొక్కని యందే విశ్వాసము. ఈయన నొక్కనినే నమ్ముచుండును. తక్కిన యెవ్వరిని మహారాజు నమ్మలేదు. అవునా? కాదా? మీరే చెప్పుఁడు. పుష్యమిత్రా! మిమ్ము డుగుచున్నాను? మీరు నాల్గుదినముల క్రింద రాజదర్శనమునకు వచ్చితిరి. అప్పుడు రాజుమీతో నేమనెను? నాయన్నను మీ యెదుటనే నిందించెను. నా తండ్రిని మీయెదుటనే

నించించెను. నా నొకవేళ నిల్చినచో రాజ్యమును నిన్ను స్వీకరింపు మనెను. పూర్వ మెప్పుడో మహాసద్వ్నందుండు సర్వక్షత్రియవంశ నిర్మూలనముచేసి ఈదేశమంతయు శూద్ర రాజులను నియమించెను. ఇప్పుడు క్షత్రియులులేరు. పుష్య మిత్రా! నీవు బ్రాహ్మణుఁడవు. రాజ్యమును నీవు స్వీకరింపుము. బ్రాహ్మణరాజ్యమును స్థాపింపుము. వైదికమతమును రక్షింపుము. అని రాజు మీతోనే చెప్పెనుగదా నిజమా? అబద్ధమా?' – పుష్యమిత్రుఁ డేమిచేయును? అవునని తల యూపెను. మఱలఁ గుముద్వతి యిట్లనెను. 'నేను రాజునకు భార్యను గాకపూర్వము మీ యూరిలో నొక ధనవంతుఁ డుండెడివాఁడు. అతఁడును నా తండ్రివలె జన్మచేత బ్రాహ్మణుఁడు. అతఁడు నా తల్లిదండ్రులకు ధనాశఁగొలిపి నన్నుఁ దన కిమ్మని యడుగుచుండెడివాఁడు. అతనికిఁ బూర్వమే వివాహమయినది. అతని కోరికను నే నంగీకరించినచో నే నుంపుడుకత్తె నగుదును. భార్యనుగూడఁ గాను. వానికంటె నా తండ్రి నయము. బ్రాహ్మణ్యము వదలిపెట్టి నా తల్లినిఁ బెండ్లియాడెను. వాఁడు తన బ్రాహ్మణ్యము తన కుండవల యును. నన్నుఁ బెండ్లియాడఁడు. నేను సామాన్యమయిన సర్వస్త్రీ యోగ్యమయిన భార్యాత్వమను యోగమునకుఁ గూడఁ బనికిరాను. నేను వాని నంగీకరించలేదు. నా తల్లి తండ్రులును నా యన్నగారు నన్ను బలవంతముగా నాకతని తో నేకాంత ముండునట్లు చేసిరి. నేను వానినిఁ బరాభవించితిని. వాఁడు నన్నుఁ జంపెడివాఁడే. ఇంతలో మహా రాజు నా ప్రాణముల కడ్డు తగిలెను. ఈ వ్యవహారము నా

యన్నకు నామీఁద నధికారమును సంపాదించిపెట్టినది. ఆ దుష్టుఁడయిన బ్రాహ్మణుని నేను సులభముగా రాజుతోఁ జెప్పి సంహరింపఁ జేయఁ గల్గియుంటిని. ప్రాణివధ పాపము నా కేందులకు? నేనుఁ జేయలేదు. నేను వానినిఁ గామించితినని, వానియందు నా కిప్పటికినిఁ బ్రేమ కలదని మహారాజుతోఁ జెప్పి నిన్ను నాశనము చేసెదనని నన్ను బెదరించెడివాఁడు. ప్రాణము పోవుట యంత సులభమని నా కప్పటికిఁ దెలియదు. మా యన్నయు మహారాజును సులభముగాఁ జనిపోవుటచూచి యింత సులభమైన మృత్యువునకు నే నెందుకు భయపడితినా యనుకొంటిని. అదియట్లుంచి నాల్గు దినములనుండి యీ మేడలలో జరుగుచున్న కృత్రిమవ్యూహములఁ జెప్పెదను. మహారాజుయొక్క సర్వజ్ఞత్వము మీయందఱకునుఁ దెలియును. ఎవఁడెట్టివాఁడో యాయన సులభముగా గ్రహించెడివాఁడు. వారి వారి దోషములు వారి వారి మొగముల మీఁదనే చెప్పెడివాఁడు. ఆయన వాక్కునందుఁ జమత్కారము కలదు. నా తల్లియొక్క దుర్నీతిని నాయెదుటనే యనెడివాఁడు. మొన్న పుష్యమిత్రి మహారాజు వచ్చినపుడు పూర్ణిమనాఁడు నేను నీకు సురాభేదములను పానగోష్ఠికా రహస్యములనుఁ జూపింతును. రమ్మని పిలిచెను. అప్పటికి రాజు తన యొడలు తనకుఁ దెలిసెడిస్థితిలో లేదు. ఎప్పు డున్నాఁడని యిప్పుడు లేఁడని చెప్పుదును. రాజును వారెప్పుడును సంహరించుటకే ప్రయత్నించిరి. వారు నన్నుఁ గొరడాలతోఁ గొట్టినను సరే. నేలమీఁద బడవేసి తన్నినను సరే. వారు రాజున కిచ్చెడి మద్యము తొలుత నేను రుచిచూడ

కుండ నెప్పుడు నీయలేదు. అందుచేత వారు వానిలో విసముఁ గలుపలేదు. విసము కలిపినచో ముందు నేనే చత్తునుగదా. నన్నుఁ జూపెట్టుకొనిగదా వారాట యాడవలయును. పూర్ణిమ నాఁడు పుష్యమిత్రునిఁ బానశాలా దర్శనమునకుఁ బిలువ వలసినదని మాయన్న రాజునకు బోధించెను. బోధించినప్పుడు రాజిట్లనెను. 'ఓరీ పుష్యమిత్రుని వధించ వలయుననియా' యని. తరువాత రాజామాట మఱచి పోయెను. ఆ వివశతాస్థితిలో మహారాజు పుష్యమిత్రునిఁ బూర్ణిమనాఁడు రమ్మని చెప్పినంతనే నాకుఁదెలియును. దీని వెనుక నేదో కుత్సితప్రయత్నమున్నదని నాకీ నాల్గుదినములు నిద్రాహారములు లేవు. వారి పన్నాగమంతయుఁ దెలిసికొంటిని. ఆగదిపేరు నగ్నహువు. నగ్నహు వన్నది యొక మద్యముపేరు. ఆ మద్యపాయులు దిస మొలలతో నుందురు. ఒకరి నొకరు తిట్టికొనుచుందురు. అదియొక జుగుప్సాకరమయిన దృశ్యము. ఈనాఁ డందులో నున్నవారెవ్వరు దిన వినము కల్లుత్రాగి యొడలు తెలియని వారు కారు. వారందఱు కత్తి నుపయోగింప నేర్చినవారు. వారు కత్తులు పుచ్చుకొని యాగదిలోఁబడి రాచుచుండిరి. వారిపేర్లుకూడ నాకుఁ దెలియవు. నే నెఱిఁగియున్నది యొక్క గంధగజుఁడన్న మంత్రినే. అతఁడుకూడ నా గదలోనుండెను. ఇది పుష్యమిత్రునిఁ జంపుటకుఁ జేసిరో మహారాజును జంపుటకుఁగూడఁ జేసిరో నాకుఁ దెలియలేదు. ఈ మహాపురుషుఁడు వచ్చెను. మహారాజు పుష్యమిత్రులకు నిందలి విశేషములన్నియుఁ జూపించెను. శతానీకుఁడు నన్నుఁ దోడు రానీయలేదు. ఆఁవద్దన్నను నాయందుఁ గ్రోధదృష్టులు ప్రసరించు

చుండెను. నేను లెక్కచేయలేదు. మహారాజుండఁగా వారు నన్నేమియుఁ జేయలేరు. నాకుఁ దెలియును. మహారాజు నన్నిట్లు ప్రేమించుచుండెను. ఇంతయని చెప్పుటకు సాధ్యము కాదన్న తెలివితక్కువ గలవారిలోనున్న తెలివి యీయొక్కటియే. వారు నన్ను బాధపెట్టుచున్నారని రాజునకుఁ దెలిసినచో రాజు వారిని బ్రదుకనిచ్చెడివాఁడు కాదు. ఆ రాజు నన్నంత ప్రేమించెడివాఁడు. ఆయనకు నేను భార్యనో కూతురునో తెలియదు. ఆయనకు సంతానములేదు. నన్నొక బిడ్డవలెఁ జూచెడివాఁడు. ఇదియొక విచిత్రమయిన స్థితి. ఎప్పుడో నన్ను భార్యవలెఁ జూచెడివాఁడు. తక్కినప్పుడు నేనుభార్యను కాను. ఆయనకు బిడ్డను. నామీఁద నీఁగ వాలనీయలేదు. నేను మగవాఁడ నయినచో నీ రాజ్యము నాకిచ్చెడివాఁడు. తన తరువాత నన్ను రాజ్యమున కధికారిణిని చేయవలయునన్న యూహకూడ నాయనకుఁ గలదు. కాని నా ప్రకృతి యాయనకుఁ దెలియును. నాకు నిర్వ్యాజముగా నొకరినిఁ బ్రేమించఁగల శక్తియున్నది. వైరాగ్యమున్నది. బాధను సహించెడు లక్షణ మున్నది. రాజ్యము చేసెడి శక్తిలేదు. దానికిఁ దగినగుణములులేవు. అందుచేత రాజు తనమనస్సును మళ్ళించికొనెను. నేను నాల్గేండ్లనుండి యెఱుఁగుదును. తన తరువాతఁ బుష్యమిత్రుఁడే రాజుకావలయునని యాయన చెప్పుచుండెను. ఆ మాటలు మాయన్న మొదలయినవారు రెండుమూఁడుసార్లు వినిరి. అందుచేతనే పుష్యమిత్రుని సంహరించుటకు వారు ప్రయత్నము చేసిరి. ఇంతకును నేటిసాయంకాలమున నీ గదిదగ్గఱకు వచ్చునప్పటికి మహారాజు గది

యొక్క వృత్తాంతము చెప్పెను. మాయన్న దానితాళమును దీయబోవుచుండెను. మహారాజు ముందు వెళ్ళుచుండెను. నే నడ్డము వెళ్ళితిని. లోనికి వెళ్ళుటయు వీరిద్దఱు సంహరింపఁబడుటయేగదా. ఆ మహారాజునకు నే నెందుకడ్డము వచ్చితినో తెలియలేదు. నన్నుఁ జేతితోఁ ద్రోసివేసెను. నా యన్న వెనుదిరిగి చూచెను. నామీఁద నతనికిఁ గోపము వచ్చెను. అతఁడు నన్నుఁ గోపముగాఁ జూచిన కొలఁది నాకు నొడలు మండిపోయెను. నేనుపోయి తాళమువేసి తాళపుఁజెవి తీసికొంటిని. లోనివారు లోననే యుందురు. రహస్యము బయటఁ బడదు. తాత్కాలికముగ నేను రాజుయొక్క ప్రాణరక్షణము చేసినట్లగును. మూర్ఖుఁడైన నా యన్నకిది తెలియలేదు. త్రావలేని పిల్లి బోర్లఁబోసికొన్న దని వాఁడు నానోరు నొక్కి నా చేతిలోని తాళముచెవి లాగికొనుటకుఁ బ్రయత్నించెను. అతఁడు నా నోటినిఁ జేతితో నొక్కుచుండఁగనే నేను రహస్యము నంతయుఁ జెప్పివేసితిని. నా మాటలన్నియు వినఁబడలేదుగాని పుష్యమిత్ర మహారాజునకు సంగతి సంపూర్ణముగాఁ దెలిసెను. ఆయన కత్తిని లాగఁబోయెను. దుష్టుఁడయిన మాయన్న నా పూర్వవృత్తాంతమును రాజుతోఁ జెప్పివేసెను. ఆయనకు నా మీఁదఁ గోపము వచ్చెను. ఎంత కోపము వచ్చెనో నాకుఁ దెలియును. అంత కోపమును వచ్చెను. రాజునకంత కోపము వచ్చెనని నాకుఁ దెలియును. కనుకనే యిన్నాళ్ళు నాయన్న యాటలు సాగినవి. స్త్రీ పురుషుల మధ్యనున్న ప్రేమకథలో నే యే సూక్ష్మ విషయములు భర్తకుఁ బట్టరానంత కోపమును దెప్పించునో

పరమ వివేకహీనురాలయిన స్త్రీకయ్యును స్త్రీజన్మలోని యొక పరమార్థభావములో నిమిడియున్న సహజవివేకము చేతఁ దెలియును. రాజునకుఁ గోపము వచ్చెను. నన్నుఁ జంప నెంచెను. మాయన్న తాను గత్తి దూసి నన్ను సంహరింప వచ్చెను. పుష్యమిత్రి మహారాజు మాయన్న తల తఱిగెను. మహారాజు నన్నుఁ జంపవచ్చెను. తన బొడ్డులోని కత్తిలాగి నన్నుఁ బొడువ వచ్చెను. అదిగో ఆయన చేతిలోని చురకత్తి. పుష్యమిత్రుఁడు నన్ను రక్షింపవచ్చెను. నేను జూచుచునే యున్నాను. పుష్యమిత్రులకుఁ దెలిసినదో తెలియదో మహారాజు తన బాకుతో ముందు పుష్యమిత్రునిఁ బొడిచి తరువాత నన్నుఁ బొడువవలయు ననుకొనెను. పుష్యమిత్రుఁడు తన ఖడ్గముతో రాజు చేతిలోని పిడిబాకును నేలకు వంచవలయునని యెంచుచుండఁగా లిప్తకాలములోఁ బుష్యమిత్రుని ఖడ్గము రాజు చేతిలోని పిడిబాకువైపున నుండుటయు రాజు పుష్యమిత్రునిఁ బొడుచుటకుఁ బోవుటయు నీ విచిత్రమైన సమయమున రాజు చేతిలోని పిడిబాకును తొలఁగింపవలయు నన్న యూపుగల ఖడ్గము రాజు హృదయములోఁ బ్రవేశించెను. నిరంతర సురాపానముచేత రాజు మేనిలోని రక్తము మాంసము శక్తియు నన్నియు నుడిగిపోయినవి. రాజింతలోఁ జనిపోయెను. ఇది జరిగిన కథ. తరువాత మీ యిష్టము. పుష్యమిత్రుఁడు మహారాజగుట మహారాజుయొక్క వాంఛ. మీరట్లు చేసినచో నా కభ్యంతరములేదు. మీ రింకొక్క రీతి భావించినచో నేను మహారాణిని. రాజ్యము మీఁద నా కధికారము కలదు. పుష్యమిత్రుఁడు నా మహాసేనాధిపతి.

దేశమున నంతర్యుద్ధమువచ్చును. ఈ పుష్యమిత్రుఁడు వైరాగ్యవంతుఁడు. ఆసంగతియు నాకుఁ దెలియును. ఆ యుపవస్తుఁడున్నాఁడు. ఈయఁనకాదన్నచో నా యుపవస్తుని నేను సేనాధిపతిగా నెన్నుకొందును. నాకు రాజు వ్రాసియిచ్చిన వేయి గ్రామములు కలవు. నా కిచ్చిన యనంతములయిన భూషణములు కలవు. ఆధనముతోఁ బుష్యమిత్రుఁడు మహాసేనాధిపతిగా నే నీ రాజ్యమున నశాంతి నెలకొననీయను. పుష్యమిత్రుని మహారాజును చేయుడు. నా కీ వేయిగ్రామము లక్కఱలేదు. ఈ సర్వభూషణము లక్కఱలేదు. రాజుయొక్క జవాహిరీ యంతయు నిచ్చివేసెదను. నేనుపోయి యేబౌద్ధవిహారమునందో భిక్షుకురాలనై జీవింతును. నాకిప్పు డిరువది రెండవ యేఁడు. భగవంతుని యనుగ్రహము లేనిచో నేనింక నెనుఁబదియేండ్లు బ్రదుకుదు నేమో ? బ్రదుకుదు నయ్యా బ్రతుకుదును. భగవంతుఁడు నావంటివారినిఁగూడ సృష్టించును. నావంటివారు కూడ సృష్టిలో నుండవలయును. లేనిచో మీవంటివారికిఁ గష్టము. లోకమునం దంతటనుఁ గలిపి సుఖ మొక ప్రమాణములో నుండును. దుఃఖ మొక ప్రమాణములో నుండును. ఈ సుఖము వంద బారువు లనుకొందు. ఆ దుఃఖ మొక వంద బారువులు. ఈ వంద బారువుల దుఃఖము జీవులందఱకు సమానముగాఁ బంచినచో నందఱు పెద్దదుఃఖ మనుభవించవలయును. వంద బారువుల దుఃఖములోఁ బది బారువుల దుఃఖ మొక్క వ్యక్తి పాలఁబడినచోఁ దక్కినవారందఱు పంచుకొనవలసిన దుఃఖము తొంబది బారువులే. అందుచేత భగవంతుఁడు నా

వంటి వారిని సృష్టించి లోకమునం దితరుల దుఃఖమునుఁ దగ్గించిపెట్టును.'

అంతట నచట సమావిష్టులయిన సర్వాధికారులను బుష్యమిత్రుని పాదాంభోజములయందు శిరస్సులు వాల్చి, చేతిలోని కత్తులు నేలమీఁదఁ బెట్టి చేతులు కట్టికొని నిలఁబడిరి. పుష్యమిత్రుఁడు దిగ్భ్రాంతి పొందెను. అందఱు తలలు వంచుకొని నిలుచుండిరి. ఉపవర్షుఁడు మాత్రము పుష్యమిత్రుని వంకఁ జూచుచుండెను. పుష్యమిత్రుని మొగము చివరి యందు నొక మందహాసాంకూరము కనిపించెను. ఉపవర్షుఁడునుఁ దిరిగి తన మొగమునందు లేఁత నవ్వు భాసింపఁ జేయుటకుఁ బ్రయత్నించెను. దాని తాత్పర్యమేమనఁగా మనమెంతయో కష్టపడి సాధించవలసినదాని నీ మహాదేవతామూర్తి పరమ సులభముగాఁ జేసివేసిన దని. పుష్యమిత్ర మహారాజు వారి నందఱను వారి వారి ఖడ్గములు తీసికొని నిలుచుండు డనెను. వారు తమ ఖడ్గములు తీసికొని వినయావనతాంస భాగులయి చూపులు మహారాజునందుఁ బెట్టి నిలుచుండిరి. పుష్యమిత్రుఁ డిట్లనెను. మేము మహారాజశివ సమక్షమున దేవతామూర్తియైన యీ చిన్నరాణి యనుమతితో నుపవర్షుని మహాసేనాధిపతినిగా నియమించుచున్నాను. పూర్వమంత్రులందఱు నిదివఱకే నిర్బంధింపఁబడిరి. గిరివ్రజపురమంతయు నిదివఱకే భద్రము చేయఁబడినది. వయసు ముఖ్యమా? గుణము ముఖ్యము. ఈమెకంటె నేను ముప్పదియేండ్లు పెద్దవాఁడను. ఈమె నీకుఁ దల్లివంటిది. నా రాజుభార్య కనుక నా తల్లి. ఆమె యనుజ్ఞతో నేను రాజనగుచున్నాను. వీరు

కత్తులు నేలఁబెట్టి నన్ను రాజునుఁ జేసినారు. నాకిపుడు మహా మంత్రి యొకఁడు కావలయును. ఆయనను మీ రెవ్వరు నెఱుఁగరు. ఆయన చాణక్యుని వంటివాఁడు. ఆయన పేరు నారాయణభట్టు ఆయన నేఁటినుండి నాకు మహామంత్రి ముందు మహారాజున కపరకర్మలు చేయించవలయును. అవి యైన తరువాత మీకుఁ బట్టాభిషేకము, మాయగ్నిమిత్రునకు యువరాజ పట్టాభిషేకము చేయుదము. ఆనాఁడే నారాయణ భట్టునకు మహామంత్రిత్వముఁ గావింతుము. ఉపవర్షునకు మహా సేనాధిపత్యము సభాముఖమున సమర్పింతుము. వారందఱును విన్నారు. నేను రాజును వధించలేదు. ఆ రాజునంగు నాకుఁ గల ప్రేమ యెట్టిదో మీలోనఁ గొందఱికిఁ దెలియవచ్చును. నేను నా రాజును వధించను. నాల్గుదినములక్రింద నేను రాజ దర్శనము చేసితిని. ఆయన నాతోఁ నోయి పుష్యమిత్రా ! నా తరువాత రాజ్యమున కుత్తరాధికారి వీఁడని యెవనిపేరో చెప్పి నన్ను వానిచేత రాజ్యమునుఁ బాలింపచేయుమని యాజ్ఞా పించినచో నేనట్లు చేసెడివాఁడను. ఆయన యిట్లు వాంఛిం చెను. ఈ చిన్నరాణి మీ యందఱు వినుచుండఁగా నది యంతయుఁ జెప్పెను. అయినను నేను రాజును వధించక పోయినను నా కత్తి రాజు గుండెలోనికిఁ జొచ్చుకొనిపోయి యాయన మృతినొందెను. అంగులోని కొంత యఘము నాకుఁ దాఁకదనుటకు వీలుకాదు. ఈ యఘముయొక్క నివృత్తి యెట్లు ? నేను బౌద్ధుఁడనుగాను. బ్రాహ్మణుఁడను. బౌద్ధమతము పేర స్వార్థపరులు దుర్జనులు దేశమును సర్వ సమానభావమును నొక కృతక సిద్ధాంతమునుఁ బెట్టి విచారణ

చేసినచో నింతకంటె నర్థరహితమైన సిద్ధాంతముండఁ బోదన్న దానినిఁ బెట్టి లోకమునలఁ బ్రతారించుచున్నారు. అందుచేత మఱల వర్ణాశ్రమాచారమై వ్యవస్థ పాలింతును. ఆచరింపఁ జేయుదును. కొన్నాళ్ళు గృహధర్మము పాలించును. కొన్నాళ్ళు ధర్మము పాలించును. బౌద్ధమతము సన్యాసులకు మాత్రమే. దానియందు సంఘ వ్యవస్థా నిరూపణము లేదు. సంఘ వ్యవస్థా నిరూపణము వేదధర్మము నందుఁ దప్ప మఱియొక దానియం దుండదు. దుర్జనుల యాలోచనా రహితత్వము మీఁద స్వార్థపరుల స్వార్థము మీఁద నాధారపడి యాశ్వతక సిద్ధాంతమును వ్యాపింపఁ జేసిరి. నేను బౌద్ధమతమును నాశనము చేయుటకు సంకల్పించుట లేదు. కొందఱు తమయాత్మ పతిణతికది యొక స్థానముగఁ బరిగణించినచో నాకేమి నష్టము? బౌద్ధమతము సంఘ శ్రేయస్సునకుఁ గానిది. వారి మతములోని సంఘమన్నమాట కర్థము లేదు. నేను బౌద్ధమతము యొక్క విరోధినన్న భయమెవ్వరికి నక్కఱ లేదు. బౌద్ధములో దౌర్జన్యమున్నచోట నేను శిక్షించినచో దానిని బౌద్ధమతమునందలి నా ద్వేషముగఁ బరిగణించు వారిని నేనేమియుఁ జేయ లేను. కాని నా రాజవధ పాపమట్లే యున్నది. దానికి నిష్కృతి చేసికొనవలయును. నేనశ్వమేధయాగము చేసి బ్రాహ్మణమతము ప్రతిష్ఠాపించి యజ్ఞద్వేషము నిర్మూలించి - పుష్యమిత్రుఁడు తరువాత మాటాడ లేదు. నగ్నహూ మందిరము నుపవర్షునకుఁ జోడించి వెడలిపోయెను.

'తమగి పేరేమి?' – 'మేధావిభట్టు' – 'నే నశ్వమేధమును చేయ సంకల్పించితినని తమరి కెట్లు తెలియును?' – యవనరాజు నాతోఁ జెప్పి తమవద్దకుఁ బొమ్మనెను. యవనరాజునకు నశ్వమేధమునకు సంబంధమేమి? నాకుఁ దెలియదు. నే నాయన దర్శనమునకుఁ బోయితిని. ఆయన పెద్దపండితుఁడని చెప్పుకొందురు. నేను బహుకుటుంబకుఁడను. మాది కాశ్మీర దేశము. సహజముగ నే నెచ్చటికిఁ గదలను. పోనిమ్ము. పరమేశ్వరుని యనుగ్రహ మెంతవఱకున్నదో, అంతవఱకే సహకరించునని యూరకుండఁగా యవనదేశపురాజు క్రొత్తగా నొకఁడు వచ్చెననియు నతఁడు పండితులకు ధన మిచ్చుచుండెననియు నాభార్య నన్నుఁ దఱిమెను. మహారాజా! ఆశ యెంత చెడ్డది? ఉత్తర జ్యోతిషమున నాయన యుండును. దగ్గఱయే గదా యని బయలుదేఱితిని. ఆయన యభిసార దేశము నందుఁగలఁడు. ఆ రెండు దేశముల కెంతదూర మున్నది? ఎబ్బది యెనుఁబది యోజనములకుఁ దక్కువ లేదు. దారియా? డొంకయా? ఱాళ్ళును, అప్పలును. పర్వతములు ఎక్కుటలు, దిగుటలు. ఆచారము లేదు. పాడు లేదు. అందఱును యవనులు. కొన్ని యోజనముల మేర సంధ్యావందనము చేసికొనవలయు నన్నచో, నొక నీటిబొట్టు లేదు. ఇదిగో నీటిపడియ యుండును. దానివద్దకుఁ బోవువేళకు దినసంధ్యగాదు ప్రాణసంధ్యయగును.

వెనుకకుఁ దిరిగి పోదమన్న చో నింతదూరమువచ్చి వెనుకకుఁ బోవుటకుఁ బ్రాణము లొప్పవు. ఆ యవనరాజున్న ప్రదేశ మిదిగో రెన్నాళ్ళ ప్రయాణ మందురు. వారే యశ్వములను సమకూర్తురు. వారు తోడునత్తురు. మహారాజా! యవను లలో నిట్టి సౌజన్యమేమి? యవనులలో నింత బ్రాహ్మణాభి మానమేమి? ఈ యవనరాజెవఁడు? పరమ కిరాతకులైన యీ యవనులమీఁద నీ క్రొత్తరాజున కింత యధికారమెట్లు గలిగినది? అతఁడెవఁడు? అతని పాండిత్య మెట్టిది? మొదలైన ప్రశ్నలతో నెంతశ్రమయైననుసరే పోయి యీ యవనరాజును చూడవలయునని నాకు గాటమైనకోర్కెగల్గినది. చివరకెట్లో పోయి యాతని దర్శనము చేసితిని – పుష్యమిత్రుఁడు – ఆ యవనరాజు నామధేయమేమి? మేధావి:- మిరఖ్యాఁఖోజ్. ఆయన తక్కిన పాండిత్యము నాకు తెలియదుగాని జ్యోతిష ములో నతని పాండిత్యము నా కాశ్చర్యము గలిగించెను. నా జాతకము నడిగెను. నేను నా గ్రహసంపుటి నాయనచేతికిచ్చి తిని. అతఁడు నాకు రాజయోగ మున్నదన్నాఁడు. నేను నవ్వి తిని. నేను వెక్కిరించితి ననుకొన్నాఁడు. ఆయనకు కోపము వచ్చెను. నీకొక సంవత్సరము రాజయోగ మున్నది. నీవు రాజ వగుదువు. రాజవు కానిచో రాజువలె నా పరిపాలుదువు. నీ కది తప్పదు. నీకే శాస్త్రమందు పాండిత్యము కలదు? అని యాయన యడుగఁగా నేను గొప్ప శ్రోత్రి నని చెప్పితిని. ఆయన నవ్వి, కుమ్మరావములో నెంటిముంతలను వెదకుటకు వచ్చి తివా? వా దర్శనము చేయుమని నీకెవ్వరు చెప్పిరయ్యా, మేము యవనులము, బ్రాహ్మణ కర్మలకును, మాకు నేమి

సంబంధము ? నేను చిన్నప్పుడు బ్రాహ్మణులయిండ్లలోఁ బెటి గిన వాడనుఁ గావున నీవు శ్రోత్రివని చెప్పగా నాకుఁ దెలిసి నది. మత్పూర్వులైన రాజులు నిన్నుఁగోత్రి యనుకొనెడివారు. శ్రోత్రివనఁగా నేమి ? ఆపౌండరీకము చేయించఁగవా ? యనఁగా నేను 'అశ్వమేధాంతము' చేయింతు నంటిని. నన్నాయన యశ్వమేధమునుఁగూర్చి యడిగెను. తెలిసికొనెను. ఎన్నియో ప్రశ్నలు వేసెను నన్నచట నాల్గుదినము లుంచెను. నాకుఁ గొంత ధనమిచ్చెను. కొండతేనె యిచ్చెను. దివ్యములైన ద్రాక్షపండ్లు, మా కాశ్మీరదేశములో ననేకవిధములైన ఫల ములు లభించును. వానికంటె రుచ్యములైన ఫలములు నా కొసఁగెను. బ్రాహ్మణుఁడా ! చూచితివా ? నీకొక యేడాది రాజయోగమున్న దనఁగా నవ్వితివి. నీవే చెప్పితివికదా. ఏ రా జశ్వమేధయాగము చేయునో, ఆరాజు సంవత్సరదీక్షలో నుండుననియు, నా సంవత్సరమంతయు నారాజుయొక్క రాజ్య మునకు నధ్వర్యుఁడే ప్రభువనియు నీవన్నమాటలే. అశ్వ మేధము చేయురాజు నిన్నధ్వర్యుఁడుగా నెన్నుకొనును. ఆ యేడాది యంతయు నీవే రాజవు. నీయోగ మెట్లు కాదందు వనెను. నే నిట్లంటిని. అయ్యా ! ఈ కాలమున నశ్వమేధ యాగముచేయు ప్రభువెవ్వరు ? అట్టి యోగ్యతఁగల ప్రభువే లేఁడే ! రాజులందఱు శూద్రులైపోయిరి. క్షత్రియుఁడెవ్వఁడు? అంత పరాక్రమశాలియైన రాజులేఁడు, యవనులు బలవంతు లుగానుండిరి. ఇది యెట్లు పొసఁగు ననఁగా నతఁడు మగధ రాజ్యమున గొప్ప విప్లవము జరిగినది. మౌర్యవంశ రాజు లలోఁ జివరివాఁడు బృహద్రథుఁడు. ఆయన నుఁ జంపి యాజ్ఞుని

సేనాపతియైన పుష్యమిత్రుఁడను బ్రాహ్మణుఁడు మహారాజై నాఁడు. ఆయన యశ్వమేధయాగమునుఁ జేయును. ఆయన జాతకము నావద్ద నున్నది. నాకాసంగతి తెలియును. మొన్న కార్తికిక పూర్ణిమనాఁడు పుష్యమిత్రుఁడు మగధరాజయ్యెను. ఇది మార్గశిరాంతము. నీవు చైత్ర శుద్ధ పూర్ణిమ నాఁడు తద్యాగారంభమును చేయవలయునని చెప్పితివి. ఇంక మూఁడు నెలలున్నది. నీకు నేను వేగముగల గుఱ్ఱముల నిప్పించెదను. నీవాయన వద్దకుఁ బొమ్ము. ఈ యాగమును గుఱించి చెప్పిన దంతయు నాయనతోఁ జెప్పుము. ఆయన నిన్ను తప్పకుండ సమాదరించును. నీ జాతకమునందు గురు శను లిద్దఱు సమాన బలవంతులై యొక్క యేడాది మంచి శుభస్థానమున నుందురు. శని నిన్ను రాజునుఁ జేయును. గురువు నీ బ్రాహ్మణకర్మనుఁ బాలించును. నీ శ్రౌతవిద్యతోపాటు నీకు రాజత్వ మిట్లుగల్గును. పొమ్మని నన్నుఁ బంపించెను. ఆయన యిచ్చిన గుఱ్ఱము మీఁద బయలుదేఱి కొంతదవ్వు వచ్చితిని. ఆ కాశ్మీరముల నుండి యీ మగధములదాఁక నడుమ నడుమ యవనుల చిన్ని చిన్ని రాజ్యములు గలవు. వారందఱు నన్ను గౌరవించి యిచ్చుటకిఁ జేర్చిరి. మహారాజా! నా సుకృత విశేషమున నీ దర్శనము చేసితిని. నేను గూటిపిచ్చుకనుఁ గనుక నీప్రతిష్ఠ నాకుఁ దెలియలేదుగాని దారినెంట నీయశోగీతికలఁ వినుచునే వచ్చితిని. దేశమందంతటను బ్రాహ్మణులు సంతోషమవడు చుండిరి. మఱలఁ గ్రొత్తయుగము వచ్చిన దనుకొనుచుండిరి. ఈ బౌద్ధులయొక్క యొత్తిడి యింక వెనుకఁబడు ననుకొను చుండిరి. జీవన్మృద్రాణిపశ్యతి యనుకొనుచుండిరి. రాజా!

నీ వశ్వమేధయాగమును చేయుము. నేను చేయించెదను. ఆ యాగమునకు నూఱునకు పైమంది ఋత్విక్కులు కావలయును. నేను వచ్చుచు దారివెంట నశ్వమేధమునం దార్త్విజ్యము చేయుటకు యోగ్యులైన బ్రాహ్మణులనుఁ జాలమందినిఁ జూచి వచ్చితిని. నేను వారితోఁ బుష్యమిత్ర మహారాజు హయమేధము చేయును. నేను ప్రధాన ఋత్విక్కును. మీ యందఱ నార్త్విజ్యమునకుఁ బిలుతును; మీరు సిద్ధముగా నుండుడని చెప్పి వచ్చితిని. 'ఆ సుబ్రహ్మణ్యా నపదాతీన్' అని యున్నది. అశ్వమేధ ఋత్విక్కులలో చివరివానికి సుబ్రహ్మణ్యుఁడని పేరు. అతఁడు హయమేధాంశమునఁ జదువఁదగిన గీతియున్నది. ఆ గీతిపేరు 'సుబ్రహ్మణ్యా.' అందుచేత వానికి సుబ్రహ్మణ్యుఁడని పేరు. ఋత్విక్కులను నపదాతులుగా తీసికొని రావలయును. హయగజాందోళికల నెక్కించి తీసికొని రావలయును. రాజా! వారందఱు నీకై యెదురు చూచుచుండిరి. యాగము ప్రసిద్ధవనమందో, పుణ్యక్షేత్రమందో చేయవలయును. ప్రయాగయందుఁగాని, కురుక్షేత్రమునందుఁగాని చేసిన యీ యజ్ఞ మధికఫలవంతమగును. నా దేశమందంతటను యజ్ఞ విరోధభావముఁ బ్రబలియున్నది. నీ వీ మహాయాగమునుఁ జేసినచో నా విరోధముపశమిల్లును. జనులకు యజ్ఞస్వరూపమే తెలియదు. నీవు మహాశ్వమేధము చేసినచో బౌద్ధులు యాగములనుఁ గుఱించి చేసిన ప్రచారములోని యయాథార్థ్యము సామాన్య ప్రజలకు తెలియును. సామాన్య ప్రజలకేమి తెలియును? యజ్ఞమనఁగా కసాయిదుకాణ మనుకొనుచున్నారు. సూనాపణ

మనుకొనుచున్నారు. పుష్యమిత్రుఁడు - యజ్ఞమునందు పశు విశసనము జరుగునుగదా? అశ్వమును వధింతురుగదా! కాదనుట యెట్లు? మేధావి:- మహారాజా! నీవు క్షమించి నచో నొక్కమాట చెప్పెదను. నీవు బృహద్రథుని వధించి తివి. హింసచేసితివి. నిన్ను రాజుగా నంగీకరించుచున్నారు. నిన్నుఁ బ్రశంసించుచున్నారు. పూర్వపు రాజు స్త్రీలోలుఁడై రాజ్యపాలనమే సరిగాఁ జూడలేదు. ఆయసనాఁడు సైన్యము నీ యధీనమై యుండుటచేత దేశము యవనుల దాడులవలన దుఃఖపడలేదని చెప్పుకొనుచున్నారు. ఈ సృష్టిలో హింసను పరిహరించుట యెట్లు? వైదికమతము పరిహరించరాని హింసను యజ్ఞముగా మార్చినది. మనము ప్రతిదినము నన్న మును తినుచున్నాము. శాకములను భుజించుచున్నాము. ఇదియంతయు ప్రాణిమయము. ప్రాణహింస చేయుచునే యున్నాము. దానియందు యజ్ఞభావన చేసినచో నాహింస హింసకాదు. వైదికులు పరిహరింపరాని ప్రాణిహింసయందు యజ్ఞభావనచేసి హింసాదూరులగుచుండఁగా యజ్ఞభావన లేని వైదికేతరులు హింసాకూర్తులగుచున్నారు. హింస చేసెడి వారు వారు. మనము చేసెడిది యజ్ఞము. మఱియును యజ్ఞదృష్టిచేత వీరహింస చేయుదుము. అది యుపాసన. అశ్వమును హింసించినచో హింసింపఁబడెడిది యశ్వముకాదు. అశ్వగతభావన విచారింపవలయును. మానవుఁ డొక కార్య మును చేయును. మానవుఁ డేబుద్ధితో దానిని చేసె నన్నది విచార్యముగదా. ఒకఁ డొకనిచేత వధింపఁబడెను. 'ఆ వధము వానిని వధించవలయునని చేసెనా? వాఁడింకేదియో

పని చేయఁబోవుచుండఁగా దానియంతట నది సంభవించెనా? అన్యమైన యధిక ప్రయోజనము కొఱకుఁ దద్వధమే పరిహారణీయ మయ్యెనా?' మొదలైనవి వేయి ప్రశ్న లున్నవి రాజా! నీవు బృహద్రథుని వధించి రాజవైతివి. లోకమునం దెవ్వఁడో యొకఁడు వేనినోఁ జంపి వాని యాస్తి నధీనము చేసికొనును. వానిని రాజు శిక్షించును. నిన్నెవఁడు శిక్షించును? నిన్ను శిక్షించుటకు వీలు లేదుఁ గనుక నీవు చేసిన పాపము పాపముకాదా యన్న ప్రశ్నము నట్లుంచుము. లోకమునం దెవ్వఁడో యెవనినో వధించునది సంపూర్ణముగా స్వార్థము కొఱకు. నీవు చేసినది ప్రజాహితముకొఱకు. లోకకల్యాణము కొఱకు. వ్యక్తిగతముగా నీది పాపము లేదని నే ననుట లేదు. ప్రాణివధపాపము నీకుండనే యున్నది. తత్పరిహారార్థము హయమేధమునుఁ జేయుము. హయమునందు హిరణ్యగర్భుని యావహింపఁ జేయవలయును. హిరణ్యగర్భుఁడనఁగా ప్రజాపతి. జగత్సర్వ జీవసమాహార భూతమైనవాఁడు. ఆయన హిరణ్యగర్భుఁడు. అతఁడు కాలభూతుఁడు. ఈ విషయము బృహదారణ్యకోపనిషత్తునందు ప్రథమతః చెప్పఁబడినది. బృహదారణ్యకము వాజసనేయ బ్రాహ్మణమునకు సంబంధించినది– ఎవఁడు సంసారమునందు విరాగి యగుచున్నాఁడో, ఎవఁ డజ్ఞానమును వాపికొని పరమాత్మ భావమును పొంద నెంచుచున్నాఁడో వాఁ డీ యజ్ఞమును చేయుచున్నాఁడు. "ఉషావా అశ్వస్య మేధ్యస్యశిరః" అని యుపనిషత్తు ప్రారంభించు చున్నది. మేధ్యమైన యశ్వముయొక్క శిరస్సు ఉషః కాలము. దాని కన్ను సూర్యుఁడు. దాని ప్రాణము వాయువు.

దాని తెఱచిన నోరు వైశ్వానరుఁడు. దాని శరీరము సంవత్సరము. దాని పృష్ఠ మాకాశము. దానిపొట్ట యంతరిక్షము. దాని కాలిగిట్టలు పృథివి. దాని ప్రక్కలు దిక్కులు. దాని ప్రక్కటెముకలు విదశలు. దాని భిన్నావయవములు ఋతువులు. సంధులు నెలలు, పక్షములు. దాని పాదములు దివారాత్రములు. దాని యస్థులు నక్షత్రములు. దాని మాంసము మేఘములు. దాని గర్భకోశమునందు సగము జీర్ణమైన యాహారము ఇసుక. ఈ యాహారమునకూ వధ్యమని పేరు. నదులు, పర్వతములు, ఓషధులు, వృక్షములు, ఉదయించుచున్న అస్తమించుచున్న సూర్యులు, ఉఱుములు మెఱుపులు, వర్షము మొదలైన సర్వదేశ లక్షణములు కాలలక్షణములు, పంచభూతములు నశ్వాంగములయం దారోపింపఁబడుచున్నవి. ఆ యశ్వ మనంతకాలమూర్తిగా దేశమూర్తిగా భావింపఁబడి యుపాసింపఁబడుచున్నవి. దానియందు సర్వదేవత లారోపింపఁ బడుచున్నారు. అది దేవతలను వహించుచున్నది గనుక హాయము. గంధర్వులను మోయుచున్నది గనుక వాజి అసురులను వహించుచున్నది గనుక అర్వము. మనుష్యులను వహించుచున్నది గనుక యశ్వము. అది హిరణ్యగర్భునియందున్నది. హిరణ్యగర్భునియందు జనిస్తుంచుచున్నది. అశ్వమునకు సైంధవమని పేరు. సింధుజమందురు. సింధువనగా సముద్రము. అశ్వము సముద్రమునుండి యుదయించినది. సృష్ట్యాదియందే జంతు వెట్లు పుట్టుచున్నదో వేదము చెప్పుచున్నది. ఏనుఁగునకు సామజమని పేరు. ఏనుఁగు సామవేదమునుండి పుట్టినదన్నమాట. అశ్వమును సముద్రమునుండి పుట్టినదన్న

మాట. ఎట్లు పుట్టినదనఁగా నెవఁడు చెప్పఁగలఁడు? వేదము చెప్పినది. అతీంద్రియములైన విషయములందు వేదమే ప్రమాణము. వేదము నంగీకరింపక పోయినచో నీకు ప్రమాణము లేదు. గాలిలో పక్షివలె తిరుగుచుందువు. నిశ్చయము లేని వేయి యూహాలు చెప్పుదువు. అందులో నేయూహాపరిగ్రాహ్యము? ఈ యశ్వము సముద్రమునుండి యుదయించెను. మొట్టమొదట జలమున్నది. ఆ జలమే సముద్రము. అదియే హిరణ్యా గర్భాకృతి. హిరణ్యా గర్భాకృతియైన యీ యశ్వమును హిరణ్యాగర్భునిగా నుపాసించి వధించినచో కర్త హిరణ్యా గర్భాకృతి యగును. మృత్యువును జయించును. హిరణ్యా గర్భునకు మృత్యువని పేరు. 'సమనసావాచం మిథునం సమభవ దశనాయా మృత్యుః, తద్య్రేత ఆసీత్ స సంవత్సరో భవత్.' అనగా మృత్యువు జలాకృతిపూని విరాణ్మూర్తి యయ్యెనని యర్థము. అది మిథునమును వాంఛించెను. అప్పుడు వాగ్వ్యాపార ముదయించెను. మృత్యువునుండి జల ముద్భవించెను. మృత్యు వా జలమునందుఁ బ్రవేశించెను. అది సంవత్సర మయ్యెను. తత్పూర్వము సంవత్సరమన్నది లేదు. అందుచేతనే యశ్వమేధయాగము సంవత్సర దీక్షాక మైనది. నంవత్సరాంతమునందు మృత్యువు తద్గర్భమును భేదించెను. దానిలోనుండి యగ్ని పుట్టెను. మృత్యువున కాకలి వేసెను. ఆ బిడ్డయైన యగ్నిని భుజింతమనుకొనెను. దానిని తిన్నచో తనయాకలి తీఱదని యా యగ్నినుండి మృత్యువు సర్వమును సృష్టించెను. నాల్గు వేదములను, యజ్ఞములను, ఛందస్సులను, మానవులను. జంతువులను సర్వమును సృజిం

చెను. తినుట యారంభించెను. తినుచుండెను. దాని యాకలి కవధిలేదు. దాని క్షుత్తారుటలేదు. అదియే మృత్యువు. దానిపేరే హిరణ్యగర్భుడు. ఏతద్భావనా భావితమై మేధేయాశ్వము హిరణ్యగర్భాకృతియై కర్తకు మృత్యుంజయముగ ప్రసాదించును. హయము వృద్ధ్యాలోకములు ప్రాపించును. ఆ మృత్యువు క్షుధాకులమై సంవత్సరము నిరాహారముగా నున్నపుడు దాని శరీరముబ్బిపోయెను. ఆ హిరణ్యగర్భాకృతియైన మృత్యువునకు తానుబ్బిపోయి నప్పటి నామమశ్వము. అశ్వయన్న ధాతువున కుబ్బిపోవుట యని యర్థము. అందుచేత నీ మహాప్రథమసృష్టి భావనాగత మృత్యురూప హిరణ్యగర్భోపాసన యజ్ఞరూపమున నశ్వముగందు చేసి యీ యాగము నిర్వహింపఁ బడుచున్నది. కనుక నీ యాగమునకు నశ్వమేధ మని పేరు. వేదము చెప్పిన సర్వయజ్ఞ కర్మలు నట్టివి. తద్భావ భావనాభావితములై జీవుల కనంతత్వమును సిద్ధింపఁ జేయునవి. రాజా! నీవు మహాపండితుఁడవు. ఎవరికో యజ్ఞులకు చెప్పినట్లు నేను నీకీ మహార్థములు చెప్పనక్కఱలేదు. అది ప్రస్తుతమైన విషయము గనుక ప్రపంచించి చెప్పితిని. ప్రయాగయందో, కురుక్షేత్రమందో, నీ రాజ్యమందే యొక చైతన్యవనమందో, యీ హయమేధము నారంభింపుము. మొదట సంగ్రహణేష్టి చేసి యశ్వమును విసర్జింపవలయును. 'చతస్పృషుపత్సుజుహోతి' — మేధీయాశ్వముయొక్క నాల్గు పాదములందును హోమము చేయవలయును, ఈ హోమమునకు బంధన మని పేరు. అవఁగా సంవత్సరాంతమునందు తిరిగి యా యశ్వమును మఱల నిచ్చోటికి వచ్చుటకు దానిని బంధిం

చితిమన్న మాట. ఏ తత్పూర్వమునను క్ష్మాదులైన హోమ ములు సర్వమును చేయుదుము. సంవత్సరాంతమున నశ్వము తిరిగి వచ్చును. అపుడును హోమము లున్నవి. అపుడశ్వము వధింపఁబడునట. శవాకృతియైన యశ్వమునందు మఱల హిరణ్యగర్భ భావనచేసి శవార్చన చేయఁవలయును. అప్పటికి మృత్యుజయము సిద్ధించును. కర్తకు తరువాత మృత్యువు లేదు. మృత్యుభావన లేదన్నమాట. ఈ మహాయజ్ఞమును నీవు చేయుము. నేను చేయింతును. కొన్నివందల యేండ్లుగా నీ దేశమున వైదికమతభావన పోయినది. మానవులు యజ్ఞ దూరులైనారు. యజ్ఞ దూషకులైనారు. ప్రతినిమేషమునందు యజ్ఞ భావనచేత బ్రతికిన బ్రతుకు జీవునకు ముక్తి హేతు వగును. ద్రవ్యమునం దాత్మభావన చేయుటయే మనమత ములోనున్న పరమార్థము. దానిపేరే యజ్ఞము. బౌద్ధాదులీ మహార్థమును గ్రహించలేక దూషించి మానవులను యజ్ఞ విరోధులను చేయుచున్నారు. సర్వోపాసనలను, సర్వ యజ్ఞ ములును తత్తదితరులకు చెప్పఁబడినవి. ఎవ్వఁడో పరమాత్త ముఁడైన జీవునకు నివి యక్కఱలేక పోవచ్చును. వాని దృష్ట్యా సామాన్య జీవులకుఁ గూడ నివి యక్కఱలేదని చెప్పుట జగద్ద్రోహము. ఇంతకుమున్ను నేను చెప్పిన యుదా హరణమువంటిదే. సామాన్యుఁ డెవనినో చంపి వాని యాస్తి హరించుటకును, ఒక మహాపురుషుఁ డింకొక రాజును చంపి తాను రాజగుటకును గల భేదమెట్టిదో యీ భేద మట్టిది. పుష్యమిత్రుఁడు – అయ్యా! ఆ యవనరాజునకున్న వయస్సెంత? మేధావి:– ఆయన కుఱ్ఱవాఁడే. పాతిక

యేండ్లకు లోపుండవచ్చును. పూర్వమాయఁగుదు యవన రాజ్యములను సంహరించి తాను రాజై నాఁడట. ఎట్లు రాజయ్యెనో తెలియదు. ఆ యవను లతని రాజుగా నెట్లంగీకరించిరో తెలియదు. రాజై కూడ నెంతో కాలము కాలేదట. ఆ యవనులు శిక్షాదూరులు. క్రూరులు. కిరాతులును. వారి మొఱటుతనమునకు నవధిలేదు. అట్టి వారిమీఁద నాతఁడంత యధికారము నెట్లు సంపాదించెనన్న దే యాశ్చర్యముగా నున్నది. పుష్యమిత్రుఁడు:- యవనులవలె నతనికి గడ్డము మీసములు కలవా! మేధావి:- కలవు. కాని యతని మొగమునందు తేఁత దనము ప్రకాశించుచున్నది. బ్రాహ్మణ వర్చస్సు కొట్ట వచ్చుచున్నది. అతనినిఁ గూర్చి తెలిసికొనుటకు నేను చాల ప్రయత్నించితిని. అతనినిఁ గూర్చి యెవ్వరికిని తెలియదు. పలుమంది పలువిధముగాఁ జెప్పినారు. ఆ యభిసార దేశములో నొక పెద్ద పర్వత మున్నదట. ఆ పర్వతము చుట్టు ప్రాకారము పెట్టినట్లు కొన్ని పర్వతములు కలవట. ఆలోనికి మనుష్యమాత్రుఁ డెవ్వఁడును పోలేఁడట. ఇతఁడా పర్వతమున దొరకినాఁడనియు, అతఁడు స్వయంభువనియు, దైవాంశ సంభూతుఁడనియు కొందఱు చెప్పిరి. ఆతఁడు గొప్ప జ్యోతిషికుఁడని మనవి చేసితినిగదా, మహారాజా! అతని జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానము మాత్రము సర్వభూతములకు నాశ్చర్యము గల్గించును. నీ నెదుటికిఁ బోయి నిలుచున్నంతనే నీ భూతభవిష్యద్వర్తమానము లన్నియు నతఁడు జెప్పును. నీ బ్రతుకంతయు నతనికిఁ గరతలామలకముగా నుండును. అతఁడు సర్వజనుల భవిష్యత్తుకుఁ జెప్పఁగలడు. మహారాజా!

నా కోర్కె విషయము దెలియును. జన్మించిన ప్రతిజీవియును సుఖమును వాంఛించును. ధనమును వాంఛించఁడు. తన భవిష్యత్తు మంచిగా నుండుటను వాంఛించును. ఇన్నాళ్ళలో నీకు మంచిదినములు రాఁబోవుచున్నవి. ఆ దినమున నీకీ మేలు జరుగును. అని చెప్పెడు జ్యోతిష్కుని వెంటఁబడి తిఱుగని నాస్తికుఁడుకూడ నుండఁడు. వాఁడు పరమ నాస్తికుఁడు. జ్యోతిషము వేదాంగము. వాఁడు జ్యోతిషమును నమ్మును. వానికి జ్యోతిషమునందు నమ్మకము లేదనుచుండును. తన కేదియో యిక్కట్టు వచ్చును. తన కొడుకునకో భార్యకో రోజకవ్యాధి యుదయించును. ఆవ్యాధి యుపశమించునా? ఎన్నాళ్ళ కుపశమించును? అని పోయి యడుగును. వాఁడు నాస్తికుఁ డెట్లయ్యెను? రేపటి ప్రొద్దుటనో, ఎల్లుండి ప్రొద్దుటనో, నీకాబాధ నివారితమగునని జ్యోతిష్కుఁడు చెప్పును. అది యట్లే నివారితమగును. ఈనాస్తికుఁడది ఘుణాక్షరన్యాయ మనునట. వందలో నొండు రెండు ఘుణాక్షరన్యాయములగును. అరువదియు, డెబ్బది యనగునా? ఆ నాస్తికుఁడు నమ్మకపోయినను, జ్యోతిష్కునిఁ బోయి యడుగుచున్నాఁడుగదా. ఆ యడుగుటలోఁ గొంత భాగము విశ్వాసమున్నది. అందుచే నెవ్వఁడును నాస్తికుఁడుగాఁడు. నాస్తికుఁ డెవఁడనఁగా వానికి రేపు లేదు. రేపిట్లు జరుగవలయునని లేదు జరుగునని లేదు. తాను బ్రతికియుంటినని లేదు. రేపు బ్రతికియుండవలయునని లేదు. మృత్యువులేదు. తల్లి లేదు. తండ్రి లేదు. భార్య లేదు. వాఁడు నాస్తికుఁడు. ఒక స్త్రీని వివాహము చేసికొని ఆమె భార్య యనుకొనుచు నామె

యందు సంతానముకని, యా సంతానమును ప్రేమించుచు, వారికిఁ బెండ్లి చేసి, వారు బాగుపడవలయునని యెంచెడివాఁడు నాస్తికుఁ డెట్లగును? ఒక స్త్రీని భార్యగా భావించుచున్నాఁడు. అంతే. వాఁడు నాస్తికుఁడుగాఁడు. ఎందుచేత ననఁగా ఆ నా స్త్రీయందు తన్ను దాను సంతానరూపమునఁ జూచుకొన వాంఛించుచున్నాఁడు. తన కామము యొక్క స్త్రీయందు సమాహారభూతముగా నెంచుచున్నాఁడు. అనఁగా తా నొక వ్యక్తి. తానున్నాఁడు. ఒకటి తనదియే కావలయునని వాంఛించుచున్నాఁడు. ఇది యస్తిభావము. వాఁ డాస్తికుఁడు తన యందున్న యొకానొక జీవలక్షణమునకుఁ బ్రాధాన్యమిచ్చుచున్నాఁడు. ఆ జీవుఁడొకదానినిఁ గోరుచున్నాఁడు. అది తనది కావలయునని కోరుచున్నాఁడు. వానికి భూతభవిష్యత్తులు తెలియవు. తనకు తెలియకుండ వర్తమానమునందు భూతభవిష్యత్తులయొక్క స్థితిని కోరుచున్నాఁడు. అనఁగా నిత్యత్వభావన వానియం దున్నది. వానికి తెలియకుండ నున్నది. వాని వాంఛయం దున్నది. వాఁడు తన్నుఁదాను తన మనస్సుచేత ప్రతారించు కొనుచున్నాఁడు. మ్లేచ్ఛులందఱు నిట్టివారే. అవివేకియైన మానవునకు సోమరియైన మానవునకు తానేమియుఁ బ్రయత్నము చేయకుండ ధనాదులు వాని యంతట నవి సిద్ధించవలయునన్న కోరిక యుండును. ఈకోరిక సర్వ మానవజాతికి సహజమైనది. ఏదియునునది తనయంతట సిద్ధించదన్న జ్ఞానము బుద్ధిమంతుని కొక్కనికే యుండును. వాఁడు కర్మవాది. లోకమంతయు కార్యకారణ రూపవిశిష్టమైనదని వానికిఁ దెలియును. వాఁడు జ్ఞాని. తక్కిన మాన

వులు బహువిధములుగా నుందురు. ఎక్కువమంది యీ యాశను తమ యంతరాంతరములో దాఁచుకొని ప్రయత్నము నందు వ్యగ్రులై యుందురు. ఫలితములనుఁ బొందుచుందురు. వారియాశ యొక్క జీవలక్షణమువలె నెచ్చటనో దాఁగియుండును. అది వానికే తెలియును. జ్ఞానులై కర్మవాదులైన వారి సంఖ్య యెంత యల్పమో, మిక్కిలి సోమరులైన వాని సంఖ్యగూడ నంత యల్పము. వందమందిలో మొదటివాఁడు సోమరి. నూఱవవాఁడు జ్ఞాని. తక్కిన తొంబది యెనిమిది మందియు లోకము. వారు నిర్వ్యవసాయులు కారు. నిరాశులు కారు. జ్ఞానులు కారు. అశ్వమేధ యాగకాండయందు జెప్పఁబడిన హిరణ్యగర్భాకృతి మృత్యురూపమున వారిని గ్రసించుచున్నది. వారు మృత్యువున కన్నము. రాజా! నీవు నూఱవవాఁడవు. నీవశ్వమేధయాగమునుఁ జేసి మృత్యువును జయింపుము. మృత్యువు నిన్ను తాకదు. మృత్యువును నీవు జయించుచున్నావు. అనఁగా నీకే మృత్యువ వగుచున్నావు. హిరణ్యగర్భాకృతి వగుచున్నావు. మేధ్యమైన యశ్వమునకు తలయుషస్సు. నేత్రము సూర్యుఁడు. ప్రాణము వాయువు. తెఱచిననోరు వైశ్వానరుఁడు మొదలైన భావనయందుఁ జెప్పబడిన కాలస్వరూపమైన హిరణ్యగర్భునిలో నొక్కఁడ వగుచున్నావు. ఈ యుపాసన సర్వజనులు చేసెడిది కాదు. మహాపరాక్రమవంతుఁడైన రాజుచేసి చక్రవర్తియై సర్వపరిత్యాగముచేసి మృత్యుపరిజ్ఞానము కల్గించుకొనునది. అల్పుఁడైన బౌద్ధుఁడు హింసయందు జాలి వహించు చున్నాడు. లోకమునందలి దుఃఖమును జూచి జాలి వహించు

నప్పుడు మన మందఱము బౌద్ధులమే. జాలి యెఱుఁగని వాఁడు కర్కోటకుఁ డొక్కఁడే. కర్కోటకుఁడు బౌద్ధుఁ డెప్పుడునుఁ గాఁడు. బుద్ధునకు నిత్యవిరోధి కర్కోటకుఁడు. ఆ బౌద్ధు లజ్ఞానులై కర్కోటకు నెఱుఁగరు. ఈ మానవుఁడు నిత్యజీవయాత్రఁ జేయుచున్నాఁడు. ఒకొక్క దశయం దొక్కొక్క ఘట్ట ముండును. తద్ఘట్టాభిమానులు దానినే పరమార్థముగాఁ జెప్పుదురు. తావన్మాత్ర సంస్కారులు వాని ననుసరింతురు. వేదమతము వీని నన్నింటిని దాటిన మతము. సర్వకాలములు, సర్వదేశములు, సర్వవస్తువులు, సర్వ జంతువులు, సర్వ చిత్తవృత్తులు నన్నింటిని సమాహార దశయందు దర్శించును. అన్నింటిని హిరణ్యగర్భ భావనయం దాహుతి చేయును. ఇది వేదమతము. ఇది యజ్ఞమతము. ఆ యజ్ఞమతమునకు శిరోభూషణమైన దశ్వమేధము. రాజా! నీ వశ్వమేధమును చేయుము. నేను చేయింతును. నన్ను ప్రథమ ఋత్విక్కుగా నర్చించుము. పుష్యమిత్రుఁడు:— మహాత్మా! నీవునా ప్రథమ ఋత్విక్కువు. తక్కిన ఋత్విజులను చెప్పుము. నన్ను వారికడకు తీసికొనిపొమ్ము. నేను వారి నర్చించి హయగజాందోళికల నవరోహింపఁజేసి, వేదము చెప్పిన ట్లపదాతులుగా తీసికొని వత్తును. స్వామీ! నిజముగా నాకీ రాజ్యమెందుఁకు? ఏది యెట్లైన నాకేమి? ఈ రాజ్యము నా మెడకుఁ జుట్టుకొన్నది. నేను రాజును సంహారించ లేదు. ఆయనకొక చిన్నరాణి కలదు. ఆమె స్త్రీ కాదు. ఆమె యొక దేవత. ఆమెను రాజు చంపఁబోవుచుండఁగా నే నడ్డము పోయితిని. కత్తికో నడ్డము పోయితిని.

ఆ కత్తి రాజు గుండెలో దిగెను. రాజవధ దోష నాయందు మాత్రమైనది. ఇదినాస్థితి. ప్రభూ! నాచేత నశ్వమేధము చేయించుము. నీ దయా విశేషముచేత నేను మృత్యువును జయింతును. నేనే మృత్యురూప హిరణ్యగర్భాకృతిగ వహింతును. ఆ చిన్నరాణిపేరు కుముద్వతీదేవి. ఆమె వయస్సిరువదిరెండేండ్లు. ఈరాజ్యమామె నాకిచ్చినది. నా యజ్ఞము జరిగెడువేళ నామె యొక యున్నత పీఠము నారోహించి యుండును. ఆమె నేడు బౌద్ధభిక్షుకి. నేనే యామెను బౌద్ధభిక్షుకురాలిఁ జేసితిని. ఇంతటి మహా వైదిక కర్మకు నగ్రపీఠమున బౌద్ధ భిక్షుకురాలుండుటను మీరనుమతింప వలయును. మేధావి:- కర్మకు నామెకు సంబంధము లేదు. ఆమెకది యొక లౌకికమైన మర్యాద. యజ్ఞమునుఁ జూచుటకు వచ్చిన యెంతమంది యుత్తమాసనముల నధిరోహించి యుండరు? వారిలో నామెది యుత్తమోత్తమాసనము. మహారాజా! నేనింకొక మాట చెప్పెదను. ఈ యజ్ఞమంతయు నొక మహోపాసనా విద్యాంగము. ఉపాసన నెవఁడు చేయుచున్నాఁడు? జీవుఁడు. దేనికోసము చేయుచున్నాఁడు? జీవత్వ భావవ్యపగతి కోసము చేయుచున్నాఁడు. ఈసృష్టి చమత్కారమైనది. ఇచట వస్తువున్నది. భావనచేయువాని మనస్సునందు తద్వస్తు భావమున్నది. ఇది యాకారముకలది. అది భావమయమైనది. యథార్థముగా రెంటికిని భేదములేదు. ఆ భావము నామరూప వికారము పొందె యీ వస్తువైనది. నామరూప వికార రహితమైన యీ వస్తువే ఆ భావము. అట్లే యీ యజ్ఞ

మున్నది. హోమములు, వేళలు, హోమసామగ్రి, ఋత్విక్కులు, కర్మలు, దీనికి లక్షాంగములు గలవు. వానియన్నింటి యందు తత్తద్విశిష్ట భావనకొఱకే యవి యేర్పడినవి. కనుక ప్రాధాన్యము దేనికి ? భావనకు. ఉపాధిరహిత భావన చేయఁగా శక్తి బహు పూర్వజన్మ సంస్కారాత్తమై జీవునకుండునేని, యుపాధి జీవునకు నిరుప యోగము. అందుకనియే వేదమేమని చెప్పుచున్నది ? 'బ్రహ్మైవేత్తి య ఏవం వేద'. ఎవ్వఁడు దేనిని తెలిసికొను చున్నాఁడో వానికి నదేఫలము వేదము సర్వస్థలములం దుప దేశించుచున్నది. మఱి యింత కర్మకాండ యెందులకని ప్రశ్న. మనవి చేసితినిగదా. పందమందిలో తొలి చివఱి వారలిద్దఱను. పరమాజ్ఞాని, జ్ఞానిని తొలఁగించినచో తక్కిన తొంబది యెనిమిదిమంది లోకము వారికి వారిలో తత్తదుచిత సంస్కారులకు. ఉపాధిరహితమైన భావనచేయుట యసంభవ మైన విషయము. ఉపాధిరహితమైన భావన పరమ స్వరూపము. తత్స్వరూపసిద్ధి కుపాధిసహితమైన భావన మార్గము. లోకమున కీ మార్గమే యాలంబము. ఉపాధిసహితమార్గ తిరస్కారము లోకమున కధః పతనహేతువు. ప్రవర్తకులు దీనిని చెప్పుదురు. ప్రవర్త్యు లనుసరింతురు. ఈ మహావిషయ మిట్లుండఁగా నా చిన్నరాణి లౌకికమైన యగ్రపీఠమునఁ గూర్చుండి యాగదర్శనము చేయుట హిరణ్యగర్భరూపమైన సర్వజీవ సంపుటి కేమి యభ్యంతరము !

## ౧౧

మగధరాజ్య మహామంత్రి శ్రీ నారాయణభట్టుగారికి పుస్ మిరత్ఫాఖోజ్ (పుష్యమిత్ర భాగినేయ) నమస్కరించి వ్రాయునది. అయ్యా, నన్నుఁ దమరు మఱచిపోరని నమ్మకము. నేను నన్ను మీరెవ్వరు మఱచిపోకుండనే చేసితిని. మంచియో చెడ్డయో విశేషించి చేసిన వానిని మఱచిపోవుట సాధ్యముకాదు. వాఁడయ్యా వాఁడు. ఆ మహానుభావుని చుట్టము. ఆ మహావేద పండితునికి రక్త బంధువు. ఆ మహాశ్రోత్రికి దగ్గఱివాఁడు పాలవంటి కులము వాఁడు. వాఁడు బుద్ధిపూర్వకముగాఁ బోయి మతాంతరులలోఁ జేరినాఁడు. ఎచ్చటనయిన బలవంతముగాఁ జేరుట యుండును. యవనులు దాడివత్తురు. ఎత్తికొనిపోదురు. వారిలోనే యుంచికొందురు. వారితిండి తినిపింతురు. అట్టివాఁడు మతాంతరుఁడౌట వానికర్మ మనుకొందుము. వీఁడట్లు కాదయ్యా; వీఁడు చాల ప్రబుద్ధుఁడు తన యంతటఁ దానే పోయినాఁడు. యవనులు వానిని వదలిపెట్టినారు. వానినిఁ గొన్నాళ్ళు నిర్బంధించినారు. ఆ నిర్బంధములోఁ గూడ వీఁడు వారిభోజనము చేయలేదు. వారినీళ్ళు త్రావలేదు. తరువాత నేమి వచ్చినదో, వారు వదలిపెట్టి నీదారిన నీవు పొమ్మురా యనఁగాఁ గాదు. మీలోనే యుందునని వారినీళ్ళు త్రావినాఁడు. వారిభోజనము చేసినాఁడు. ఎవనికర్మ మెట్లు వ్రాసి

యున్నదో తెలియదు. నా వంటివానినిఁ గుఱించి యిట్టి మాటలు చెప్పికొనుట తప్పదుగదా! అందుచేత నన్నుఁ గుఱించి మఱచిపోవుటయు సాధ్యముకాదు. ఇన్ని నాళ్ళుగా నావద్దనుండి లేఖ వచ్చునేమోయని మీ రెదురుచూచుచుండ వచ్చును. చూడకను పోవచ్చును. మీరు మహాసామ్రాజ్యమునకు మంత్రులయి రాజశ్వమేధ మహాయఁగ ప్రయత్నములో నుండఁగా సర్వరాజకార్యములనుఁ జూచికోవలసిన రొమ్ముత్రిడిలోనుండి నన్నుఁ గుఱించి యూహించుటకుఁ గూడ నాకుఁ దెలిపిలేకపోవచ్చును. ఆ రీతిగా నేను గవలగుఱ్ఱమును హరించి యది నా కన్నుల యెదుర హింసింపఁబడి కోయఁబడి నిప్పులమీఁద వేయించఁబడి తినఁబడుచుండఁగా నా యశ్వమునకును నాకును భేదము— మెడ నఱుకఁబడుటయుఁ మాంస • ఖండములు ప్రేల్చఁబడి తినఁబడుటయు, దానికి జరిగి నాకు జరుగకపోవుటయే కాఁ గనులారఁ జూచిన, తరువాత వారిచేతఁ జికిత్స చేయఁబడి, వ్రణములు మాని, వారు నాకు గుఱ్ఱమునిచ్చి, దీనిమీఁద నేఁగి యా పుష్యమిత్రునితో వాని గుఱ్ఱము నిట్లు చేసితిమని చెప్పికొమ్మురా. ఆ మహాసేనాపతి యేమిచేయునో చేయుమనుమని నన్ను వదలిపెట్టఁగా, నేను కొంత దవ్వు తిరిగివచ్చి నాలో నా కేయాలోచన కలిగి యీ యశ్వవధమునకుఁ ప్రతిక్రియ చేయవలసిన వాఁడను నేను దోషము చేసినది నేనయి యుండఁగాఁ ప్రతిక్రియ మఱి యెవ్వరిచేతనో చేయించుట నా యసమర్థతను రెట్టింపుచేసికొనుట యని భావించి వెనుకకుఁ దిరిగిపోయితిని. మీ దయా విశేషమున నాకుఁ గొలఁదిగా జ్యోతిశ్శాస్త్రజ్ఞానము

కలదు. వాని నుపయోగించి యీ యవనులలోననే యుండి పోయి పరమేశ్వరుఁ డుపయోగపడినచో నా ప్రతిక్రియనే తా సాధింపనెంచితిని. శ్రీ పుష్యమిత్ర మహారాజులకు నీ ప్రతి క్రియలతో సంబంధములేదు. ఇంతకును మానవ ప్రకృతి చిత్రమైనది. జ్యోతిష మక్కఱలేనివాఁ డెవ్వఁడును లేఁడు. ఒక సేనానాయకునితో నీవు రాజవగుదువని చెప్పుము. ఒక రాజుతో నీవు ప్రక్కరాజ్యమునకుఁ గూడ నధికారివగుదువని చెప్పుము. పరమ నాస్తికుఁడయిన వాఁడు నీ వెంటఁబడి తిరుగును. జీవునకు సహజముగాఁ గల యాశ వానిని జ్యోతిర్విద్యకు దాసునిఁ జేయును. అరే యీ జ్యోతిర్విద్య మనది కాదు. యవనులు దేనిని నమ్మఁ గూడదే. ఇది వేదశాత్రస్థుల విద్య. వారికి మనకు విరోధము. వారి సిద్ధాంతములకు మన సిద్ధాంతములు వ్యతిరేకమున్న భావమీయాశ విషయమునఁ బ్రవర్తించదు. ఎవరా మహాశ్వమును బంధించి యిట్లు హింసించిరో వారియందఱి పేళ్లును నావద్ద నున్నవి. వారి చిఱునామాలు నావద్దఁ గలవు. వారి జాతకములన్నియు నేను జూచితిని, నేను లెక్కగట్టితిని. వారు మ్లేచ్ఛులు. వారికి జాతకములు లేవు. నేనే వారికాశ కల్పించి నన్నడిగించికొని నష్టజాతకములు గుణించి, వారి జీవితములలోఁ బూర్వము జరిగిన సంగతులు కనుఁగొని, జాతకములను నిశ్చయించి, యా జాతకములమీఁద వారికి మఱికొన్ని ఫలితములనుఁ జెప్పి యా ఫలితములు జెప్పినట్లు జరుగుటచేత వారి జాతకములను నిర్ణయించితిని. వారు నలుఁబదిమంది. ఇందులో నలుగుఱిని తొలఁగఁ బెట్టినచో వారందఱకు సంఘమరణము వ్రాయఁబడియున్నది.

అస్మత్ప్రతీకార నిర్హ్యాతన భావమునందు నాయందుఁ బరమేశ్వరునకుఁ గల యనుగ్రహమునకుఁ దత్కార్యానుకూలతకు మొదటి విషయమిది. ఏ నలుగురు స్త్రీ సంఘమరణమునందు లేరో వారి దోషము కూడ స్వల్పమే. వారుత్తర జ్యోతిష దేశస్థులు వారు నన్ను హింసించలేదు. అశ్వగాను హింసించలేదు. వారశ్వమాంసమునుఁ దినలేదు. ఉత్తర జ్యోతిషు లశ్వమాంస ఖాదనము చేయరు. ఈ నలుఁబది మందికి నొక నాయకుఁడు కలఁడు. వానిపేరు తింతాకరాళుఁడు. అతఁడు వారికి నన్ను వధింపుఁడని యాజ్ఞ యీయఁగా వారు నన్ను వదలిపెట్టి యశ్వమును వధించిరి. నేనిప్పుడా తింతాకరాళుని యింటిలో నున్నాను. వాని కుటుంబములో నే నొక్కఁడను. అతనిభార్య, ప్రథమభార్య చనిపోయినది. ఆమెకిద్దఱు పిల్లలు. పెద్దవాఁడు మగపిల్లవాఁడు. రెండవది యాఁడుపిల్ల. వాని తల్లి యున్నది. అతని రెండవభార్యకా పిల్లలు బ్రదికియుండుట యిష్టములేదు. వానితల్లియు నేనును లేనిచో నాపిల్ల లేతోడేలు నోటిలోనో యుండెడివారు. అందుచేత తింతాకరాళునకు నా యందభిమానముగ నున్నది. ఈ తింతుని రెండవభార్య పేరు అయేషా. ఆమెకు నేను ప్రబలవిరోధిని గావలయును. కాని యట్లు కాదు. ఆమెయుఁగూడ నాయందు దయఁగానే యున్నది. కనుక వారి యింటిలో నాయునికి సుఖముగానే యున్నదని చెప్పవలయును. నేను పడెడు బాధ యంతయు నొక్క భోజన విషయమందే. వారి మంచినీళ్ళు త్రాగుట కలవాటు పడితిని. వచ్చిన యిబ్బంది భోజన విషయమునందే. వారు ప్రధానముగా మాంసంభోక్తలు. ఈ జాతికంటె సోమరి

జాతి సృష్టిలో నుండదు. వీరుంఛవృత్తులు. ఋషులుమాత్రము కాదు. ఏదిదొరకినచో నది తిందమనియేకాని యిది దొరికించి కొందమని లేదు. ఈ పర్వతములో నందందుఁ గొన్ని వాలు ప్రదేశములు, కొన్ని సమప్రదేశములును గలవు. దున్ను కొన వచ్చును. మేఘుఁడు వాని యిష్టమువచ్చినప్పుడు చినుకులు కురిపించుటయుఁ గలదు. దున్నవచ్చును. విత్తవచ్చును. కోసికొన వచ్చును. తినవచ్చును. ఈ యడవులలో దున్నల వంటి జంతువులు కలవు. వానిని మాలిమిచేసి గున్నించికొన వచ్చును. ఇచ్చటి మానవులవలె నవియును గ్రూరములు. అదుపులేనివి. నియమము లేనివి. శిక్ష నెఱుఁగనివి. ఐనను వానిని వీరు వలలువేసి పట్టుకొందురు. వానినిఁ జంపి కోసికొని తిందురు. వానిచేతఁ గొన్ని పనులు చేయించుకొందమన్న యూహయే వారికిఁ బుట్టదు. వారొకసారి యొకదున్ననుఁ దెచ్చిరి. వలలతో దాని మొగమును బిగించి కట్టి దాని నాల్గు కాళ్ళను బంధించి మోసికొని వచ్చిరి. నేనెంతో ప్రయత్నముచేసి వారు దానినిఁ జంపకుండఁ జేసితిని. దాని బంధనముల నూడఁదీసితిని. గట్టి నరములచేత నొక బండకుఁ గట్టి యుంచితిని. మూన్నాళ్ళైన తరువాత దాని పొగరుడిగినది. అదియు జంతువే కదా. దానికిని క్షుద్బాధ కలదు. సర్వజీవలోకము సర్వజంతు సముదాయము క్షుత్తుచేత బంధింపఁబడుచున్నది. అది నాల్గవదినమున గడ్డిముట్టినది. ఇప్పటి కాఱు నెలలయినది. క్రమముగా ముట్టెయకుఁ ద్రాడు కట్టనిచ్చినది. నాసాగోళమునందు వాడియైన దబ్బనముఁ గుట్టనిచ్చినది. నరమును దూర్చితిని. దానిచేత నే నెన్నియో పనులు

చేయించు చున్నాను. నాకిది నీళ్ళు తెచ్చుచున్నది. నన్ను మోయుచున్నది. దూరములు ప్రయాణములు చేయుచున్నది. ఇచ్చటి జనమెంత యజ్ఞులనఁగా నన్నుఁజూచియైననుఁ దానిది నేర్చికొనరు. నేను దానిచేతఁ గొంత నేల దున్నించి, యచ్చట ప్రాళ్లు లేవు. అన్నిఁటికిని దీర్ఘ దీర్ఘములయిన నరములే ప్రాళ్లు నారలేదు. దాని కిరువైపుల నరములనుగట్టి వెనుక నొక మొండి ఖడ్గముతోఁ గొంత నేల దున్నించితిని. ఇచట నడవిలో నొక విధమయిన ధాన్యము దొరకును. వానిని-విత్తితిని. ఆ పొలము పండెను. వానలేదు. మొక్క నాటుకొన లేదు. ఏమిపంట వచ్చిన ధాన్యము పదిగుప్పిళ్ళు లేదు. వారందఱు నవ్విరి. అజ్ఞులు నవ్వక యేమిచేయుదురు? ఇది యంతయు వేఱేకథ. నాకిప్పుడు మతభ్రష్టుఁడ నైతినన్న విచారములేదు. వీరందఱిని సువ్యవసాయులనుఁ జేయసెంచితిని. జీవుని లక్షణము చిత్రముగా నుండును. లౌకికమైన యూహాయందు బద్ధాదరుఁడయి మహావిషయమును విస్మరించును. ఈయల్ప లౌకిక విషయమునకుఁ బ్రాధాన్యమిచ్చును. అది దన జన్మకుఁ జారితార్థ్యము సంపాదించు ననుకొనును. తానేదో లోకోప కారము చేయుచున్నా ననుకొనును. లోకోపకారమే జన్మకుఁ జారితార్థ్య మనుకొనును. నేను నట్లే యుంటిని. నాకీ మహా కార్యములో సర్వథా యనుకూలపడుచున్నది. ముఖ్యాను తింతాకరాళుని భార్యయు, వారి యిద్దఱు పిల్లలును. అతని భార్యకు వాని పిల్లలయందున్న ద్వేషము. ద్వేషముగానే యున్నది; గాని నాకు సాయపడు సందర్భములో వారితోడి కలయిక తప్పుట లేదు. గుడ్డిలో మెల్లగా వారి సంగీకరించుట

తప్పుటయును లేదు. ఇది నాదైనందిన జీవితప్రవర్తనము. దీనిని గుఱించి యెంతయో వ్రాయవలసి యున్నది. ఒక గ్రంథము వ్రాయవచ్చును. మనుష్యుఁ డెవఁడయినను దానినిఁ గుఱించి వ్రాయునేమో, నాకుఁ దెలియదు. నేను వ్రాయఁవలసినవి వేత్ర యున్నవి. ఈ విచిత్రమైన రాజ్యములో నొక మహా విచిత్రమయిన విషయము కలదు. నాయుండుచోటికి నలుఁబదియోజనముల మేర నొక పర్వతము కలదు. ఆ పర్వతముచుట్టు నొక యఖాతమైన యూబినేల కలదు. ఆ యూబినేలచుట్టు ప్రాకారము పెట్టినట్లు నొక పర్వతముల వరుస కలదు. ఆ లోపలికి మార్గము లేదు. ఆ పర్వతములు దాటుటకే వీలు లేదు. దాటి పోయినను పడిన యూబిలోఁబడి పాతాళమునకుఁ బోవలసినదే. ఆ యూబిలో నెప్పుడు నేదో యొక యడవిమృగము పడి చనిపోవుచునే యుండును. దాని మరణవేళా మహానిస్వానములు వఱపులు వినిపించుచునే యుండును. ఆలోని కొక త్రోవయున్నది. ఉత్తరపు దిశనుండి యా ప్రాకార పర్వతములో నొక బిలము, లోని యూబికడకుఁ దీసికొని పోవును. ఆ యూబి దాటి లోనున్న పర్వతము చేరుటకుఁ జిత్రమయిన త్రోవ కలదు. అడుగడుగుమేర పెద్దపెద్ద దుబ్బులు కలవు. జాగ్రత్తగా నడుగులు వేసికొంచుఁ బోవలయును. పోయినచో లోని పర్వతమునకుఁ జేరవచ్చును. ఆ పర్వతములో వరుసగా నాల్గుగుహా లున్నవి. ఆ గుహాలో నిద్దఱు పురుషు లున్నారు. తండ్రి కొడుకులు. పెద్దవానిభార్య కలదు. ఇదే సంసారము. వారిద్దఱు మహాజ్యోతిర్విద్యాంసులు. వారికీ జ్యోతిర్విద్యయెట్లు వచ్చినదో నాకుఁ దెలియదు. ఇద్దరికీ పేరు నొకటియే. నెలి

యోనను. ఈ తండ్రికొడుకు లిద్దఱును నెలియోనను లేదన్న విషయముగాని పెద్దవానికి భార్యయున్నదనిగాని తెలిసిన దిద్దటికే. నాకును, తింతాకరాళునకును. తక్కిన లోకమునకు నొక్కఁడే నలియోనను. వానికి భార్యలేదు. వాఁడు నిత్యజీవి. వాఁడు వేయి ఏండ్లనుండి బ్రదుకుచున్నాఁడు. తింతాకరాళుఁడు దానికి వ్యాప్తితెచ్చెను. ఇచట నైదు యవనరాజ్యములు కలవు. ఐదింటికి రాజులు కలరు. వారి కైదుగురు మంత్రులు గలరు. ఐదుగురు సేనాపతులు కలరు. ఈ పదునేనుమంది మీఁద తింతాకరాళుఁడే రహస్యముతో నధికారము చేయుచున్నాఁడు. ఈ పదునేనుమందిలో నెవనినో యొకనినిఁ గరాళుఁడు నెలియోనను దర్శనమునకుఁ దీసికొనిపోవును. అతని చేత జ్యోతిషము చెప్పించును. వాని కల్లే జరుగును. వారు నెలియోననే దైవ మనుకొనుచున్నారు. ఆ రాజులుగాని మంత్రులుగాని సేనాపతులుగాని కరాళునిఁ గనుఁగొనకుండ నేపనియుఁ జేయరు. నెలియోన నెంత చెప్పినచో నంత చేయుదురు. ఒకప్పుడు పదునేనుమందియు నొక్కసారి నెలియోననునుఁ జూడవలయు ననిరి. ఐదురాజ్యములు కలసి యార్యావర్తముమీఁదికి దండెత్తవలయుననియు, నార్యావర్తము వశము చేసికొనవలయుననియు, వైదికమతము నిర్మూలించవలయుననియు, సర్వభారతదేశము యవనము చేయవలయుననియు, వారి యూహ, అట్టి ప్రయత్నము ఫలవంతమగునా కాదా ఫలవంతమగునని నెలియోనను చెప్పినచో వారు దండయాత్ర బయలుదేఱుదురు. ఆ రాజ్యముల యందు సమైక్యము లేదు. ఆ సమైక్యమును గొన్ని

విషయములయందు తింతాకరాఖుఁడు సాధించినాఁడు వెలిమో నసు సాహాయ్యముతో సాధించినాఁడు. ఈ యైదు దేశముల నుండి పర్వాణములద్వారా యూరావర్తమున కొక త్రోవ యున్నది. అశ్వవధము చేసిన నలుఁబది మందిలో నీ యైదు రాజ్యములవా రున్నారు. అతఁడు సాధించిన యైక్య మిా యొక్కటి. అదివఱ కెప్పుడును నీ యైదురాజ్యముల సర్వాధి కారులు నొక్కసారిగ వెలిమోనసు దర్శనమునకుఁ బోలేదు. వా రొక్కసారిగా వెళ్ళినచో సిద్ధఋ వెలిమోనసు లున్నా రనియు, వారిలో నొకఁడు తండ్రియనియు, రెండవవాఁడు కుమారుఁ డనియుఁ, దండ్రి యనంతరమునఁ గుమారుఁడు వెలిమోనసుగా భాసించుచున్నాఁడనియుఁ గుమారునకు రహస్యముగాఁ బెండ్లి జరిగినదానికిఁ గుమారుఁడు గలిగి మఱల వాఁడే వెలిమోనసగుచు, నీ నాటకము కొన్ని వందల యేండ్లుగా తింతాకరాఖుని వంశమునఁ దొక రహస్యముగ వాని యపరిహార్యతకు హేతువుగా వాని కీ రాజులమీఁద రాజ్యాధి కారులమీఁద నున్న యధికారమున కాలంబముగా నున్నదన్న విషయము బైటఁ బడినచో తింతాకరాఖుని బ్రదుకు బైటఁ బడును. ఒకసారి వారు పదునేనుమందియు వెలిమోనసు దర్శనమునకుఁ బోదమన్నారు. పోయి యితనిచేతఁ జెప్పించు కొని యూరావర్తముమీఁద సమిష్టిగా దండయాత్ర చేయ వలయునని వారి యుద్దేశము. అందఱునుఁ గలసి వచ్చు చున్నారన్న వార్త ముందు వెలిమోనసునకుఁ దెలియ వల యును. లేనిచో నతఁ డజాగ్రత్తలో నుండును. వారు కుటుం బము ముర్వురునుఁ గనిపింతురు. ఆరాజు లెంత తీవ్రులనగా

నెంత క్రూరులనఁగా రింతాకరాళుని వెంటనే వధింతురు. అంతేకాదు, వెలియోనసు వంశముకూడ నాశనమగును. జంతుసమానులయినవారికి నాలోచన యుండదు. ప్రాణి వధను చేయుట యన్నది వారికి లెక్కలోనిదికాదు. దానినిఁ గూర్చి వారు యోజింపరు. అంత సులభమయినపని వారికి మఱియొకటి లేదు. అరే! వీఁడు ప్రాణి. ఈ జీవలోకమునందుఁ బ్రాణి యెట్లుద్భవించుచున్నది? ఎట్లు పెరుగుచున్నది? పురుషునియొక్క రేతస్సు స్త్రీ గర్భమునందు సిహాతమయి యెందుకుఁ బిండము కావలయును? లోన నెందుకుఁ బెఱుగ వలయును? దానిలో జీవుఁ డెందుకుఁ బ్రవేశించవలయును? తొమ్మిది నెలలలో నసియెందుకుఁ బండవలయును? పుట్టినవాఁ డన్నము తినుట యేమి? పెరుగుట యేమి? ఈ సృష్టి యేమి? దీని రహస్యమేమి? మనుఁజుడు, మనుజునియొక్క యాలో చననాశక్తికందని యీ మహావిషయ మెట్లు జరుగుచున్నది? దీని వెనుక నేమియున్నది? పరమేశ్వరుఁడని యొకఁ డున్నాడా? వాఁడు దీని కంతటికిఁ గారణమా? ఆ కారణము యొక్క స్వరూపమేమి? దాని నెట్లు తెలిసికొనవలయును? అది తెలిసికొనుటయే బ్రదుకు పరమార్థమేమా? ఇట్టిభావమే లేని జాతియది. వాఁడెట్లు పుట్టెనో వాని కక్కఱలేదు. ఎట్లు పెరిగెనో వాని కక్కఱలేదు. వాఁడు తినవలయును. తిరుగ వలయును. అడ్డము వచ్చినదానినెల్లఁ జంపును. వాఁడు బ్రహ్మ యైనను గాకపోయినను, విష్ణువైనను గాకపోయినను, వాఁడు మాత్రము రుద్రుఁడు. ఇదియొక ప్రళయరుద్రజాతి. ఈ కుదు నేను మంటితూ నొక్కసారిగా వెలియోనసుయొక్క దర్శనము

నకు వచ్చుచున్నారన్న సంగతియును హెలిజయోనసునకుఁ దెలియుటకు నన్ను ఠింతాకరాళుఁడు పంపెను. నేను వెళ్ళితిని. వారి కుటుంబము నంతయుఁ జూచితిని. వారి విద్యలో వారి కంటె నాకే యెక్కువ వైశారద్య మున్నదని వారికిఁ దెలి పెను. వా రాశ్చర్యపోయిరి. ఈ విద్య వారికి సృష్ట్యాదినుండి సహజమయినదనియు, నిది యింక నేజాతిలో లేదనియు, నాక్యాంకీ విద్య తెలిసినచో వారినుండి యెట్లో యీ విద్య భారతదేశమునకుఁ బ్రాకినదనియు వారి యుద్దేశ్యము. నాకీ సంగతి తెలిసినపుడు నేను నవ్వికొంటిని. ఆ హెలియోనసుతో రాజులును రాజాధికారులు నొక్కసారిగా వత్తురని నేను జెప్పఁగా రానిమ్ము. నా రహస్యము వారికిఁ దెలిసినచో నష్ట మేమి ? యనెను. ఇది యంతయు ఠింతాకరాళుని పన్నాగము. పూర్వుఁడయిన యెవఁడో ఠింతాకరాళుఁడు, మత్పూర్వుఁ డయిన యెవఁడోఁ హెలియోనసు. తమ మధ్య నెప్పుడో యిట్టి నియమము చేసికొన్నారు కాఁబోలు ! దీనివలన ఠింతాకరా ళునకు లౌకికమయిన లాభమున్నచో వాని కన్యాయము నే నేల చేయవలయునని నేనూరకుంటిని. ఒక రహస్యము కొన్ని వంపల యేండ్లు దాఁచవచ్చును. అప్పుడయిన నెపుడో బైటఁ బడక తప్పదు. ఈ రహస్యమువలనఁ బ్రయోజన మేమియో నాకుఁ దెలియదు. ఇది యొక విద్య. ఇది గారడీ కాదు. ఇందులోఁ గల్పన లేదు. మోసము చేయుట లేదు. యథార్థమయిన విద్యను బ్రదర్శించుటలో మోసమును గలుపవలసిన యవసర మేమి యున్నది ? అల్పశక్తిమంతులు తమయల్పవిద్య నధికముగా భాసింపఁ జేసికొనుటకు మోసము

నవలంబింతురు. నాకా యవసరము లేదనెను. నేను వచ్చి తింతాకరాళునితో నీ సంగతి చెప్పితిని. వాని ప్రైణములు పైకెఁ బోయినవి. వాని కుటుంబ రహస్యమే బైటఁబడి పోయినట్లు వాని వంశమునకు నిత్యమయిన వృత్తి నాశన మయి పోయినట్లు వాఁడు భయపడెను. ఈ రాజులు, రాజాధికారులు, వెలియోనసును దర్శించెడి దినము సమీపిం చినది. దానిని నన్ను వారించి పెట్టుమని నన్ను బతిమాలు కొనెను. కాళ్ళఁ బ్రేళ్ళఁ బడెను. నీవు నా బిడ్డలయందు ప్రేమగ నున్నావు. నీ వీ యుపకారము చేసి పెట్టినచో నా బిడ్డను బ్రదికించినవాఁ డవగుదువు. మొదలుగ నన్నుఁ బ్రార్థించెను. నేను మఱల వెలియోనసు వద్దకుఁ బోయితిని. అతనితోఁ జెప్పితిని. అతఁడు 'నన్నేమి చేయుమందువు! మాకు నాల్గు గుహలున్నవి. వా రా గుహలలోనికిఁ బోయి చూచినచో నే నెట్లు వారింతును? ఎన్నఁడు నిది మనుష్యుఁడు రాని పర్వతము. సహజముగా నిచ్చటికి వచ్చిన వారికిఁ బర్వత మంతయుఁ జూడవలయు ననిపించును. వారు కొండకొమ్మెక్కి చూతురు. ప్రక్కవాటుగనున్న చీలికలుగానున్న కోణము ముగానున్న యీ పర్వతాగ్ర భాగమును వారు చుతురు. భిన్న దినములయందు, భిన్న ఋతువులయందు, వాలుగ సూర్యకిరణములు పడెడి ప్రదేశములందు మా పూర్వులు రేఖలను గీసి యట్టిపెట్టిరి. అవి మాసిపోయినచో మేము వానిని నవీకరింతుము. వారవి చూచి వీని స్వరూపమేమని యడుగఁగ నేను దాచను. నా కొడుకునకుఁ జెప్పినట్లే వారి కినిఁ జెప్పుదును. వారినిఁ గూడ నేర్చికొననిమ్ము. ఈ విద్య

మీ దేశములో సర్వవ్యాప్తము కానిమ్ము. మా వంశము నందే యీ విద్య యుండవలయునన్న పట్టింపు నాకు లేదు. మే మీ కొండమీఁద నివసించుచున్నాము, ఇచ్చట దుంపలు తినుచున్నాము. పండ్లారగించుచున్నాము. కొండమీఁది దొరువులోని నీళ్ళు త్రాగుచున్నాము. ఓయీ! నీ పేరేమి?' యని యతఁ డడుగఁగా నాపేరు చెప్పితిని. అతఁడు మఱల ననెను. 'మా బ్రదుకు చిత్రముగా నున్నది. మనుష్యుఁ డిట్లే బ్రదుకునా? నాకుఁ దెలిసిన జ్యోతిర్విద్యచేత నీ కొండ వెలుపల నెంతయో యున్నదని నాకుఁ దెలియును. దాని స్వరూపమేమో నాకుఁ దెలియదు. అప్పుడెప్పుడో రాజని, మంత్రి యని, సేనాపతియని, నా వద్దకు వచ్చుచుందురు. నాజ్ఞానమే విచిత్రముగ నున్నది. ఇది లెక్కలనుఁబట్టి దాని ఫలితమును జెప్పుటను బట్టి నా వద్దనున్న గ్రంథములనుబట్టి వచ్చిన విలక్షణమయిన జ్ఞానము. ఈ తింతాకరాళుఁడు రాకపోయి నచో నడపదడప నా రాజులును మంత్రులును రాకపోయి నచో బైట నొక లోకమున్నదని నాకుఁ దెలియదు. ఆ లోకమునెట్టిది స్వరూపమెట్టిదో నాకుఁ దెలియదు. అపుడపుడు తలంచినచో నాస్థితి నాకే యాశ్చర్యము కలిగించును. ఇదియొక కులక్రమాగత విద్యగా నున్నది. కనుకఁ దత్సంబంధియైన సర్వజ్ఞానము నాకున్నది. రాజులు, దేశము, దండయాత్ర, యవనులు, యవనులు, కానివారు యుద్ధములు, సేనలు, గెలుచుటలు, మరణములు, పుట్టుకలు నివి యన్నియు, నాకు వట్టిమాటలు. వాని యర్థమేమో నాకుఁ దెలియదు. వాని స్వరూపమెట్టిదో నాకుఁ దెలియదు. యుద్ధమనఁగా నెట్లుండును?

గెలుచుట యనఁగా నేమి? ఎందుకు గెలువ వలయును? యథార్థమునకు యవనులకు యవనేతరులకు భేదమేమి? ఈ వేళకు వారి గెలుపోటములకు నేమి సంబంధము? ఈ సమయమునందు బయలుదేఱి యీ ప్రయత్నము చేసినచో నీ ఫలితము వచ్చునని నాతండ్రి నాకు నేర్పెను. నా కొడుకునకు నేను జెప్పితిని. నావద్దనున్న సన్నని రాగి రేకుల సంపుటముమీఁద నిట్లు వ్రాయఁబడి యున్నది. వానినిఁ జదువుట నా కొడుకునకు నేర్పితిని. నాకిది యంతయు నొక యాశ్చర్యము. మరణమనఁగా నాకుఁ దెలియును. నాతండ్రి చనిపోయినాఁడు. నాతల్లి చనిపోయినది. పుట్టుకయనఁగా నాకు దెలియును. నాకొడుకు పుట్టినాఁడు. వీనికిఁ బెండ్లిచేయవలయు నని కరాళుఁడు చెప్పెను. అసఁగా నా కర్థము కాలేదు. ఈ జ్ఞానము చిత్రమయినది. తెలిసినట్లుండును. తెలియదు. తెలియ నట్లుండును. తెలియును. నా భార్య నా కొడుకుఁ దల్లి. అతని యందు మఱియొక వెలియోనము జన్మించవలయు ననుచో వానికొక స్త్రీ భార్యకావలయును. ఆ స్త్రీని తెచ్చెడిబాధ్యత కరాళునిదట. మా బ్రదుకులు చెప్పరానివిగా నున్నవి. మేము పశువులము. మాకున్న జ్ఞానమును తమముగా నున్నది. సర్వ మూహించి తెలిసికొనవలసి యున్నది. ఇచటి నుండి పోయి వెలిజగత్తు చూడవలయునని నాకుఁ జాలసార్లనిపించెను. చూచి యేమిచేయవలయును? నా కర్థము కాలేదు. ఎవరికో చెప్పెడు ఫలితములు నా విషయములో నెట్లు జరుగునో చూచి కొవలయును. ఇదియొక క్రొత్తబాధ. నా కొడుకునకుఁ బెండ్లి యెప్పుడగును? వానికిఁ గొడుకెప్పుడు కలుగును? వాఁ

ఎన్నేండ్లు జీవించును? ఇంతటితో సమ్మోగుతించిన మా ప్రశ్నలు మా ఫలితములు పర్యవసించును. అంతకుమించి నాకుఁ బ్రశ్నలు లేవు. బైటనుండి వచ్చినవారు చిత్రవిచిత్రము లైన ప్రశ్నలు వేయుదురు. వారు వేసెడి సర్వప్రశ్నలకు మా వద్దనున్న గ్రంథములలో సమాధానము లున్నవి అనఁగా నీ ప్రశ్నలును సమాధానములును నెప్పటినుండియో యున్న వన్నమాట. అనఁగా నెప్పుడు నిది యిట్లేయున్నదన్నమాట. ఆకాడికి నేను జూచికొనుట యెందులకు? వారు మూర్ఖులయి వచ్చి యడుగుచున్నారు. కనుకఁ జెప్పుచున్నాను. నా యీ భార్యయున్నది. ఆమె నాకు భార్యయన్నమాట. నేను గ్రంథములనుండి నేర్చికొన్నాను. తింతాకరాళుఁడు చెప్పినాఁడు. ఓయి! నాకిప్పటికి నాశ్చర్యముగా నుండెను. ఆమె నీ కొండ మీఁదికిఁ దెచ్చి యీ కరాళుని తండ్రి వదలిపెట్టినాఁడు. అప్పటికి మాతల్లి యున్నది. మాతండ్రి యున్నాఁడు. వారిద్దఱినిఁ జూచుటచేత నామెయు నేను నట్లుండవలయుఁ గాబోలు ననిపించినది. అట్లనిపించినదా? నాలో నేదియోయుండి నామెయు నేనును గలిసికొనుట సంభవించినదా! ఈ విషయము నాకిప్పటికి నవగతము. నా కొడుకు నిట్లేయగునన్నమాట. బహిః ప్రపంచము తొంక్క ముక్కు మొగము నెఱుఁగని నేను జ్యోతిర్గ్రంథములనుండి సర్వ విషయములనుఁ దెలిసికొని, తెలిసికొనిన విషయములకుఁ బ్రత్యక్ష ప్రమాణము లేక యన్ని యూహాలు నా మనస్సులోనసే యిమిడియుండిన నొక జ్ఞాన భాండాగారముగా నుండి తద్విషయక పరిజ్ఞానమాత్ర జన్యమైన యేదొక తృప్తి ననుభవించుచు నెందుకు బ్రదుకుచుంటినో

విచారించికొనకుండ, విచారించినచోఁ గరాళుఁడు తీసికొని వచ్చు పురుషులలోఁ గొందఱు రాజులని, గొందఱు మంత్రులని వారడిగెడి ప్రశ్నలకు సమాధానములు చెప్పుటయే బ్రదుకు పరమార్థము కావలయు నింతకంటె నేమియు కాదని తెలిసికొని యీ మాత్రమయిన దానికి బ్రదుకుట కొందులకో తెలియక తెలియకయు బ్రదుకుచున్నాను. ఎంత విచిత్రముగా నున్నది. ఓయీ! నీ పేరేమని చెప్పితివి. ఏ పేరయిననేమి? ఆ యైదుగుఱు రాజులను నా యైదుగుఱు మంత్రులను నా యైదుగుఱు సేనాపతుల నొక్కసారి రమ్మనుము. అంతమంది నొక్కసారి చూచినచో నెట్లుండునో ప్రపంచమంతయు నొక్కసారి చూచినట్లుండునేమో వారికి నా కొడుకును నా భార్యను గూడఁ జూపింతును. కొంత కొమ్ముగనున్న నా జ్యోతిరాలయమునుఁ జూపింతును. మఱియు నాకెంత కొక్కటి తెలిసినది. నాకున్నట్లు నీకు జ్యోతిరాలయము లేదు. నీవు నీ ఫలితములన్నియుఁ జెప్పుచున్నావు. జ్యోతిరాలయము లేకుండ నెట్లు చెప్పుచున్నావు? నీ వద్ద నేమయిన గ్రంథములున్నవా? ఈ దినము గడచిన తరువాత నీ దినము వచ్చునని లెక్కవేసికొనవలయును గదా! ఋతువు మాఱుచున్నదని తెలిసికొనవలెనుగదా? గ్రహచారము కట్టవలయునుగదా. నీ వివేవియు లేకుండఁ దెలిసికొనుచున్నావనఁగా. జ్యోతిరాలయముతొక్క యవసరమంత లేదన్నమాట. ఈ జ్యోతిరాలయము కూడ నీ మనస్సులోనే యున్నదా? కాను. ఏ నాఁటికానాఁడుగ లెక్కగట్టికొను వచ్చును. అది కష్టమైనపని. నీవు నాకంటె నందరెట్లు

మేధావివయి యుండవలయును. నిజానికి నీవంటివాఁ డున్న ప్పుడు నావంటివాఁ డుండనక్కఱ లేదు. ఈ తింతాకరాళుఁడు నుండనక్కఱ లేదు. అది యట్లుంచి నీకు నా జ్యోతిరాలయ మునుఁ జూపింతును రమ్ము' - అని యతఁడు నన్నుఁ దీసికొని పోయి యా కొండయంతయుఁ జూపించెను. అతని కుటుం బము నంతయుఁ జూపించెను. అతని గ్రంథసముదాయము నంతయుఁ జూపించెను. నేను బైటి సంగతియే మఱచిపోయి తిని. మహామంత్రీ! నేను దమకు వ్రాయుచున్న సంగతు లలోఁ బౌర్వాపర్యము లేవియు లేవు. మఱచిపోయితిని. తింతా కరాళుఁడు చెప్పినట్లు రాజులును రాజాధికారులును గలిసి గుంపుగా వెలియోనసును బోయి చూచుటను నేను వారించి తిని. నేను వారికి జ్యోతిషము చెప్పితిని. వారికి వెలియోనసు జ్యోతిషము మీఁద ననురాగము పోయెను. ఈ జ్యోతిషము చెప్పుటకు నెవ్వఁడు వేయియేండ్లు బ్రదుకనక్కఱ లేదన్న మాట. వాఁడు సత్యజీవి కానక్కఱ లేదన్నమాట. వాఁడు తింతా కరాళుని నాశ్రయించ నక్కఱ లేదన్నమాట. పైగా నా జ్యోతిషము వారి కాశ్చర్యము కల్పించినది. నేనుగొన్ని ఫలితములనుఁ జెప్పితిని. ఒకనాఁ డొకఁడు సాయంకాలమున గుఱ్ఱముమీఁదఁ బోవుచుండఁగా వాని గుఱ్ఱము బెదరి వాఁడు క్రిందఁ బడునని వాని కాలికి దెబ్బ తగులునని పది దినములు వాఁడు లేవలేఁడని చెప్పితిని. వాని కట్లే జరిగెను. ఇంకొకని భార్య గర్భవతియై యుండఁగాఁ గొడుకే పుట్టునని చెప్పితిని. కొడుకే పుట్టెను. ఇట్టి వెన్నియో జరిగెను. వారికి వెలియో

ననునం దాదరము తగ్గెను. కరాళునియం దభిమానము తగ్గెను. కాని నెలియోనను వేయి యేండ్లనుండి బ్రదుకుచున్నాఁడన్న మహా విషయమునందు వారి కాశ్చర్యముకలదు. మఱియు వారికి నెలియోనననుఁ జూడవలయునన్న యభిలాష పోకుండుటకు నింకొక కారణముకలదు. వారు భారత దేశముమీఁద దండెత్తవలయునని సంకల్పించినారు. ఊరకరొ వట్టిదాడులు చేయుటయు దొంగదోపిడిగా వెళ్ళి వచ్చుటయుఁ దిరిగివచ్చు నప్పుడు ధనము తెచ్చికొన్నను కొంతలు దారిలో సంహరింపఁ బడుటయు, దీనికన్న నా రాజ్యముమే యాక్రమించి నచో నది నద నిత్యధనప్రాప్తి హేతువనియు, నిత్యసుఖ హేతు వనియు, నా రాజ్యము లాక్రమించుటకు సమిష్టి ప్రయత్న మవసరమనియు, వారియూహ. దానికి తింతాకరాళుఁడెక్కువ దోహదము చేసెను. ఆ కాలము వారిసంతయాత్రకు యోగ్య మైనదని నెలియోనను చెప్పుచుండెనని కరాళుఁడు వారితోఁ జెప్పెను. నేను వేళయోగ్యము కాదని చెప్పితిని. వందచిన్న విషయములందు నా జోస్యము ఫలించినది. ఈ పెద్దవిషయ ములో నది వ్యతిరేకముగ నున్నది. అందుచేత నెలియో నసునుఁ జూడవలయుననియే వారికున్నది. నేను వారి నొక యేడాదివఱకు నిలయించితిని. కరాళునితోఁ జెప్పితిని. నీవీ లోపుగా నెలియోనసుతో మాటాడి కొనుము. ఈ రహస్య మతఁడు బైటఁబెట్టకుండఁ జూచికొను మని చెప్పితిని.

నేను నెలియోనసు పర్వతమునకుఁ బోవుచుంటిని. వచ్చుచుంటిని. ఇచట నున్నపుడు కరాళుని కుటుంబములోని

వాఁడను. అచట నున్నపుడు వెలిరోమాసను కుటుంబములోని వాఁడను. వెలిరోమాసను కొండమీఁద నున్నపుడు నాయను భూతియే విచిత్రముగా నున్నది. అతనిభాగ్యకు నతని కుమారునకు నన్నుఁడఁజూసి యుండుట దుర్ఘటమయిపోయెను. ఓ యయ్యా! మహామంత్రీ! రెండవ మనిసియొక్క కంఠస్వరము వినుటలోని యానందము పదివేలమందిలో బ్రదుకుచున్నవాని కెట్లు తెలియును? ఆమెతో నామెభర్త మాటాడునో? మాటాడఁడో! వారి సంగమమునందుఁ బ్రేమ కలదా? చాటూక్తులు కలవా? ప్రసాదనము చేసికొనుట కలదా? చమత్కారోక్తులు కలవా? పరిహాసము కలదా? తానడిగినది యీయ లేదన్న కోపము కలదా? పొలయలుక కలదా? ఏమియులేని సంగమము. కొడుకునకుఁ దల్లికి నడుమ మాత్రమేమియున్నది? ఇట్టి వట్టి తిండిబ్రదుకు లయినవి వీరియిద్దఱి నడుమఁ జాలయున్నది. చదువున్నది. చెప్పుట యున్నది. నేర్చికొనుటయు - ఈ గ్రంథము లున్నవి. లెక్కలున్నవి. ఆమె వట్టి కొండ బ్రదుకు బ్రదుకుచున్నది. నే నతిథిని పోయితిని. నా కన్నియు సమకూర్చి పెట్టవలయును. నేను పరాచికములాడుదును. నవ్వుదును. వెక్కిరింతును. నాకుఁ గావలసినది యామె సమకూర్చినచోఁ గృతజ్ఞతా వాక్యములు పలుకుదును. వేళకు సమకూడనిచో విసిగికొందును. ఆమె వట్టి యటవిక స్త్రీ. ఇంచుమించుగా దిగ్భ్రమల కలది. ఆమెకు నవ్వు తెలియదు. నేను విఱుగఁబడి నవ్వినచో నిశ్చేష్టపోయి చూచును. నా ధరించిన

వస్త్రము లామెకు విచిత్రముగాఁ గనిపించును. ఆమెయందు స్త్రీత్వ మున్నది. అచ్చటనున్న పరిస్థితులు, మహామంత్రీ! వానినిఁ గూర్చి యింకొక గ్రంథము వ్రాయవలయును. ఆమె వృద్ధురాలా? కాదు. నిత్యపర్వత నివాసమువలన దృఢమయిన శరీరయష్టిగలది. సర్వజంతు సహజమయిన కామవాంఛ యామెయం దున్నది. ఆమె పరపురుషు నెఱుఁగదు. స్వపురుష పరపురుష జ్ఞానము లేదు. తన శరీరము నగ్నముగ నున్నదన్న సంగతి యామె యెఱుఁగదు. నా కచ్చట నుండుట యొక విచిత్రమయిన యనుభూతిగా నుండెను. అతిఁడీర్ష్య యెఱుఁగడు. ఈమె లజ్జ యెఱుఁగదు. ఎఱుఁగదనఁగా లౌకికములయిన యార్యా లజ్జ లెఱుఁగరు. జీవనిష్ఠమయిన వాని నెఱుఁగుదురు. నేను వెలిదోసను పర్వతము మీఁద వెళ్ళినప్పుడెల్ల నాల్గయిదు దినములుండు చుంటిని. నేను బయలుదేరి వత్తు ననఁగా నామె నన్ను రానిచ్చెడిది కాదు. నా చేయిపట్టుకొని లాగెడిది. నన్నుండుమనెడిది. నా కడ్డము వచ్చెడిది. తన శరీరము నా శరీరముతో సంయోజనము చేసెడిది. నే నింక రెండు దినములుండెడివాఁడను. ఒకప్పుడు నేనా కొండమీఁద నుండఁగా హఠాత్తుగా నైదుగురు రాజులు నైదుగురు మంత్రులు నైదుగురు సేనానులు తింతాక రాళును వెంటఁబెట్టికొని వచ్చిరి. వా రిద్దఱు వెలిదోసను లనుఁ జూచిరి. ఆ స్త్రీనిఁ జూచిరి. వారు నన్నుఁ బ్రశ్నించిరి. నే నున్నదంతయుఁ జెప్పక తప్పక వచ్చినది. కరాళుఁడు నేల చూపులతో నిలఁబడిపోయెను. వాలిదోసను చెప్పెను.

అందులో నొక సేనాపతి యున్నాఁడు. వానికి నడవి దున్న పోతునకు భేదము లేనేలేదు. నిజముగాఁ బరిశీలించి చూచి నచో వన మహిషము వానికన్న నయము. వాఁడు వెలియోన ను భార్యనుఁ జూచి యామె యౌవన కఠిన శరీరములనుఁ జూచి యేమియుఁ దెలియని యమాయకత్వపు మాటలనుఁ జూచి వట్టి నవ్వులనుఁజూచి యామెను దొంగిలింపవలయునని నిశ్చయించికొనెను. ఆ యభిసార రాజ్యముయొక్క రాజునకు తింతాకరాళుని యీ రహస్యగోపనము విన్న వెంటనే కోపము వచ్చి వానితల నఱకెను. మహామంత్రీ! ఆ వెలియోనసులుగాని పెద్దవాని భార్యగాని కత్తితో నొకని తల నఱకుట యెట్టిదో యెఱుఁగనివారు. వారు ముగ్వురు నచటినుండి పాఱి పోయిరి. ఆ సేనాపతి యామె వెంటఁ బఱు వత్తెను. నేను దక్కినవారి నుపశమింపఁజేసి బైటికిఁ దీసికొని వచ్చితిని! వారు తింరాకరాళుని యుద్యోగమును నాకిచ్చిరి. నేనిచట నీ పర్వత మార్గరక్షాధికారిని. నే నెవరిమీఁదఁ బ్రతిక్రియ తీర్చికొన నెంచి కొన్నానో వారందఱిప్పుడు నాచేతిలో నున్నారు. నేను వారి నూరకే చంపఁదలఁచి కొనలేదు. కవలగుఱ్ఱము రావలయును. అప్పుడు నా ప్రతిక్రియ - మిత్రమా.

## ౧౨

మగధరాజ్య మహాసేనాపతి యుపవర్షులవారికి. నేను దమరికీ జాబు వ్రాయుట తమరికిఁ గొంత యచ్చెరువుగాఁ గనిపించవచ్చును. నాకు నితని కేమి సంబంధము? ఇతఁడు తొలినాఁడు సైన్యములో నొక చిన్నయుద్యోగి. అపుడు మహాసేనాధిపతియైన పుష్యమిత్రునకు సమీప బంధువుకావచ్చును. నే నితనితో నెన్నఁడును మాటాడలేదు. ఈ వ్రాసిన విషయమెచ్చటనో మొగలుపెట్టి యెచ్చటనో ముగించినట్లున్నది. అని మీ రనుకొనవచ్చును. నేను కొన్ని దినముల క్రింద మహామంత్రియైన నారాయణభట్టుగారి కొక లేఖ వ్రాసితిని. తమకిపుడు వ్రాయుచున్న విషయము దాని ననుసరించి యుండును. ఐనచో నేనీ లేఖనుఁ దీసికొనిపోయి నారాయణభట్టున కీయవలయునా యని మీరనుకొందురు. ఈయవలయు నదియే నా యుద్దేశ్యము. ఇంకను నేను మఱికొన్ని లేఖలు వ్రాయుదును ఈసారి పుష్యమిత్రు లాచరించు నశ్వమేధ మహాధ్వరమునకుఁ బ్రధానర్త్విక్కుగా నర్చింపఁబడ నియమింపఁబడియున్న మేధావి భట్టులకు వ్రాయుదును. మఱియొక లేఖ మహారాజుగారికే వ్రాయుదును. ఈ నాల్గులేఖ లొక్కసారి చదివికొనినఁగాని నా చరిత్రము సంపూర్తిగా నవగతముకాదు. నేనీ లేఖ తమకు వ్రాయుటలోఁ గొంత యర్థమున్నది. చైత్ర శుద్ధ పూర్ణిమనాఁ డశ్వమేధము ప్రారంభింపఁబడును. ఆ

నాఁడు సంగ్రహాణేష్టిజరపి యశ్వముయొక్క నాల్గుపాదము లందు హోమముచేసి దానిని విసర్జింతురు. తదశ్వరక్షణార్థము యువరాజయిన యగ్నిమిత్రుఁడు పంపింపఁబడును. అగ్నిమిత్రునకుఁ దోడుగాఁ దమరినిఁగూడ మహారాజు పంపించును. తమరిప్పుడు మగధరాజ్య మహాసేనాపతి పదవియం దున్నారు. తమ రశ్వరక్షణానుయాయులయి వచ్చినపుడు తమరు యాత్రాసంవత్సరమునందు మగధరాజ్య సేనాపతి స్థానమున నీలాంజనభట్టును నిర్ణయించి రావలయును. ఈసంగతి నేను వ్రాసితినని మహారాజులతో విన్నవించవలయును. ఈయశ్వమేధయాగము స్వాహంకారముచేత నే ననుకొనుచున్నాను గదా మద్బుద్ధి జనితమని, బుద్ధి జనితమనఁగా బుద్ధిగత గుణహేతుకము కావచ్చును. దోషహేతుకమునుఁ గావచ్చును. అచటి కథలన్నియు తమకు విదితములే కనుక (శ్రీ) పుష్యమిత్రులవారి యశ్వము దూరదేశమునఁ జిత్రవధ కావింపఁబడ్డదన్న సంగతియు మీకుఁ దెలిసియుండవచ్చును. దానికవలనే రేపు మేధీయాశ్వము కాఁబోవుచున్నది. ఈ మహాయజ్ఞము తద్ధింసా ప్రతిక్రియారూపముగా సాగుచున్నది. మీరశ్వము వెంట వచ్చుచున్నారు గావున మేధ్యాశ్వము పలుతావుల సంచరించి యవనరాజ భూములనుఁ గూడఁ జొచ్చును గావునఁ జొచ్చినపుడు సామాన్యమయిన నడక నడువదు గావున, యవన భూములయందు – దాని రక్షణా విధాన మన్య విధముగా నుండును గావునఁ, దమకు నేను గొంత మనవి చేయవలసియున్నది. సామాన్యముగా నర్చితమయి వదలిపెట్టఁబడిన మేధీయాశ్వము దానిదారిన నది పోవుచుం

డును. రక్షకులు వెనుక వచ్చుచుందురు. పరాక్రమవంతులు దానినిఁ బట్టుకొందురు. ఎవరు తమ పరాక్రమము ప్రకటించుటకుఁ బట్టుకొందురో వారితో యుద్ధము జరుగును. ఎవరాయశ్వమునుఁ గోసికొని తినుటకుఁ బట్టుకొందురో వారితో యుద్ధమేమి ? అశ్వము వధింపఁబడినచో నది యజ్ఞమునకు మహావిఘాతము. మఱల యాగము సమారంభింపఁబడవలయును. మఱల సంతరణముఁ గ్రొత్తయే. యవనులు క్షత్రియులు కారు. వారికి మీసంప్రదాయములు తెలియవు. మీ సిద్ధాంతములందు వారికి విశ్వాసము లేదు. విశ్వాసము లేకపోవుటయే కాదు. వానికి విరుద్ధములయిన భావములు కలవారు వారు. మీ రేకార్యమందు నియమింపఁబడఁ బోవుచున్నారో యా కార్యమునందు మీకు సాయము చేయఁ బోవుచున్నాను. యవనదేశమునందు మీ యాగాశ్వము వధింపఁబడి, భుజింపఁబడకుండ, నేను రక్షింతును. దాని రక్షణము నేనెట్లు చేయుదునో దానికి నేనొక పదకము వేసికొంటిని. ఆ పదకమును నేను మీకు వ్రాయుటలేదు. పరమేశ్వరుని యనుగ్రహమున్నచో నా పదకము కొనసాగుటకుఁ గొన్ని యూహలు నాకుఁ గలిగినవి. దాని మార్గము నాకు స్ఫురించినది. దాని విషయము తమకు వ్రాయుచున్నాను. అందుచేత నచ్చముగా దీనితోఁ దమకు సంబంధములేదని చెప్పరాదు. నేను నారాయణభట్టుగారికి వ్రాసిన లేఖ తమరును మహారాజుగారును చిత్తగించియే యుందురన్న యూహతో నిది వ్రాయుచుంటిని. ఆరీతిగా రింతాకరాజుని వధ జరిగిన తరువాత నా యవనరాజులు నన్నతని యుద్యోగము

నందు నియమించిరి. నే నింటికి వచ్చితిని. ఇల్లనఁగాఁ గరా ఖుని యిల్లే. అది నా యిల్లైనది. పూర్వమే నేనతని యిం టిలో నుండుచుంటిని. ఇప్పుడతని యాస్తియు నాదియైనది. అచట నాస్తి యన్నది యేదియులేదు. కొన్ని త్రాళ్లు ప్రోవు పెట్టిన తల దాచికొనుటకుఁ దావయిన యొక ప్రదేశమే గృహానిర్దేశమున సాగుచున్నది. రెండు మేకలు కలవు. నా దున్నపోతు కలదు. పదిబల్లెములు కలవు. రెండు ఖడ్గములు కలవు. ఒక గుఱ్ఱము, దానిపైని జీను, దానికళ్లెము. ఇవి మాత్రమే యాస్తి. దానికి నేనధికారిని. ఇంటికి వచ్చిన తరు వాత నాకొక విచిత్రమయిన సన్నివేశము తటస్థించినది. రింతునిభార్య పేరయేషా. ఆమె కూడ నా యాస్తిలోని భాగముగా నే ననుకొనవలసిన స్థితివచ్చినది. అతని తక్కిన యాస్తికి నేనధికారినైనచో నామెకుఁ గూడ నే నధికారి నన్నట్లు! నే ననుకోక తప్పక వచ్చినది. ఆమెనుఁ గుఱించి, కొంత మనవిచేసెదను. ఆమె వయసు పాతిక యేండ్లకు మించి యుండదు. ఆర్యావర్తమునఁ బాతికయేండ్ల స్త్రీయనఁగా నలుగురైదుగురు పిల్లలతల్లి కావచ్చును. ఆమెయందు యౌవ నము ప్రొద్దు వాటారుఁ బోవుచున్నదన్న ట్లుండవచ్చును. ఇచట నట్లుకాదు. ఇచట నలుఁబదియేండ్ల స్త్రీకూడ మంచి నడియౌవనములో నుండును. ఆమెతండ్రి ధనవంతుఁడు. వారిది గొప్ప కుటుంబము. ధనవంతుఁ డనఁగా నతనికొక నంద గొఱ్ఱె లుండును పాతిక ముప్పది గుఱ్ఱము లుండును. వాని యింటిలో ముప్పది నలుఁబది ఖడ్గములుండును. వంద బల్లెములుండును. ఒక రెండు చిన్నపర్వతముల నడుమనున్న

కొంత వైశాల్యముగల మేర వానియిల్లు, వాని దొడ్డిగాఁ బరిగణింపఁబడుచుండును. ఇచట ధనవంతుఁడన్న శబ్దమున కర్థమిది. అతఁడు ధనవంతుఁడే కాదు, బలవంతుఁడును. వానికిఁ బదిమంది కుమారులు. కొడుకులు పదిమంది యనఁగా వానికిఁ బది ఖడ్గములున్నవని యర్థము. పదిమంది కటారికాండ్రు కలిసి యొకపని చేయుటకు బయలుదేరుదు రని యర్థము. అతఁడు బలవంతుఁడు. ఈమె వాని చివర సంతానము. ఈమెకుఁ బదిమంది యన్నగారలు. ఆ పదిమందియు నీమె చెప్పిన ట్లాచరింతురు. ఆ పదిమంది యన్నచో నీ యభిసార దేశమున నందఱికి భయము. ఆమె యంత బలవంతురాలు. తానంత బలవంతురాలనని యామెకుఁ దెలియును. అది మఱియుఁ బ్రాణములమీఁదికిఁ దెచ్చు విషయము. కింతుఁడు తొలుత నీమెను వరించెను. కింతుఁడు వరించెననఁగా నదియొక్క గొప్పదశగా నాదేశములో నెన్నికొనవలయును. అతనిచేతిలో నైదుగురు యవన రాజులు నుండిరి. అతని యధికారములో నిచ్చట నలుఁబదిమంది కటారికాండ్రుండిరి. అతఁడు సులభముగా వేయిమంది రౌతులను సమకూర్చఁగలఁడు. దోచఁగలఁడు. ధనము నెత్తికొనిరాఁగలఁడు. అట్టివాఁడొక బాలికనుఁ బరిణయమాడ నెంచినచో నా బాలిక యొక్క తలిదండ్రు లెగిరి గంతులేయుదురు. కాని యయేషా తండ్రియు సోదరులును వాని సంగీకరించలేదు. దీనినిఁబట్టి యయేషా తండ్రియొక్క బలమెట్టిదో యామె సోదరులు పదిమంది యెట్టివారో గ్రహింపవచ్చును. కరాళుని క్రిందనున్న నలుబదిమంది కటారికాండ్రు అయేషా

సోదరులయిన పదిమందిమీఁదికిఁ బోయినచో వారిలో నొక్కఁడును దిరిగిరాఁడు. వారయోషా నెవ్వరికో యిచ్చిరి. ఆమెకు భర్తయైనవాఁ డెట్టివాఁడనఁగా సింహము దారి నెంటఁ బోవుచుండెను. వాఁ డా పార్శ్వస్థ గిరిశేఖరమునుండి, దానిపైం దటికొక జాతిని దొర్లించును. అది తలయెత్తి చూచును. అది వాని కన్నులలోఁ జూచినంత వీనితో మనకెందుకని యా మృగరాజు తొలఁగిపోవును. అది వాని యాకారవిశేషము. అందుచేతఁగూడ తింతాకరాళుఁడు తా నయోషానుఁ గోర లేదు. ముందు కలహాకారణము నడచుచుండును. వెనుక దానిభర్త వచ్చుచుండును. ఈ దేశములో జలయుద్ధములని కొన్ని జరుగుచుండును. ఆ జలయుద్ధములు మిక్కిలి భయంకరములయినవి. ఇచట నీరు దొరుకదు. సర్వవిరోధములు కొండలమీఁదనున్న నీటి దొరువులవద్దనే ప్రారంభమగును. అందుచేత నీయభిసారదేశపు రాజు జలయుద్ధముల నివారించుటకుఁ దీవ్రమయిన శిక్షలు వేయును. ఈ యయోషా భర్త యొక జల యుద్ధమునకు హేతువని నిర్ణయింపఁబడుటచేత, వాఁడు సంహరింపఁబడెను. వ్యక్తి యెంత బలవంతుఁడైనను రాజాజ్ఞ ముందు వానిబలము పనికి రాదు. వాని యనంతరమున నయోషా తింతాకరాళుని భార్య యయ్యెను. దానితో తింతాకరాళుఁడు మహాబలవంతుఁ డయ్యెను. వానిని దేటి పాటఁజూచుటకు వీలులేదయ్యెను. తనరు మత్పూర్వలేఖఁదిలకించినచోఁ గరాళుని వధ యెట్టి పరిస్థితులందు జరిగెనో తెలియఁగలదు. అచటఁ గనుక నా సేనాపతి వానిని సంహరింపఁ గలిగెను. ఇంకొకచోట నది

సాధ్యమయ్యెడిదిగాదు. మహాసేనాపతీ! వాఁడు బ్రదికియుం డఁగా నంత బలవంతుఁడు చనిపోయిన తరువాత నంత బల హీనుఁడు. ఇది చాల విచిత్రమయిన విషయము. బ్రదికి యుండఁగా వానికెంతో బలగమున్నది. ఆ బలగమును జూచి వాని శత్రువులు భయపడుదురు. శత్రువులు వానిమీఁదికి రారు. వచ్చినచో బలగమంతయుఁ జుట్టుకొనును. వాఁ డేకాంతమున వధింపఁబడును. ఎవఁడో యుపాంశు వధచేయును. తరువాత నా బలగమేమియుఁ జేయదు. వాని వధకుఁ బ్రతీ కారముండఁదు. ప్రతీకారమున కెవ్వఁడునుఁ బూనుకొనఁడు. పూనుకొన్నచోఁ దానికెంతయో ప్రయత్నము కావలయును. బ్రదికియుండఁగా వానికాపద రాఁబోవుచున్నచో వాని నాది కొనఁబోవు వందమందియు దైవముయొక్క వ్యతిరేకముచేత నాఁడు చనిపోవుట జరిగినచో వాఁడు వధింపఁబడుట జరిగి నచోఁ దద్వధకుఁ బ్రతీకారము చేయుటకు నా వందమందిలో నొక్కఁడయినను రాఁడేమి? ఇది సృష్టిలోని యొక విచిత్ర విషయము. తింతాకరాళుని స్థితి యట్లైనది. నా కిప్పటికిని నాశ్చర్యము గొలుపుచున్నది. బ్రదికియున్నప్పటి వాని బల మెంత? ఇప్పుడా బలమంతయు నేమయినది? వాఁడు బ్రదికి యుండఁగ వానికాపద రాఁబోయినచో నాయాపద వారిం చుట కంతమంది మూఁగుటయేల? వాని యా యాపద గతార్థ మయినచో నొక్కఁడును ముందడుగేల వేయఁడు? ఇది జీవి తమునందలి యొక రహస్యము. సర్వ మానవజాతియందు రెండు వృత్తు లుండును. ఈ వృత్తులు జీవనిష్ఠమయి యుండును. ఒకటి లోవృత్తి. రెండవది వెలివృత్తి. సర్వ జీవలోకము వెలి

వృత్తియందు నిష్ఠమైయున్నట్లు కనిపించును. వ్యావహారిక ముగఁ దనిష్టమయి యుండును. అంతర్వృత్తి వానికిఁ దెలియకుండ నిత్యజాగ్రదవస్థాభూతమయి యుండును. అది జాగ్రత్తినీ యందున్న విషయము. వానికిఁ దెలియదు. ఇది జీవ సంపుటియొక్క లక్షణము. మనుజులు చనిపోదురు. బంధువులు మరణింతురు. ఆత్మీయులు పరతులగుదురు. జనము దుఃఖించును. ఆ దుఃఖములోననే మృత్యువు నిత్యమైనదన్న విషయము వారికిఁ దెలియును. ఆ తెలివియే వారికుపశమనము కల్గించును. లేనిచో బంధుమరణము ప్రాపించిన జీవుఁడు తానును మరణించవలయును. వానికిఁ దెలియకుండ మానవ లోకమున కతీతమయిన యొకస్థితి యేదో యున్నదని దాని మీఁదఁ దనకధికారము లేదని సర్వజీవులు దానికిఁ దలయొగ్గవలసినదేయని జీవకోటియొక్క శక్తి యింత పరిమితమని వానికొక తెలివిగలదు. మనుజుఁడు బ్రదికియున్నంతసేపే వాని జాగ్రత్త. వాని రక్షణ ప్రయత్నము. వాని యాశాదులను నిర్వహించికొనుటకుఁ జేసెడు ప్రయత్నము. మృత్య్వనంతరకాలమున నెవ్వఁడు నేమియుఁ జేసెడిదిలేదు. దానికి సర్వలోకము వశము. ఈ సంగతి తెలియని జీవుఁడు సృష్టిలో నుండఁడు. తెలియుట రెండు విధములు గదా. స్వతస్సిద్ధముగా లోపల భాసించుట యొకటి. విచారణా పర్యవసితమయి మనోదఘ్నమై యుండునది రెండవది. లోకము రెండవ దానినే తెలియుట యనుకొనును. దీనినే జ్ఞానమనుకొనును. యథార్థమయిన తెలియుట యూంతరమునందున్నది. మనుజుని ప్రవర్తనస్థూలమయినది. సర్వ జీవలోకమునకు సంబంధించినది.

తదనుబద్ధమయి యుండును. లౌకికమైనది. యాహార సంపాద
నాదిక విషయమయినని. రెండవదానిననుసరించి యుండును.
ఒకఁడు చనిపోయినంతనే వానినిఁ గూర్చిన విచారణ పర్యవసిత
మయినది. వాని బలగము వాని కక్కఱకు రాదు. దానితో
నా ప్రయత్న ముపరమింపఁ బడినది. వాని మృత్యువునకుఁ
బ్రతీకారము బయలుదేఱినదనఁగా యథార్థమునకుఁ బ్రతీ
కారము మృతుఁడైన వానికి సంబంధించినది కాదు. బ్రదికి
యున్న వారిలో నొకానొకని యహంకారమునకు సంబంధించి
నది. ఈ పట్టుదల పీనిది. తదనుబంధిగాఁ బైకి భాసించు
చున్నను, నిజానికది వేఱొక పురుషుని క్రోధాదిగుణ సామగ్రి
సంజనితమయినది. అయ్యా! ఉపవర్షా! ఈ సంగతి నేనింతగ
నెందుకు వ్రాయుచుంటిననఁగా నేను బుష్యమిత్రుల యశ్వ
మును దొంగిలించి వచ్చితిని. అది సంహరింపఁబడినది. దానికి
నేను బ్రతీకారమునుఁ జేయ వాంఛించుచున్నాను. ఆ యశ్వము
యొక్క జీవుఁడు మత్ప్రతీకారార్థి కాఁడు. ఈ ప్రతీకారబుద్ధి
నాయందే పుట్టినది. దీనికి నా జీవలక్షణమునందుఁ గల యొక
విచిత్రమయిన సంస్కారము హేతువు. దీని నట్లుంచి కింతా
కరాళుని మృతినిఁ గూర్చి నేనింత విచారించుటకుఁ గారణము
వాని భార్యయైన యహేషా. వాని యాస్తితోఁ బాటు తాను
కూడ నాకు సంక్రమించునని యనుకొని తానట్లు ప్రవర్తించు
చుండుట నన్నీ విచార సాగరమునందుఁ ద్రోసినది. నేను తేవు
మరణించినచో మరణానంతరమునఁ దత్పూర్వ భర్తలిద్దఱు
నట్టివారో నేను నట్టివాఁడనే. ఇప్పుడు నాయందామె స్వత్వ
మును వెలార్చుచున్నది. లౌకికమైన యీ స్వత్వాభిమానము

బ్రదికియున్నప్పటి వేళకు సంబంధించినది. ఇది లౌకికమునకుం బారలౌకికమునకు నున్న భేదము. ఈ రెంటికి ముడివెట్టి వైదికమతము మృతభర్తృకయైన స్త్రీ తన్మృత భర్తృనిష్ఠమైన మనస్సుతో నుండవలయుననుట పరలోకమునుం దెచ్చి యిహలోకముతో ముడివెట్టుట. ఈ ముడి నెఱుంగని మ్లేచ్ఛులు బ్రదికియున్నప్పటి స్థితిని మాత్రమే పరిగణించుచు వాని యనంతరమునం దిం కొకం డున్నట్లు ప్రవర్తించుచున్నారు. వీరగ్న్యుపాసకులు కారు. అగ్ని యనంగా నేమో వీరికిం దెలియదు. లౌకికమయిన లోకవస్తు దహనశీలమయిన యన్నా దిక్లిన్నతకు సంబంధించిన యగ్ని నే వా రెఱుంగుదురు. సృష్టి దేనినుండి జన్మించినదో యా వైశ్వానర స్వరూపము వారికిం దెలియదు. తమరునుం బండితులే. దానినిం గూర్చి నే నెక్కువ విచారింపనక్కఱ లేదు. తమరికిం జెప్పనక్కఱలేదు. నే నిట్టి క్లిష్టపరిస్థితి యందుం జిక్కుకొంటిని. నా పరిస్థితి మనవి చేయు చుంటిని. దేవతారూపమైన యగ్నికి సంబంధించని యొక స్త్రీ పురుష కామవ్యర్థ వ్యూహమునందు నేనిపుడు తగులొ్కంటిని. ఆమెయందు నే ననురక్తుఁడను గాను. అనురాగమన్న మాటకు యవనులయం దర్థములేదు. రంజిధాత్వర్థము దేని ననుస రించి యున్నది? పరలోకములు తదనుబంధి కర్మలు మొదలయిన వాని ననుసరించి యున్నప్పు డది యనురాగము. ఇచ్చటి యనూపసర్గ నిరర్థక మయినది. దాని కేయర్థమును లేదు. ఔపచారికమైన యర్థముకూడ లేదు. కామము ననుసరించియున్నదని యర్థము చెప్పినచో నదియే కామ మదియే యనురాగము. ఇట్టిది మ్లేచ్ఛభావము. ఆమెయందు

నా కనురాగము కలిగినదని మనవి చేయుచున్నాను. నేను ప్రతి క్రియాపరినిష్ఠిత బుద్ధిని. తత్ప్రతిక్రియ యామెను నే ననుసరించినచో నాకు సుసాధ్యముగునట్లు కనిపించుచున్నది. తత్ప్రతిక్రియానురాగము నాకుఁ గలిగినది. ఇదియొక క్లిష్ట పరిస్థితి. ఆమె తాను నాయాస్తిలో భాగమనుచున్నది. నేను కాదనుటకు వీలులేదు. కాదంటినో నా నెత్తిన వంద కత్తుల బలముగల పది కత్తులు పడును. నే నింతవఱకు యువనుఁడ నైతినో కానో నాకుఁ దెలియదు. ఇప్పుడు మాత్రము యువ నుఁడను నిస్సందేహముగాఁ గాఁబోవు చున్నాను. ఆమె తాను నా యాస్తిలో భాగమని యనును. స్వామియైనవాఁడు తన యాస్తియందుఁ దాను మమకారము కలవాఁడై యుండ వలెను. నాయందు దా మమకారము కలిగించుటకు నామె కొన్ని విచిత్రములయిన ప్రవర్తనలు చేయుచున్నది. ఆమె యీ దేశమునందలి కొందఱు స్త్రీలకంటె నధికమయినశక్తులు కలది. ఆమె తొలుతటి భర్తనుఁ దా నామె సులభముగా రక్షించుకొనఁ గలిగెడిది. ఆమెశక్తి విలక్షణమయినది. ఆమె గొప్ప మేధావతి. తత్పూర్వ భర్తలిద్దఱినిఁ గూడ నామె ప్రేమించలేదు. వా రామెను వాంఛించిరి. ఆమెను వాని తండ్రి మొదటివాని కిచ్చెను. కరాళుఁ డామెను మోహిం చెను. ఆమె వారి యిద్దఱిని వాంఛింపలేదు. ఆమె వారిద్దఱిలో నొక్కరిని వాంఛించినను వాఁడంత సులభముగా వధింపఁ బడఁడు. మొదటి వానిని రాజాజ్ఞ యేమియుఁ జేయలేదు. రెండవవాని విషయములోఁ బ్రతీకార వాంఛకూడఁ బుట్ట లేదు. ఆమెయొక్క మహాప్రతిభయు బుద్ధి విశేషమును

మేధావి భట్టునకు వ్రాసెడి యుత్తరములో వ్రాదసెను. అప్పు డామె నన్ను యవనునిగా నెట్లు చేసినదో వ్రాయుదును. నే నిచట యవనుఁడను. యవనుఁడను గాను. నాస్థితి గోడమీఁది పిల్లివాటముగా నున్నది. ఆమె దిన దినము తన శక్తినిఁగుఱించి తన ప్రతిభనుఁ గుఱించి తన యఘటన ఘటనా సామర్థ్యమును గుఱించి నాతోఁ జెప్పుచుండును. నే నివి విని యూరకుందును. ఱింతాకరాళుని మృతికిఁ దాను బ్రతిక్రియయే చేయఁదలఁచి నచో నెట్లు చేయునో నాకుఁ జెప్పెను. అందులో సందేహము లేదు. ఇది యిట్లుండఁగా నామె యందనేకములయిన విద్యలు కలవు. ఆమె కనేకములయిన యోషధులు తెలియును. ఆమెకుఁ గొన్ని మంత్రములు తెలియును. ఈ దేశమునం దిన్ని మంత్రము లుండునని నా కిదియే మొదటిసారి తెలి యుట. నే నిదివఱకు విన్నాను. కాని శాబర మంత్రములకుఁ గూడ నింత శక్తి యుండునని నాకుఁ దెలియదు. అదియట్లుంచి యామెయందు నేనొక విద్య చూచితిని. నా కాశ్చర్యము వేసినది. నే నామెయందలి యీ విద్యను తెలిసికొని తనయం దనురాగమునుఁ బెంచికొన వలయునని యామె యుద్దేశము. నిత్య మామె వెంట నొక శ్వాన ముండును. ఇచ్చటి కుక్క లనఁగా మన గ్రామములయం దుండెడి శ్వానములు కావు. వానికిని వీనికిని సంబంధ ముండదు. ఒక బలిసిన క్రూర దృష్టులుగల సృగాలముకాని, చిన్న తోడేలుకాని, యెట్లుం డునో యీ శ్వాన మట్లుండును. అది భయంకరమయిన జంతువు. దానిని హింస్రమృగములుకూడ నేమియును జేయఁ జాలవు. అవి గ్రామములలోఁ దిరుగవు. నిశలయందు వేటాడు

చుండును. ఆ కుక్క యామె వెంటఁబడి తిరుగుచుండును. దానికే యచ్చటి జన మామెనుఁ జూచి భయపడుచుండురు. ఒక కుక్క యీ దేశమున నొక స్త్రీ వెంటఁబడి తిరుగుచున్న దనఁగా నామె మంత్రకత్తెయని యర్థము. ఆమెవంకఁ గన్నెత్తి యెవ్వఁడునుఁ జూడఁడు. ఆమెనుఁ బెండ్లియాడిన తరువాత తింతాకరాళుని గౌరవ మీ దేశమునందుఁ బెఱిగినది. ఆమె తన బిడ్డల నేమిచేసి పోవునోయని తింతాకరాళుఁడు పడ్డ భయమునకు మితిలేదు. అతఁడు బ్రతికి యుండఁగా భార్య నేమి యనుటకైన భయపడెడివాఁడు. నేనది యతని కామెయందుఁ గల ప్రేమ యనుకొంటిని. ప్రేమకాదు. భయమని నాకిప్పుడు తెలిసినది. ఆమె యీ పిల్లల నిద్దఱిని నిన్నాళ్ళేందుకు బ్రదుకనిచ్చినదో నాకుఁ దెలియలేదు. తరువాతఁ దెలిసినది. కరాళుఁడు బ్రదికి యుండఁగనే నామీఁద నామెకుఁ బ్రేమ కలదు. నేను పిల్లలను దయగాఁ జూచుచున్నాను. ఆ పిల్లలనుఁ దా నేమయినఁ జేసినచోఁ దన్ను నేను బ్రేమించనేమో? నా ప్రేమకుఁ దాను జెడిపోవునేమో? ఈ భావముతో నామె యీ పిల్లల నేమియుఁ జేయలేదు. అట్లయ్యుఁ గరాళుఁడు బ్రదికియుండఁగా నామెకు నాయందుఁగల ప్రేమను వ్యక్తీకరించలేదు. మనసులోననే దాచుకొన్నది. దున్నపోతుతో నేను జేసెడు వ్యవసాయమునకు సాయపడుచు వచ్చెడిది. ఆ సాయపడుట సామాన్యమయిన గృహస్థధర్మముగా మానవ ధర్మముగా భాసింపఁ జేసినది. కాని నాయందుఁ దనకుఁగల వలపుగఁ గనిపించనీయలేదు. కరాళుఁడు మరణించిన తరువాత నీభావము లన్నియుఁ బైటఁబెట్టినది. ఆమెయం దింకొక

వైచిత్రికలదు. నాయందామెకు వలపుకలదు. కరాళుని నామె సులభముగా వధించఁగలదు. అట్టి యప్రశస్తపుఁబని చేయలేదు. ఈ లోకమునందున్న యొకానొక జీవియొక్క లక్షణము దురవగాహముగా నుండును. ఏజీవియొక్క నియమ మా జీవిదే. స్వయం సిర్ణీత సూత్రములచేత నాజీవి తన బ్రదుకుఁ దాను బ్రదుకుచున్నది. పెఱవానియందు వలపు కలదు. పెండ్లియాడిన వానియందు లేదు. తనభర్త నామె సుల భముగాఁజంపఁగలదు. వానినిఁ జంపదు. వానితోడనే సంసా రముచేయును. వాని యనంతరమునఁ దాను వలచిన వాని తోడి కూఁటమి సాధ్యమయినచో వానిని వరించును. ఇది యేమి న్యాయము? ఇది యేమి నియమము? ఈ నిబం ధనలు నెచ్చటివి? గొప్ప నాగరకత లేనిజాతి. శ్రుతులు లేవు. స్మృతులు లేవు. ధర్మములేదు. సంఘ వ్యవస్థ లేదు. చంపినచో శిక్షలేదు. ఆ శిక్షనః వేయి విధములుగాఁ దప్పించి కొనవచ్చును. అట్టి స్థితిలో నా భర్తతోడనే మనికిగా నుం డుట యీ జీవియొక్క యొకానొక యున్నత భావమని చెప్ప కుండుటకు వీలులేదుగదా. కరాళుని పిల్లలిద్ద ఱొకనాఁడు సాయంకాలము నింటిముంగిట నాడుకొనుచున్నారు. వాని తల్లి దుంపలనుఁ దెచ్చుట కడవిలోనికిఁ బోయినది. నేను నా యుద్యోగమందు నిత్యముగ నుండనక్కఱ లేదు. నాలైదు దినముల కొకసారి పోయి చూచివచ్చుచుండుటయే నా ధర్మము. నే నించుమించుగ నెప్పుడు నింటివద్దనే యుందును. ఆనాఁడు సాయంకాలమయినది. అస్తమింపఁ బోవుచున్న

సూర్యుని యెఱ్ఱవెలుఁగులచేతఁ గొండమీఁది చివురాకు లెఱ్ఱ వడి యా యెఱ్ఱఁదనముయొక్క డాలు మా యింటిముంగిటి తెల్లని ఱాళ్ళమీఁదఁబడి యా ఱాళ్ళు విదలించిన యెఱ్ఱని కాంతులచేతఁ గరాళుని పిల్లల జుత్తెఱ్ఱఁ బడినది. అయేషా మొగమెఱ్ఱఁ బడినది. నేలయంతయు బుక్కాయి చల్లినట్లున్నది. నేనొక ఱాతిమీఁదఁ గూర్చుండి నా ఖడ్గమునుఁ బరిశీలించుచున్నాను. ఒక యనుపముక్కతో దాని వాదఱను రాచుచున్నాను. ఆమె దూరముగ నింకొక ఱాతిమీఁద గూర్చున్నది. ఇంతలో నామె నోటినుండి యొకపాట వెలువడుచున్నది. ఆ పాట నడకయే విలక్షణముగా నుండెను దాని గమనము గుఱ్ఱము ఖదనుత్రొక్కిన ట్లుండును. చరణాంత మొక తీవ్రమయిన యూపుతో సాగుచున్నది. ఆ గుఱ్ఱము వెనుక కాళ్ళతోఁ దన్నినట్లున్నది. నేను దలయెత్తి చూచితిని. ఆమె యెదుటనున్న కుక్క నాట్యమాడుచున్నది. ఆమె చరణము పాడుచుండఁగా నది యడుగులు వేయును. చరణాంతమన్నప్పుడు వెనుక కాళ్ళతోఁ గాలితోఁ జిమ్మును. ఆమె మఱియొక్క చరణమందికొనును. ఆ శ్వానము మున్ను తూర్పుముఖముగా నున్నది. దక్షిణదిక్కుగాఁ దిరుగును. ఆమె చరణము మార్చినపుడెల్ల శునకము దిశను మార్చుచున్నది. ప్రతిచరణాంతమునందు వెనుకటి కాలెత్తి గాలిలోఁ దన్నుచున్నది. కీర్తన యైపోయెను. ఆమె తలయెత్తి నావంక చూచినది. నే నచ్చెరువుతో నామెవంకఁ జూచుచున్నానని యామె గ్రహించినది. నావంక జూచినది. నవ్వినది. నేను 'ఆ కుక్కకిట్లు నేర్పితివా' ఆమె 'నేర్పలేదు.' ఈ పాట

పాడఁగా నేజంతువయిన నిట్టే చేయును. నే నొకసారి యడవిలోని కొంటరిగాఁ బోయితిని. ఒక భల్లూకము నా కెదురయినది. అది నా మీఁదికి రాఁబోయినది. ఈ విద్య నావద్దనున్నదని నాకుఁ దెలియును. నే నీ పాట నారంభించితిని. ముందు కాళ్లెత్తి నా మీఁదికి రాఁబోవుచున్న భల్లూకము ముందు కాళ్ళు వాల్చి నాట్యమారంభించెను. అది నాట్యము చేయక తప్పదు. చరణాంతమునందు వెనుకటి కాళ్లు విదలించక తప్పదు. దానినట్లు చాలసేపు త్రిప్పితిని. చివఱికిఁ బాట నాపితిని. అది యాఁగి నావంకఁ జూచినది. నామీఁదికి మఱల వచ్చినచో నేను మఱలఁ బాట నెత్తికొందునేమోయని యాలోచించి దాని దారి నది పోయినది. నేను 'ఈ పాట నాకు నేర్పెదవా' ఆమె నీకు నేర్పుట యెందులకు ? నేను నీదాననే గదా. నీ వెంటనే యుందునుగదా. నీ వెప్పుడు పాడుచున్నావో నప్పుడే పాడెదను. ఏ యెలుఁగు గొడ్డును నీమీఁదికి రానీయను. నేను 'నీవు లేకున్నప్పుడు నే నొంటరిగా నున్నప్పుడు వచ్చినచో' ఆమె నీవు గుఱ్ఱముమీఁద వెళ్ళెదవు. నీ చేతిలో ఖడ్గముండును. నే నాఁడు దానను. నడచి పోవుదును. నా చేతిలోఁ గత్తియుండదు – నేను – నాకు నేర్పుటకు నీ కిష్టము లేదన్నమాట.' ఆమె 'నా కేమియు నభ్యంతరము లేదు. నేర్పెదను గాని నీవు నీని నేర్చికొని ప్రయోజనము లేదు. నీకది ఫలించదు. నావద్దఁ గొన్ని మంత్రములున్నవని నీతోఁ జెప్పితిని. ఆ మంత్రములు శక్తిమంతము లగుటకుఁ గొన్ని నియమములు కావలయును. ఆ నియమములు పురుషులు పాటించలేరు. చంద్రుఁడు కొఱలేక నిండియున్న రాత్రి క్రొత్తగాఁ

పాతిపెట్టఁబడిన శవమునుఁ బెల్లగించి దానిమీఁదఁ గూర్చుండి యీ మంత్రములన్నియు ననుచుండవలయును. అప్పుడు శవ బంధువులు వచ్చినచో నిన్ను వధింతురు. ఒక్కొకప్పు డా శవమే నిన్నుఁ జంపుటకు వచ్చును. ఆ శవముయొక్క చేతులు లేచి నీ మెడను బిగించును. నీ మనసులోనుండి నీ నోటినుండి యీ మంత్రాక్షరములు వెనుకట సంభవించెనా అచటనున్నది యొక శవముకాదు రెండు శవములు. ఓయి! శత్రువైనవాని నెదిరించి యుద్ధము చేయుటకుఁ గావలసిన ధైర్యసాహసములు వేఱు. శవాదులతో వ్యవహరించుటకుఁ గావలసిన ధైర్యసాహసములు వేఱు. ఒకఁడు శూరుఁడు కావచ్చును. పరాక్రమవంతుఁడు గావచ్చును. ఖడ్గవిద్యా నిపుణుఁడు కావచ్చును. ఈ పాతిపెట్టఁబడ్డ శవమునుఁ బెల్లగించుటకు వాఁడు సాహసింపలేఁడు. వట్టి శవమునుఁ జూచిననే భయపడెదరు. ఆ శవము చేతులుచాచి నీమెడ బిగింపఁబోవు నపుడు ధైర్యమన్నది యుండదు. నీ విట్లు చేయఁగలవా? చేసినచో నీకీ పాటలు నేర్పెదను. ఈ మంత్రములు చెప్పెదను.' నేను 'ఇవి యన్నియు నీ వెచ్చట నేర్చికొంటివి.' ఆమె 'నేను బదిమంది యన్నలకుఁ జెల్లెలిని. అందఱకు ముద్దుచెల్లెలిని. నన్ను మావాండ్రు నా యిష్టమువచ్చినట్లు పెరుగనిచ్చిరి. నే నిచటికిఁ బోవచ్చు, నచటికిఁ బోరాదని లేదు. అందఱకు మాయన్నలనుఁ జూచి భయపడుచుండిరి. నేను విశృంఖలముగఁ బ్రవర్తించుచుంటిని. ఒకనాఁడు మా యూరిలో నొక ముసలిది చనిపోయెను. ఆమె నూరిచివరఁ బాతిపెట్టిరి. ఆమె కిట్టిమంత్రములు వచ్చునని చెప్పికొనెడివారు. మావాండ్రు నన్నిచ్చటి

కయినఁ బోనిచ్చెడివాండ్రుగాని యామె యింటికిఁ బోనిచ్చెడివారుకారు. ఆమెతో మాటాడవలయునని నా కుండెడిది. నా కప్పటికిఁ జిన్నతనము. చచ్చిపోయిన తరువాత మనుష్యులు మాటాడ లేరని నాకుఁ దెలియదు. ఆమె నూరిచివరఁ బాతిపెట్టిరని నాకుఁ దెలియును. అందఱును నిద్రపోయిన తరువాత నాగోతినిఁ బెల్లగించి యామెను బైటికిఁ దీసి యామెతో మాటాడవలయు ననిపించినది. అర్ధరాత్రమునందు నా సోదరులు నా వదినెలు నా తల్లిదండ్రులు నందఱు నిద్రపోవుచుండఁగా నది పండువెన్నెల కల రాత్రి యగుటచేతఁ జలికూడ వేయుచుండుటచేత నే నచటనే పండుకొన్నట్లు నొక చిన్న ఱాయి పెట్టి దానిపైన నా కంబళిగప్పి, నే నామెనుఁ బాతిపెట్టిన స్థలమునకుఁ బోయితిని. ఈ దేశములోఁ బాతిపెట్టుటయనఁగాఁ బైని కొన్ని ఱాళ్లు వేయుట. ఆ ఱాళ్ళకు కొన్ని బరువయిన ఱాళ్ళు కష్టపడి యా ఱాళ్లు దొలఁగించితిని. ఆ ముసలిది పండుకొని యున్నది. ముసలమ్మా! ఇన్నాళ్లు మావాండ్రు నిన్నుఁ జూడనీయలేదు. నీతో మాటాడనీయలేదు. నీతో మాటాడవలయునని వచ్చితిని. నాకేమయిన రెండు మంత్రములు చెప్పుమంటిని. ఆ ముసలిది లేచి కూర్చుండి నాకేవో రెండు మంత్రములు చెప్పెను. నే నింటికిఁ దిరిగివచ్చితిని. ఈ సంగతి యెవ్వరికినిఁ దెలియదు. మఱల నిట్లే వంకరసుంతయైనను లేని చందురుఁడున్న రాత్రులంట నేనా ముసలమ్మ వద్దకుఁ బోవుటయు నామె నాకు మఱికొన్ని మంత్రములు చెప్పుటయు జరిగినది. ఆమె నాకుఁ గొన్ని పాటలు నేర్పినది. అందులో నిది యొక పాట. ఇట్లు నాల్గయిదు నిండుచందురుఁ

రాత్రులు గడువఁగా నా రాత్రులందు నే నెచ్చటికో పోవు చున్నానని నా తండ్రికి నా యన్నలకుఁ దెలిసెను. మా నాల్గవయన్న నన్ననుసరించెను. ఆ రాత్రి ముసలమ్మ లేచి నాతో మాటాడలేదు. మాయన్న నన్ను బట్టుకొని కొట్టెను. నా తల్లితండ్రులు నన్ను భయపెట్టిరి. ఆ ముసలమ్మ నేర్పిన మంత్రములును బాటలును నెవ్వరు లేనపుడు నేను నోటితో ననుచుండుటయుఁ బాడుచుండుటయుఁ జేయఁగా నాని వానికిఁ గొన్ని శక్తు లున్నవని నాకుఁ దెలిసెను. కొన్ని జంతువులఁ మీఁద నా కధికారము కలదు. ఒకానొక వ్యక్తి కిట్లు జరుగ వలెనని నే ననుకొని యామె చెప్పిన మాట లనినచో నది యట్లు జరుగును. నాకు బాగుగాఁ దెలివి వచ్చిన తరువాతఁ దెలిసినది. అది శవము, శవములు మాటాడవు. లేవ లేవు. ఆ ముసలమ్మ యెట్లు లేచినది ? నాతో నెట్లు మాటాడినది ? మాటాడినది శవముకాదు. ముసలమ్మ కాదు. ఎవరో నాకుఁ దెలియదు. కాని నాకీ శక్తులు వచ్చినవి. జనము నన్నుఁ జూచి భయపడుదురు. నీవు మా దేశస్థుఁడవు కావు. కాన నీకు భయములేదు. మఱియు నోయి మిత్రా నీమీఁద నా మంత్రములు పాఱవు. నీకు జ్ఞాపకమున్నదో లేదో. కొన్ని నెలలక్రిందట నొకనాఁడు కరాళుని కూతును నేను గొట్టితిని. నీకు నామీఁదఁ జాలఁ గోపమువచ్చినది. నన్ను నీవు తిట్టితివి. కరాళునిచేత నన్నుఁ గొట్టింతునంటివి. నీమీఁద నాకునుఁ గోపము వచ్చెను. నీమీఁద నేనొక మంత్రమునుఁ బ్రయోగించితిని. ఆ మంత్రము నీమీఁదఁ బనిచేయలేదు. ఎందుకుఁ బనిచేయలేదు ? నా మంత్రముయొక్క బలము

పోయినదా ? మఱినాఁడింకొకనిమీఁద నా మంత్రమును ప్రయోగించినా వాఁడు బోర్ల బొక్కలుగాఁ గ్రిందఁబడినాడు. వానికిఁ బెద్ద దెబ్బ తగిలినది. అందుచేత నీవు నాకంటె నెక్కువ మంత్రశక్తి కలవాఁడవని యనుకొంటిని. కాని నీవద్ద నేవియు మంత్రములు లేవని నాకుఁ దెలియును. మఱి యెందుకుఁ నీమీఁద నామంత్రము పనిచేయలేదు ? నీయందేదో నాకుఁ దెలియని శక్తియున్నది. ఆశక్తి నీకును దెలియదు. అందుచేత నీమీఁద నాకుఁగల యనురాగము మఱియువృద్ధి పొందినది.' – అనఁగా నేను నవ్వితిని. ఎందుకు నవ్వెదవని యామె యడిగెను. నే నిట్లంటిని. నావద్ద నొక మహామంత్ర మున్నది. ఆ మంత్రముముందు మీామంత్రములు పనిచేయవు. ఆమె 'ఆమంత్రము నాకు నేర్పెదవా?' నేను 'నీవు నన్ను వలచుచుంటివి. నీవద్దఁ గొన్నివిద్యలున్నవి వానిని నే నుప యోగించుకొనవలయును. నీవద్దనున్న మంత్రములతో నీ వెవరి నైన నేదయినఁ జేయఁగలవు. నా వద్దనున్న మంత్రములతో నన్నెవరు నేమియు చేయలేరు. ఈ మంత్ర మెవ్వరికినిఁ జెప్ప డిది కాదు. నీవు నన్ను వలచుచున్నావు. నీవు గొప్ప శక్తి మంతురాలవు. నీమంత్రములు నాకుఁ గావలయును. నీశక్తి నా కుపయోగ పడవలయును. నే నీ నాఁటినుండి నిన్ను భార్యగా స్వీకరించు చున్నాను. ఇఁకముందు నా మంత్రము నన్ను రక్షించునో రక్షించదో నాకుఁ దెలియదు. నాయందే దానికి శక్తిచాలదని నేను భయపడుచున్న వేళ నీకా మంత్ర మునుఁజెప్పి నేమి ప్రయోజనము ? నీవు చెప్పినమాటనుఁబట్టి నా కొక్కటి తెలిసినది. ఇప్పటి వఱకు నేనుఁ బూర్తిగా

యవనుఁడను కాలేదు. తేపు కావచ్చును. నేనుబూర్వము బ్రాహ్మణుఁడను. మీరు యవనులు. మీరు మ్లేచ్ఛులు. మా మంత్రముల కాచారము కావలయును స్నానము, శౌచము, నియమము, మొదలయిన యెన్నియో కావలయును. అవి తుచ్ఛకార్యములయం దుపయోగపడవు. ఇతరుల కపకారము చేయుటకుఁ బనికిరావు. ఆ మంత్రము జపించిన వాని నా దేవత రక్షించును. తక్కినవన్నియు నల్పమంత్రములు. అది మహామంత్రము. సత్పురుషుఁ డితరులను హింసించఁడు. హింసించెడు వాఁడు తుచ్ఛుఁడు. తుచ్ఛులు సత్పురుషు నేమియుఁ జేయఁజాలరు. ఇది నీ మంత్రములకు నా మంత్రమునకు భేదము" ఆమె ఇన్నాళ్ళకు నేను నీయాస్తినని యంగీకరించినావు.' నేను 'దానితో నుపయోగమున్నదన్నప్పుడు అది మన యాస్తియన్న యనురాగము పుట్టును. నీవలన నా కుపయోగమున్నది. నీవు నా యాస్తివి. ఇదివఱకు నీవలని యుపయోగము నాకుఁ దెలియదు. నీయందు నాకు మమకారములేదు.' ఆమె 'మిత్రమా! నేను నిన్ను బ్రేమించుచున్నాను. నీవు నన్నుఁ బ్రేమించుము. ఈ యైదు యవనదేశములకు నిన్ను రాజునుఁ జేయుదును. తింతుని చావునకుఁ బ్రతీకారము చేయుదును. పాపము! నేను వానికిఁ గొన్నాళ్ళు భార్యగా నుంటిని, గావున వాని చావునకు నేను బ్రతీకారము చేయుదునని వాఁడు వాంఛించును. రెండును గలసివచ్చును. ఆమె వచ్చి నన్ను గౌఁగిలించికొనెను. నేను విముఖుఁడను కాలేదు. ఆమెతో నేనొక్క నియమము చేసితిని. 'నీవు కరాళుని సంతానమునం దెన్నఁడు

ద్రోహము తలంపనని వాగ్దానము చేసినచో నీవు నా భాగ్యవు.' ఆమె 'వారు నీకుఁ బుట్టలేదు. నాకుఁ బుట్టలేదు. కాని మనపిల్లలు.”—మిత్రఫా.

## ౧౩

శ్రీ శ్రీ మగధసామ్రాజ్య చక్రవర్తి పుష్యమిత్ర మహారాజ సమారబ్ధహయమేధ మహాయాగ ప్రధాన ర్త్విక్కులకు మేధావిభట్టులకు. ఆర్యా! పంచయవనదేశ మహారాజునయిన మిత్రఫాను నన్నుఁ దమరు మఱచిపోయి యుండరను కొందును. కాశ్మీరమునందుఁ గల తమ కుటుంబమునకు నెల నెలకుఁ గావలసిన సర్వసామగ్రియు నా రాజ్యమునుండి పంపఁ బడుచున్నది. అశ్వమేధయాగము మొన్న చైత్రశుద్ధ పూర్ణిమనాఁ డారంభింపఁ బడినదిగదా. మఱల వచ్చు వైశాఖామావస్యనాఁడుగాని మహాయాగము పూర్తిగాదు. తదనంతరముగాని తిరిగి తమరు కాశ్మీరదేశములకు వచ్చుట పడదని మీ కుటుంబమునకుఁ దెలియఁ జేసితిని. అశ్వమేధయాగ సమయమునందుఁ గర్త దీక్షితుఁడై యుండి తాను రాజ్యపాలనము చేయఁడు. ఈ సంవత్సరమంతయుఁ బ్రధాన ర్త్విక్కులయిన తమరే రాజులు. రాజ్యము మీది. ఇప్పుడు మీరే రాజులు. కర్తృవిసృష్టమైన మేధ్యాశ్వము గురు భూములను దాటినదని నాకు వార్తవచ్చినది. ఇంక నాల్గయిదు నెలలలో మా సీమకు వచ్చును. అశ్వరక్షకులకు మా సీమయందు మేధ్యా

శ్వమునకు శూద్రత్వమని వార్త పంపింపవలయును. తమరెప్పుడు రాజస్థానీయులు కనుక నేనీ యవనదేశములకధిపతియగుటకు జరిగిన సందర్భములను మీకుఁ దెలియఁ జేయుటలో నసా చిత్య ముండదని యనుకొనుచున్నాను. ఇదివఱకే నేను మహా మంత్రియైన నారాయణభట్టుగారికొక లేఖయు మహాసేనాధి పతియైన యుపవర్షునకొక లేఖయు వ్రాసియున్నాను. తమరికి వ్రాయఁబోవు నీ లేఖలోని విషయములు తదనుబంధముగాఁ జదివికొనఁ దగినవి. నా చరిత్రమంతయు నీ లేఖల మూలముననఁ దెలియఁజేయుచున్నాను. తమరు మహాశ్రోతులు. నేను యవనుఁడను. నేనశ్వమేధయాగము చేయుట కనర్హుఁడను. అందుచేత మిమ్ముఁ బుష్యమిత్ర మహారాజుల సన్నిధికిఁ బంపితిని. వారును మిమ్ముఁ బ్రధానర్త్విక్కులుగా స్వీకరించిరి. ఇది నాకెంతయు సంతోషదాయకమైన విషయము. నేను పండితుఁడనని పండితులను సమ్మానింతునని తొలుతఁ దమరు నాయొద్దకు వచ్చితిరి. సద్బ్రాహ్మణుఁడా! బ్రాహ్మణుఁడైనవాఁడు ధనార్థియై యవను నాశ్రయించుట యెట్టిది? శూద్రాన్నమే భుజింపరాదుగదా. యవనాన్నము తిందురా? శూద్రతకాని యవనత్వముకాని గుణాశ్రయమై యుండును. ఎవఁడు విద్యాభిమానియో, యెవఁ డుదారుఁడో, యెవఁడు పండితుఁడో, వానియందున్న శూద్రత్వ యవనత్వములు ప్రారబ్ధ విశేష హేతుక జన్మసంబంధులు కాని తజ్జీవలక్షణము నకు దోషహేతువులు కావన్న యొక పరమమైన యాథార్థ్యాత్మికమయిన భావవిశేషము నాశ్రయించి తమవంటి పెద్దలు ప్రవర్తింతురని యనుకొనుచున్నాను. మఱియు 'శరీరమాద్యం

ఖలు ధర్మసాధన'మ్మన్నారు. ఈ వాక్యము దుర్వ్యాఖ్యాత మగుచున్నవానిలో నొకఁటియని నా యభిప్రాయము. ఇట్లే బహువేద వాక్యములు దుర్వ్యాఖ్యాతము లగుచున్నవి. శరీర ముండినఁగదా ధర్మము చేయుట. అందుచేతఁ 'యేనకే నాప్యు పాయేన' శరీరమును రక్షించవలయునని యర్థము చెప్పుట సమంజసముకాదు. ధర్మమునకు సాధనములయిన వనేకములు గలవు. వానిలో శరీరము మొదటిది అని మాత్రమే దీనితాత్ప ర్యము. అర్థమును విగృహించి, మతివేఱ వ్యాఖ్యానముచేసి వ్యవహరించు చున్నారు. అట్లే కానిండు. నేను శాఖాచంక్ర మణము చేయుచున్నాను. అయేపాయన్న స్త్రీ నాకు భార్య యైనది. ఆమె మంత్రశక్తి. మంత్రశక్తి యనఁగా జమిలి యర్థముగల మాట. ఆమెకుఁ గొన్ని మ్లేచ్ఛమంత్రములు వచ్చును. వానితో నితరుల కపకారము చేయఁగలదు. అంతియే కాక యామె రాజనీతి విశారద. ఈ రెండుమంత్రశక్తులను జోడించి యామె యుపయోగించును. నన్నామె వలచినది. అది నే నీ దేశములకు రాజనగుటకు హేతువయినది. అట్టిస్త్రీ భార్యయైనచోఁ బురుషుఁడు భయపడవలయును. నేను భయ పడుచున్నాను. ఆమె నన్ను వలచుటకుఁ గారణము తెలియ లేదు. ఆ వలపున్నన్నినాళ్ళు నన్ను గౌరవించును. ఆ వలపు తొలఁగిపోయినచో నాపని యేమగునో తెలియదు. ఆ వల పెన్నాళ్ళుండునో తెలియదు. ఈ నా పంచ యవనరాజ్యాధి పత్యము నామె దయమీఁద నాధారపడి యున్నది. ఆమె దయ యెన్నాళ్ళుండునో తెలియదు. ఆమెదయ బహుకాల ముండవలయునని నేను వాంఛించుటలేదు. అశ్వమేధయాగాఁ

తమున్నచోఁ జాలును. మేధ్యాశ్వము మఱలఁ దిరిగి వెళ్ళునంతవఱకు నామెయొక్క వలపు నాయందు నిలఁబడి యుండెనేని నాకిది చాలును. ఇందుఁ జెప్పఁబోవు కథావిధానమునకు వెనుకటి యుత్తరములలోని రెండు మూఁడు విషయములయొక్క యుద్ఘాటన మవసరము. అందులో మొదటిది, కలియోనసుయొక్క భార్య నభిసారదేశ సేనాధిపతి చూచి కామోద్రేకమున వెంటఁబడి తఱుముకొని పోయెననునది. రెండవది ఆ అభిసార దేశపురాజు శింతాకరాళుని వధించెనన్నది. రెండవ విషయము ప్రస్తుతము. నా భార్యయైన యయేషాయొక్క రాజనీతి పండించుటకుఁ బ్రధానమయినది. ఆమెకు నన్నుఁ బంచయవన సామ్రాజ్యాధిపతిగాఁ జేయవలెనన్నకోర్కె పుట్టినది. అది సాధ్యముకానిచో నభిసార దేశాధిపతిత్వ మయినను నాకు సమకూర్ప వలెనని యామె వాంఛించెను. శింతాకరాళుఁడామెభర్త. ఆమె భర్తను వధించిన యభిసార దేశాధిపతి మీఁద నొక స్త్రీ పగ తీర్చుకొనవలెనని యెంచుటలో నాశ్చర్యమేమియు లేదుగదా. అయేషాయొక్క తత్పూర్వపతినిఁ గూడ జలయుద్ధ హేతువుగాఁ జేసి యభిసార దేశాధిపతి వధింపించెను. ఇట్టిద్దఱు తన పూర్వపతులనుఁ దద్దేశాధిపతి సంహరించెను. ఈ మూఁడవ పతినిఁ గూడ నేదోయొక వ్యాజమున సంహరించునేమో? వాని నెవఁడు నమ్మఁగలఁడు? అందుచేత ముందే మేల్కొనవలయును. తన యిద్దఱి పతులను రాజు సంహరించెననఁగా వానికిఁ దనమీఁదఁ గోర్కె యున్నదేమో? ఈ వట్టి సందేహమును హేతువుగాఁ గల్పించి

యూమె యభిసార దేశమున నలుమూలల నీవార్త వ్యాపింపఁ జేసెను. ఆ రాజునకీమె యెవ్వరో కూడఁ దెలియదు. ఈ ప్రచార మతని చెవులఁబడెను. అతనికీమె మీఁద ననురాగము కలిగెను. అనురాగమనుటకన్నఁ గోర్కె కలిగెను. అతఁడిట్లు భావించ నారంభించెను. ఆమె యిట్లు ప్రచారము చేయుటకు హేతువు తనయందామెకు వాంఛ యునికిగా నతఁడు భావించెను. ఆమెనుఁ గూర్చి వార్తలు తెలిసికొనెను. ఆమె మంత్రకర్త్రి. ప్రయోగములు చేసి మనుజులకుఁ గష్టములు సంప్రాపింపఁ జేయఁగలదు. మరణము కూడ సంభవింపఁ జేయఁగలదు. జంతువులామె స్వాధీనములో నుండును. ఆమె యన్నలు పదిమంది కలరు. వారు మహావీరులు. వారికి గొప్ప పలుకుబడి కలదు. వారికిఁ బెద్ద బలగ మున్నది. ఆ యన్నలు పదిమందియు వేయిమంది సేనను సమకూర్పఁ గలరు. అది పెద్దబలము. ఇట్టి స్త్రీకిఁ దనయందు వాంఛ యున్నట్లు రాజునకుఁ దెలిసెను. ఆ స్త్రీ సౌందర్యవతిఁ గూడ నయినచో యౌవనవతి కూడ నయినచో నభివాంఛింపఁ దగిన దింకేమున్నది? ఆ యభిసార దేశమొక దేశమనుటకు వీలు లేదు. కొన్నివందల పల్లెలు కలవు. కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవి. ఒకొక్కపల్లె కొన్ని కొండలనడుమ నుండును. నిజానికే పల్లియు కదే. ఒకదానితో నొకదానికి సంబంధము లేదు. ఏ యూరివారాయూరి కధిపతులు. వారు స్వతంత్రులు. వారు చేసిన దానికిఁ దిరుగు లేదు. ఒకయూరిలో జరిగిన సంగతి మఱియొక యూరిలోఁ దెలియనే తెలియదు. అచ్చటి దచ్చటనే యణఁగిపోవును. ఒక్కొకప్పుడు రెండు గ్రామముల

మధ్య విరోధము పెంపొందుచుండును. వారును వీరు యుద్ధము నాడుదురు. చచ్చినంతమంది చత్తురు. అట్టి విరోధములు సంవత్సరములుగఁ గొనసాగుట కలదు. కొన్ని కుటుంబములం దిట్టి విరోధములు తరతరములలో వచ్చుచున్నవి. ఆ వంశము వాఁ డీవంశము వానికి నొంటరిగా నేయడవిలోననో కనిపించి నచో వాఁడో వీఁడో. ఇది యా దేశలక్షణము. అది రాజ్యము కాదు. అచట నాజ్ఞలేదు. సంఘవ్యవస్థలేదు. సముదాచారములేదు. ఇట్టి దేశమున కొకఁడు రాజేమిటి? ఆ రాజుయొక్క బలమేమి? ఇట్లుండఁగా నీ దేశమున జలా భావము గలదు. కొన్ని కొండలమీఁదఁ బెద్ద పెద్ద దొరువు లున్నవి. సర్వజనుల కా దొరువులలోని జలమే యాశ్రయము. ఇ ట్లేగ్రామమున కాగ్రామముగా బ్రదుకుచున్న యీ జాతికి సర్వజనులకుఁ బానీయ మగుచున్న యీ దొరువులు సమష్టి భావమునుఁ దెచ్చినవి. ఈ దొరువులయొద్ద యుద్ధములు జరుగుచుండఁగా నట్టి యుద్ధములు తత్సర్వగ్రామనివాసులకు నిర్హేతుకమయిన యొక నాశనమునకు హేతువగుచుండఁగా వారంగఱుఁ దమలోఁ దమకు నొక కట్టడిని వాంఛించిరి. అప్పుడు రాజు బయలుదేఱెను. ఇట్టి నాల్గయిదు విషయము లందుఁ దద్దేశాధిపతికి వాఁడు రాజని పిలిపించి కొనుటకు హేతువులు కలిగెను. ఈరాజున కింకే యధికారమునులేదు. అతఁడు సైన్యమును సమకూర్పవలయునన్నచో, నా యఁ యేపా యొక్క తండ్రి కుటుంబమువంటి పాతిక ముప్పది కుటుంబముల మీఁద నతఁ డాధారపడి యుండును. అతనివద్ద నెప్పుడును వేయిమంది సైనికు లుందురు. అది యతని బలము. అతఁ

డెవరినైన శిక్షింపనెంచినచో నాయూరి బలమునుబట్టి తగినంత మంది సైనికులనుఁ దనవెంటఁ దీసికొనిపోయి, వారిని శిక్షించి తిరిగి వచ్చును. అయేషా యన్నల వంటివారిని శిక్షించుట యతని కెన్నఁడును సాధ్యముకాదు. అతఁడు తమ్ము శిక్షించుటకు వచ్చుచున్నాఁడని వీరికి నాచోకి తెలిసినచో వారు తమ వేయిమంది బంధువులను సమావేశ పఱతురు. రాజువచ్చును. ఏమి చేయఁగలఁడు ? వారియందు దోషము లేదని నిశ్చయ పఱుపఁబడును. రాజు వారిని క్షమించినట్లుగా నటించి వెడలి పోవును. రాజొకొకప్పుడు తాను వారిమీఁదికి వచ్చుచున్నాఁ డన్న వార్త వారికిఁ దెలియకుండ రహస్యముగ నుంచికొని హఠాత్తుగా నా గ్రామముమీఁద వచ్చి పడును. వారు పాతిక మంది ముప్పదిమంది మాత్రమే యుందురు. వారిలో నెవరిని శిక్షింపనెంచెనో వారిని శిక్షించి వెడలిపోవును. శిక్ష జరిగిన తరువాత మిగిలిన వారందఱు నూరకుందురు. దోషమున్నది. రాజు శిక్షించెను. అని వా రూరకుందురు. ఆ యూరకుండుట లోని తాత్పర్య మేమనఁగా మనకొక రాజు కావలయునని వారిలో వా రనుకొనుట. ఆ యనుకొనుటయే యితఁ డీ దేశమునకు రాజగుట. ఇదియుఁగాక యీ రాజుకూడ నిత్య భయగ్రస్తుఁడుగా నుండును. అతకి వేయిమంది సైన్యము కలదు. వానిని వదలిపెట్టి తా నెప్పుడు నుండఁడు. అందులో నాల్గువందల మందిని రా జెచ్చటికయినఁ బంపినచోఁ దనవద్ద నాఱువందల మందియే యుందురు. ఆ సమయములో నెవఁడో వేయిమందితో వచ్చి తన సేనను నిర్జించి తాను రాజు కావచ్చును. కాని యట్లు జరుగదు. అయేషా కుటుంబమువంటి

కుటుంబములు సుమారు ముప్పది కలవు. ఒక్కొక్క కుటుంబము వేయి మొదలు రెండు వేలవఱకు వారి వారి బంధువులను సేనగా సమకూర్పఁగలరు. ఇట్లు సమకూర్పఁబడఁగల సైన్య మేఁబదివేలమంది యభిసారకసేనము కాఁగలరు. పరదేశపు రాజు వారిమీఁద దండెత్తి ప్రయోజనము లేదు. వా రితరదేశములమీఁద దండెత్తుదురు. దండెత్తుటయనఁగా నూళ్ళమీఁదఁబడి దోఁచికొని తినుట. వీరు దేశములమీఁదఁబడి యిట్లు దోఁచికొని తిందురో యా దేశపు రాజు వారిని శిక్షించుటకు రావచ్చును. ఆ దేశమంతయుఁ గొండలు గుట్టలు. పరరాజు సేనలు దండెత్తి వచ్చిన మఱు నిముసమున నే గ్రామమందును జన ముండరు. అవి గ్రామములు కావు. వారి కాస్తులు లేవు. గృహములనఁగాఁ గొన్ని తాళ్ళనుఁ బ్రోవు పెట్టుట. వారికున్న యాస్తి మేకలు గొఱ్ఱెలు, గుఱ్ఱములును, గత్తులు. గుఱ్ఱములు కత్తులు నెప్పుడు వారి వెంటనే యుండును. పురుషు లెంత మోటువారో స్త్రీలు నంత మోటువారు. అట్లు మాటాడినచోఁ బురుషులకంటె స్త్రీలే మోటువారు. ఇదియొక రాజ్యము. దీని నెవ్వరును గెలువలేరు. ప్రక్కనున్న యవనరాజ్యములు వారితో నెప్పుడును స్నేహముగానే యుందురు. వీరును వారి జోలికిఁ బోరు. ఈ విలక్షణమైన రాజ్యమునకు రాజయినవాఁడు తనయం దయేషావంతియొక్క స్త్రీకిఁ గొర్కి యున్నదనఁగా నామెనుఁ దాను దెచ్చికొని పెండ్లియాడినచోఁ దనకది యధికమయిన బలమును సమకూర్చును. తనవద్ద నిత్యముగానున్న వేయిమంది సైన్యముతోఁ బాటు తన భార్యయొక్క బలముచేత మఱి వేయిమందిఘో

రెండువేలమందియో తన రాజాధికార శక్తిచేతగాక బంధుత్వ శక్తిచేత తనకు నిత్యము సాయపడువా రుందురు. అందుచే నతఁ డయోపానుఁ జూచుటకుఁ దొంగ యవడెను. ఆ యయోపా కిప్పుడొక భర్త యున్నాఁడు. వానిని ముందు సంహరించ వలయునా? తొలుత నా స్త్రీనిఁ జూచి యామె తన కభివాంఛ నీయ దైనచో నప్పుడు వానిని సంహరించ వలయునా? ఈ ప్రశ్న పుట్టి తొలుత నామెనుఁ జూడవలయునని యే నిశ్చయించికొనెను. ఈ యవన దేశములనుండి యార్యావర్త దేశములోనికిఁ బ్రవేశించుటకు నొక పెద్ద కనుమమార్గ మున్నది. ఆకనుమమార్గమును సర్వదా యవన దేశముల యొద్ద రాజ్యములనుండి కొందఱు సైనికులు నియమింపఁబడి రక్షించుచుందురు. వారు నలుఁబదిమంది. వారిలో నిరువదిమంది యభిసార దేశస్థులు. వారి పైయధికారి యభిసార దేశస్థుఁడు. ఈ యభిసార దేశము కనుమత్రోవకు దగ్గఱ. కనుమ త్రోవ నంటియే యుండునని చెప్పవలయును. కనుమకుఁ గుడివైపున దీర్ఘముగా దక్షిణదిశకు వ్యాపించి యున్న యొక పర్వతపంక్తి నానుకొని యీ యభిసార దేశ ముండును. ఆ దేశము వెడల్పు తక్కువ. పొడు గెక్కువ. ఈ రాజు దేశముయొక్క దక్షిణపుఁ గొన నుండును. కనుమను రక్షించు తింతాకరాళుఁ డుత్తరపుఁ గొన నుండును. రాజొకవేళ తింతాకరాళుని శిక్షింప నెంచినచో నది యతనికి మిక్కిలి కష్టమయిన పని. తింతుఁడు తప్పించుకొని కనుమమార్గమునఁ బ్రవేశింప వచ్చును. రాజున కగ్రాహ్యుఁడగును. అతఁ డార్యావర్తములోనికిఁ బాఱిపోవ వచ్చును. ఆర్యావర్త జనులచేత నీ దేశము

మీఁదికి దండెత్తింపించ నెంచెను. కరాళుఁ డభిసార
దేశస్థుఁడు. వాని కే గ్రామ మెచ్చోట నుండునో వారి నీటి
దొరువు లెచ్చోట నున్నవో సర్వమునుఁ దెలియును. నర
రాజు సేనవచ్చి నీటి దొరువుల నాక్రమించినచో నా
దేశమునందలి రెండులక్షల జనమును నాలుమాసముల
చచ్చిపోదురు. అందుచే నా దేశపురాజు తిందుతో నెప్పుడు
విరోధము పెట్టుకొనఁడు. తిందుఁడు రాజంతవాఁడు. ఈ తిందా
కరాళునకున్న యీ శక్తిచేతఁ బక్కన నాల్గు యవన రాజ్యాధి
పతులును తిందుని గౌరవింతురు. వానినే యాశ్రయింతురు.
వాఁడు చెప్పినట్లే రాజు వినవలయును. ఇది తిందుని రహస్య
మయిన శక్తి. తమకున్న యీ శక్తినిఁ బూర్వ తిందులెఱుఁ
గరు. అది వారి బలహీనత, యవివేకము. తిందుఁడింత యధి
కారియని యవేసాకుఁ దెలియును. ఆ దేశస్థులకు వివేకము,
పూర్వము పశువులవలెఁ బ్రవర్తించుటయు ముందు కనుక
లాలోచన లేకుండ హింసమృగములవలె వధించుటయుఁ గాక
వారికి జ్ఞానము లేదు. అయేసా బుద్ధిమంతురాలు. మత్స్యా
ర్యుఁడయిన తిందాకరాళుఁ డామెను బెండ్లియాడెద ననఁగా
నామె యంగీకరించిన దానికి హేతువిదె. వాని నభిసార
దేశాధిపతినిఁ జేయవలయు ననుకొన్నది. అతని యింటికి వచ్చి
నది. అచట నేనున్నాను. మనసులో నన్నుఁ జూచి కామించి
నది. పూర్వకరాళునకు వట్టి భార్యగఁ బ్రవర్తించినది.
మూర్ఖుఁడయిన యభిసారరాజు వానిని వధించెను. ఈమె నన్ను
వశము చేసికొనినది. ఇంక తన నీతినిఁ బ్రారంభించినది. ఈ
పైన నేను వ్రాసిన యీ రాజనీతి యంతయు నామె నాతో

చెప్పిన విషయములు. నాకుఁ దెలిసిన విషయములు కావు. ఆమె మఱల నాతో నన్నది. ఇప్పు డా రాజు నన్నుఁ జూచుటకు వచ్చును. నిన్ను సంహారింప నెంచును. నన్నుఁ జూచి మేలుపడినాఁడో నిన్ను సంహారింప నెంచినాఁ డన్న మాటయే. అంతియే కాదు. పూర్వ్వకరాళుని సులభముగ సంహారించెను. నిన్ను నంత సులభముగా సంహారింప వచ్చుననుకొనును. ఈ దేశస్థులయిన ప్రజలకు మోటుగా ఖడ్గయుద్ధము చేయుట చేత నగును గాని ఖడ్గవిద్యయందలి సులువులు తెలియవు. ఈ ఖడ్గవిద్య బ్రహ్మాండమయిన విద్యయని నేను దెలిసికొనుటకు నా జీవితములోఁ గొన్ని పరిస్థితులు కలిగినవి. నీవు బ్రాహ్మణుఁడవు. బ్రాహ్మణులు చదువు మాత్రమే యెఱుఁగుదురనియుఁ దక్కినవి యెఱుఁగరనియు వింటిని. నీవు కత్తియుద్ధము చేయఁగలవా? ఎవఁడయినఁ గత్తినిఁ బూని నీమీఁదికి వచ్చినచో నిన్ను నీవు రక్షించికొనఁ గలవా? అభిసార దేశస్థు లాజానుబాహులు. అడవి దున్నలవలె బలిసియుందురు. వారు కత్తితో బండఱాళ్ళను రెండుగ నఱుకఁ గలరు. ఈ రాజు మోటువారికంటె మోటువాఁడు. వాఁడు నీమీఁదికి వచ్చినచో నీ వేమిచేయఁగలవని యడిగెను. నేను నవ్వితిని. ఓయయ్యా! కాశ్మీరదేశ బ్రాహ్మణుఁడా! ఈ దేశమునందలి యొక విచిత్రమయిన లక్షణము నీతోఁ జెప్పఁబోవుచున్నాను. ఇట్లనుచుఁ నా భార్యయయిన యమేషా కత్తిఁ బుచ్చికొని నా మీఁదికురికెను. ఓ మహాశ్రోత్రీ! నమ్ముము, నమ్మకపోమ్ము. ఆ దూఁకిన లక్షణముతో నది నన్ను వలచినది కాదు. నన్ను రాజును చేయ నెంచినది కాదు. అపుడు నేను

నన్ను రక్షించుకొనలేక పోయినచో నాకిల తెలిక్రిందయిన
యుండెడిది. దాని వలపుమాట వేఱు. కన్నది వాంఛించుట
వేఱు. నన్ను రాజునుఁజేయ నెంచుట వేఱు. ఏమి చెప్పవల
యును? ఇది యేమి దేశము? ఇచటి స్త్రీలు స్త్రీలా? మను
ష్యులు మనుష్యులా? అయ్యో! నేను మగధసేనలోఁ బూర్వము
చిన్న సేనాని. పలుమంది సేనానులతోఁ గత్తియుద్ధములు
చేసినవాఁడను. వారివద్ద మెలకువలు తెలిసికొనిన వాఁడను.
మఱపు మెఱసినంతలోఁ బార్శ్వములకు లంఘించఁగలను.
నా శత్రువుయొక్క కత్తిదెబ్బ పడినచోట నాకత్తియుండును,
గాని నేనుండను. ఆమె యాశ్చర్యపోయినది. ఇది యేమి
యున్నది? ఈ లంఘన చాతుర్యము మెచ్చుట నేర్చితివన్నది.
నిన్ను దేశములో గెలిచెడివాఁడు లేఁడన్నది. నీ ఖడ్గవిద్యా
నైపుణ్యమిలా దేశస్థులకు తెలియించినచో నిన్ను వారు రాజుగా
నంగీకరించుటకంటెఁ జేయఁదగిన సులభమైనమార్గమే లేదన్నది.
తరువాత నాల్గు దినములు గడచినవి. ఆమె యానాల్గు దినము
లింటిలో లేదు. ఎచ్చటికిఁ బోయెనో నాకుఁ దెలియదు. ఆమె
భార్య. నేను భర్తను. నీ వెచ్చటికిఁ బోయితివని నే నడుగ
రాదు. ఆ దేశమునందలి స్త్రీలందఱు సంతతియే. ఒక్కమాట
యున్నది. వారు పరపురుష సంగమము చేయరు. ఒకని భార్య
యైనచో నింకొకఁడామెను వాంఛింపఁడు. వాంఛించినచో
వెంటనే యుద్ధమే. ప్రతీకారము దానిభర్తవచ్చి చేయఁడు.
ఆమెయే వానిని సంహరించును. ఇదియొక యాశ్చర్యకర
మయిన దేశము. వారంతటి న్యాయ్యమయిన కామవృత్తికల
వారు. ఈ యభిలాష మనసులో నన్నుఁగామించినది. అప్పటికి

భర్త యున్నాఁడు. అతనిని మోసము చేయఁడు. చేయలేదు నాయందలి దృష్టితో నతనినిఁ బరాభవించదు. అతఁడు చని పోయినచో నన్నుఁ బెండ్లియాడ వచ్చునని యనుకొనవు. అతనిమృతి దానియంతట నది జరిగినచో నాయందున్న తన కామమును వెలియింపఁజేయును. కనుక తనదేశము నందున్న యెవ్వఁడును దన భార్యయెచటికో పోయినదని విచారించఁడు. నాల్గుదినముల తరువాత నామె వచ్చినది. ఎచ్చటికిఁ బోయితి వని యడుగరాదు. అడిగినచో నది యామె నవమాన పఱచుట. ఆమె యెచ్చటికి వెళ్లెనో యెందుకు వెళ్ళెనో నాకు వారముదినము లయినతరువాతఁ దెలిసినది. ఆమె రాజునకు వార్తపంపించినది. ఓయి రాజా! నీవు నన్నువచ్చి చూడ నెంచుకొన్నావని నాకుఁ దెలిసినది. నీవు రాజవు. నేను పరుని భార్యను. మత్పూర్వభర్తల నిద్దఱి నీవు సంహరించితివి. ఈ నా భర్తనుఁగూడ సంహరించి నన్ను భార్యగ స్వీకరింపవలయునని నీకున్నచో న్యాయ్యముగ నతనితోఁ గత్తియుద్ధ మాడుము. వానిని నీవు సంహరింపుము. నేను నీకు భార్యనగుదును. నా మొదటి భర్తయందు జలయుద్ధ దోషము చూపించితివి. రెండవ భర్తయందు నతఁడు మిమ్ము కొన్ని యేండ్లుగా మోసగించెనన్న దోషమునుఁ జూపితివి. ఇతని యందుఁ గూడ నేదో దోసముగాని దోసమును నిరూపించి హఠాత్తుగాఁ జంపినచో నీవు నన్ను భార్యనుఁ జేసికొని లేవు. ఇప్పటికిఁ బది దినముల తరువాత నీవు మాయూరికి రమ్ము. నీవు నా భర్తతోఁ గత్తియుద్ధము చేయుము. అతనితోఁ బ్రత్యక్షముగఁ జెప్పుము. నేను నీ భార్యను

వాంఛించుచున్నాను. ఆమె నన్నుఁ గోరుచున్నదనుటకు నిదర్శనములు కలవు. నీవు నాతోఁ గత్తియుద్ధమాడుము. నేను నిన్ను సంహరించినచో నామె నా భార్యయగును. నీవు నన్ను సంహరించినచో నీ వీ రాజ్యాధికారి వగుదువు.— అతఁ డంగీకరించెను. వచ్చెను. మఱియు నయేషా యేమి చేసినదనగాఁ దన తండ్రి కుటుంబములవంటి ప్రధాన మయిన ముప్పది కుటుంబముల నాయకులకు వార్తలు పంపి నది. ఇట్లు జరుగబోవుచున్నది. మీరందఱును రావలయును. వారిద్దఱిలో నెవరు గెలిచినను నేను రాణినే. ఇప్పటి భర్త గెలిచినచో నతఁడు రాజుగ వారంగీకరింపవలయునని. ఆనాఁటి యుద్ధము చూచుటకు వచ్చినవారు ముప్పదిమంది కారు. మూఁడువందల మంది. రాజు తన వెంట మూఁడువందల మందినిఁ దెచ్చెను. ఆఱువందలమంది యుండిరి. వారందఱు సమావేశముకాఁగా నెట్లున్నది? సింహములు, పులు, లడవి దున్నలు, తోడేళ్ళు, సివంగులు, కొరనాసిగండ్లు, నెన్ని లొక చోట సమావేశమై నట్లున్నది. వారిముందు నే నెంత వాఁడను! నేనొక పిట్టను. అది యుద్ధము కాదనియు, నది యొక హాస్య రస ప్రదర్శనమనియు, నిదియంతియు నయేషా రాజును వధించి దానిలో నొక న్యాయము న్నట్లు కనిపింపఁ జేయుటకుఁ జేసిన యత్నమనియు నందఱును భావించిరి. నేను మా యింటిముందొక ఱాతిబండపైనఁ గూర్చుండి యుంటిని. కరాళుని పిల్లలు నా యిరువైపులఁ గూర్చుండి నివ్వెఱపోయి చూచుచుండిరి. ఆ వచ్చినవారిలో నామె తండ్రి యన్నలు కూడఁ గలరు. ఆమె బంధువులు పెక్కురు కలరు. రాజొక

వేళ సంహారింపఁ బడినచో వాని యనుయాయులు నన్ను సంహరించుటకు వత్తురేమో ? అట్లు జరుగకుండ నామె తన బంధువులతో ముందే చెప్పి పెట్టెను. ఆ దేశములోఁ గత్తి యుద్ధము దానికిఁ గొన్ని నియమములు నొక మధ్యవర్తి, నియమిత వేళయందుఁ బ్రారంభించుట మొదలయిన వేమియును లేవు. కత్తిదూసి మీఁదికిఁ దూకుటయే మొదలు. అట్టిద్దఱు పిల్లలు నా యిరుప్రక్కల నన్నుఁ గౌఁగిలించుకొని యున్న తరుణములో నారాజు తాళ్ప్రమాణ దేహుఁడు, దీర్ఘ కుటిల శ్మశ్రుఁడు, నామీఁదికి వచ్చి దూకెను. అప్పుడు కత్తి నా చేతిలో లేదు. నా ప్రక్క నున్నది. వాని కత్తి దెబ్బకుఁ గరాళుని సంతానము దెబ్బ తినునేమో యని నాకు భయము వేసినది. అచ్చట యుద్ధ మర్యాద గుఱించి యెవనితోఁ జెప్ప వలయును ? వాఁడు తీవ్రముగా నన్ను సమీపించిన వేళ నేను పిల్లల నిద్దఱిని వాని కాళ్ళమీఁదఁ ద్రోసితిని. వాని కత్తి నేను కూర్చున్న బండమీఁదఁ బడినది. నేను కుడివైపునకుఁ దొలఁగిన ఖడ్గమును స్వీకరించి వాని వెనుకవైపునకు వెళ్ళి కుడి పాదముతో వాని పృష్ఠభాగమున నొక్క తన్నుఁ దన్నితిని. వాఁడు ముందునకు విఱిచికొని పడెను. అప్పుడు వానిని నేను వెనుకనుండి కత్తితోఁ బొడువఁ గలను. వాని మణికట్టు నఱుకఁ గలను. కాని యట్లు చేయలేదు. నేను దమరాజు నట్లు తన్నఁగా నాయువందల కన్నులు జేవురించినవి. కాని యా కన్నులలో భయ ముదయించినది. ఆ దెబ్బతో నేను గరాళుని పిల్లలును ముగ్గురును వధింపఁబడితి మని వారనుకొనిరి. నా యా లాఘవమునకు వారాశ్చర్యపడిరి. మఱియు

వెనుకనుండి సులభముగా వానిని వధించుటకుఁ గలిగిన వీలును నేను లెక్కచేయమికి నాశ్చర్యపోయిరి. ఇద్దఱు పిల్లలలో నాకుపిల్ల యేడువ నారంభించెను. ఇద్దఱు పిల్లల నివతలికి లాగి దూరముగ నిలుచుండి చూచుచుండిన వారి నాయనమ్మ కప్పఁ జెప్పితిని. నన్నుఁ జూచి యాఱువందలమంది యాశ్చర్యపోవుచుండిరి. నాయందుఁ గోపములేదు. తొందఱపాటులేదు. భయములేదు. శత్రువు వచ్చి మఱల నన్ను దాఁకునేమో యన్న జాగ్రత్తలేదు. వీఁడింత మనిసి. పిట్టవంటివాఁడు వీఁడిదివఱకే చచ్చె ననుకొన్నాము. వాని యీ ప్రతిభ యేమని నివ్వెఱను భజించుచుండిరి. అంతట నారాజు మత్ప్రదాఘాతముచేత నొప్పిపెట్టుచున్న నడుము నెడమచేతితో సర్దికొనుచు లేచి నిలుచుండి నావంక వాఁడు చూచిన చూపులు పదివ్యాఘ్రములొక్కసారి యుఱికి చూచినట్లున్నది. నేను నవ్వితిని. యుద్ధములో నవ్వుట వారెఱుఁగరు. వాఁడు మఱల నా మీఁదికి దూకి రాఁబోయెను. నేనఱచితిని. 'ఓయీ! అది యుద్ధము చేయులక్షణము కాదు. మఱల నేను పెడకు లంఘింతును. ప్రక్కనుండి నిన్ను సంహరింతును. ఇదివఱకే నిన్ను వదలిపెట్టితిని. కనుక శాంతముగ రమ్ము. యుద్ధముచేయుము. నా నేర్పు నీ నేర్పు తెలియఁ గలదంటిని. వానికదియేమి తెలియును! షాతిక ముప్పదిసార్లు వాఁ డట్లే నా మీఁదికి లంఘించెను. నా లాఘవకౌశలముచేత వాని కత్తి నన్ను స్పృశించలేదు. ఈ ముప్పదిసార్లలో నేను వానినెప్పుడు వధించినను వధించవచ్చును. క్రమక్రమముగ నందఱి కన్నులు నాయందుఁ బ్రసన్నములయినవి. నేను లంఘించి

నప్పుడెల్ల వారు కేకేకారములు చేయ నారంభించిరి. నేను వానినిఁ జంపుట మాని వేసినప్పుడెల్ల వారు చప్పట్లు చఱుప నారంభించిరి. నేను నా కత్తిని వానిపొక్క నానించుటయు నందఱునుఁజూచి నవ్వుటయు నేను వెనుకకు లాగికొనుటయుఁ జేయుచుంటిని. వారి ప్రశంస హద్దుమీఱినది. కాని రాజు వెంటవచ్చిన మూఁడువందలమందినిఁ గ్రమముగాఁ జూచితిని. లెక్కపెట్టితిని. తొమ్మండుగుఱు నవ్వుటలేదు. వారి కనులలోఁ గ్రోధము తాండవించుచున్నది. తక్కిన వారూర కుండరన్న విషయము ప్రత్యక్షముగఁ గనిపించుటచేత వా రాగిరిగాని లేనిచో వారును నా మీఁదికి వెంటనే దూకి యుందురు. ఈతొమ్మండుగుఱి నేల వదలిపెట్టవలయునని నాకు బుద్ధిపుట్టినది. అవుడు నేనొక చిన్న యెత్తయిన ఱాతిమీఁద నధిరోహించితిని. రాజు మఱల వచ్చెను. వాఁడా ఱాతిమీఁద ముందునకుఁ బడెను. పడినవాని మూడుపట్టున నేను గత్తిపిడితోఁ గొట్టితిని. వాఁడు సొమ్మసిలి పడిపోయెను. కొంతసేపటివఱకు లేవలేఁడు. అప్పుడు నేను దక్కిన వారితో నిట్లంటిని. ఈ యుద్ధమునకు నే నితనినిఁ బిలువ లేదు. మీకు నేను రాజును గావలయునన్న వాంఛ నాకు లేదు. ఆయేషా నాకు భార్య. తింతాకరాజుని భార్య. నే నిప్పుడు తింతాకరాజ పదవీస్థితుఁడను. అందుచేత నామె నాకు భార్యయైనది. నే నామెనుఁ గోరుచున్నాను. ఆమె నింకొకఁడు నానుండి హరింపనెంచినచో నే నోర్వను. ఈ యుద్ధములో నేను గెలుచుటచేత నేను రాజునగుదునన్న విషయము నా కయేషా చెప్పినది. నాకీ దేశముయొక్క రాజత్వ

మక్కఱలేదు. నీకాక కావలయునన్నచో రాజుగా నుండుటకు నా కభ్యంతరములేదు. కాని యయేషా నాకు భార్య. ఆమె నింకొకఁడు హరించుటకు నే నంగీకరింపను. నేను పూర్వము యవనుఁడను కాను. నిజమే. ఇప్పుడు యవనుఁడను. మీలోని వాఁడను. అభిసార దేశస్థుఁడను. కనుమను ద్రొక్కించెడివాఁడను. ఈదేశముయొక్క యానుపానులు నాకుఁ దెలియును. నేను దలఁచికొన్నచో మీదేశమనునది లేకుండఁ జేయఁగలను. కాని చేయను. నేనీ దేశమునుఁ బ్రేమించుచున్నాను. దానికిఁ గారణ మయేషా. అయేషానుఁ బ్రేమించుచున్నాను గనుక మీ దేశమునుఁ బ్రేమించుచున్నాను. మీ రాజు నిప్పుడు సామ్యసిలఁ జేసితిని. ఎందుకనఁగా నీ చూచుచున్న వారిలోఁ గొంతమంది మొగములయందుఁ గోపము కనిపించుచున్నది. అందఱును బ్రశంసించుచుండఁగా వారి మొగములయందుఁ దీవ్రత్వమే యున్నది. నేను వారిని లెక్క పెట్టితిని. వారు తొమ్మండుగురు. వారిలో నొకొక్కఁడువచ్చి నాతో యుద్ధము చేసిననుసరే. తొమ్మండుగురుకలిసి వచ్చిననుసరే - అని వాఁడు వాఁడు వాఁడు మొదలుగా నిర్దేశించి తొమ్మండుగురిని బిలిచితిని. వా రితరులచేతఁ బ్రోత్సహింపఁబడి ముందునకు వచ్చిరి. ఇంతలో రాజునకు స్మృతి వచ్చెను. పదిమందియు నిలుచుండిరి. వారంద ఱొక్కసారి నా మీఁదికి వత్తురని నాకుఁ దెలియును. అంతవఱకు నా చేతిలో డాలులేదు. అయేషా ఇంటిలోనికిఁబోయి తింతాకరాళుని డాలు తెచ్చి నాచేతి కిచ్చెను. రా జామెవంక నివ్వెఱపోయి చూచెను. అతనికిఁ దెలిసెను. ఈమె నన్నుఁ బ్రేమిం

చుట లేదు. తనభర్తను రాజును చేయుట కీ పన్నాగముసన్నిన దని. గడియసేపటిలో నా పదినుంది శవములు నేలబడి యుండెను. నే నీ రీతిగా నారాజ్యము నిస్సపత్నమునుఁ జేసితిని. వారందఱును నాకు వశులయిరి. నా ప్రభుత్వమునుఁ గాదనెడి వాఁ డచ్చట లేఁడు. అంతఁ గొంత సేపటికి నయేషాయిట్లనెను. ఇదిగో నాభర్త పగ తీర్చితిని. వెలియోనసు భార్య యేమయి నదో తెలియదు. ఆసంగతి తరువాత విచారింతము అనెను — ఆ యయేషా విచిత్రమయిన వ్యక్తి. ఆనాఁడామె యాఱు వందల మందికి భోజనము పెట్టెను. ఆ ప్రయత్న మెప్పుడు చేసెను. అంత మాంస మెట్లు సమకూర్చెను? అందఱకుఁ గావలసిన కల్లు నెచటనుండి తెచ్చెను? నాఁడు నే నభిసార దేశాధిపతి నయితిని. కరాళుని యిద్దఱు పిల్లలునుఁ దల్లియు నయేషాకుఁ బ్రేమాస్పదు లయిరి.

ఇట్లు నే నభిసార రాజ్యమునకు రాజనగుట తక్కిన నాల్గు యవన రాజ్యములందు గుప్తముని పోయెను. నేను గొప్ప జ్యోతిష్కుఁడుగాఁ దక్కిన నాల్గు యవనరాజ్యాధి పతులకుఁ దెలియును. నే నింతటి ఖడ్గవిద్యా నిపుణుఁడనని యెవ్వరికినిఁ దెలియదు. నే నించుమించుగా నాల్గేండ్లనుండి యవన రాజ్యములలోఁ దిరుగుచుంటిని. వా రెవ్వఱికిని నాకు గత్తిపట్టుట చేతనగుననియే తెలియదు. దానికిఁ బెద్ద కారణ మున్నది. తొలుత నేను వచ్చినపుడు కనుమకాపరులు నన్ను బంధించిరి. నే నింతటి కత్తివిద్య తెలిసినవాఁడనైనచో వారు నన్నంత సులభముగా నెట్లు పట్టుకొందురు? వారితో నేను యుద్ధము చేయవలయునుగదా. మఱియు నార్యావర్తము

నందలి యోధులు ధనుర్ధారు లయియుందురు. దూరమునుండి ధనుస్సు దగ్గఱనుండి ఖడ్గము నుపయోగింతురు. నావద్ద ధనుస్సే లేదు. నేను పుష్యమిత్రుని గుఱ్ఱమును దొంగిలించి తెచ్చితినని వారికిఁ దెలియును. ఆయనకు బంధువునని తెలియును. పుష్యమిత్ర మహారాజు తానప్పుడు సేనాపతియై యుండి యవనరాజులతో మీరు మాటిమాటికి నార్యావర్త దేశముల మీఁదికి దండెత్తుచున్నారు. మీరీదాడులు మానివేయనిచో నేను మహా సైన్యముతో వచ్చి మీ రాజ్యములను నాశనము చేసెదనని వార్త పంపెను. ఆ వార్త నేను తెచ్చితిని. ఆ వార్తను వారు నమ్మలేదు. నా వెంట వంద మంది ధానుష్కులైన లేరు. నా చేతిలో ఖడ్గమయిన లేదు. అది యట్లు జరిగినది. ఇప్పు డెవ్వరును విశ్వసించలేదు. కాని యభిసార దేశస్థులందఱు నొక్కమాటగా నిది చెప్పుచుండఁగాఁ గాదనుట యెట్లు? నేను రాజ నయితిని, వారు కాదనుట యెట్లు? పంచ యవనరాజ సమావేశములు వెంట వెంటనే వారు నాల్గు జరపిరి. ఒకటి యుత్తర జ్యోతిషమున, రెండవది దివ్యకటకమున, మూఁడవది సింహపురమున, నాల్గవది యూరస దేశమున. ఈ సమావేశములకు రెండు కారణములు గలవు. మొదటిది పుష్యమిత్ర మహారాజు హయమేధము నారంభించెనని హయము విసృష్ట మయ్యెననియుఁ వార్తలు వచ్చెను. అప్పటికిఁ బుష్యమిత్రులు హయమేధము నారంభింపనే లేదు. నేనే యీ వార్తలు వ్యాపింపఁజేసితిని. వారి వేగులవాండ్రు పోయిరి. ఈ వార్తలే తెచ్చిరి. వారి కేమి తెలియును? నాల్గయిదుచోట్ల నలంకరింపఁబడిన యీరాట గుఱ్ఱ

ముల నాట్యమును చూచి వారు దానిని మేధ్యాశ్వము లను కొనిరి. నే న ట్లేర్పాటు చేసితిని. నాకు రహస్యచారులు కలరు. ఈ రహస్యచారులు నాకు నల్గురున్నారు. మొదటి గుఱ్ఱమును వధించిన నలుఁబది మందిలో నల్వురు నాకు వశులయిరి. వారు నాకు భక్తు లంబురి. వారిలో ముప్వు రుత్తర జ్యోతిష దేశస్థులు. ఒకఁడు దివ్యకటక దేశస్థుఁడు. వారికి నేను గొన్ని రహస్యములయిన జ్యోతిషములు చెప్పితిని. ఆ రహస్యము లెట్టి వనఁగా నేను వానినిఁ దెలియ జేసినచో వారు సకుటుంబముగా సంహరింపఁ బడుదురు. వారినట్లు వశముఁ జేసికొంటిని. వారిని నే నెచ్చటికో పంపింతును. పూర్వ తింతుఁడు నన్ను నుమానించఁడు. కనుమద్రోవ రక్షించుటకు ముప్పదియాఱుగుఱు చాలుదురు. ఇట్లు నా పన్నాగము సాగుచుండెను. వదలఁబడని గుఱ్ఱము వదలబడినట్లు చెప్పించితిని. ఆ గుఱ్ఱమును బంధింపవలయునా ? వలదా ? యన్న ప్రశ్న పుట్టినది. పంచయవనరాజ సమావేశములు జరుగుచుండెను. నేను విశ్వాస్యుఁడనో కాదో వారికిఁ దెలియదు. నాలుగేండ్లు నాకుఁ దెలిసిన కత్తివిద్య నింత గోపనముగా దాచినవాఁడు విశ్వాస్యుఁడగుట యెట్లు ? పరమ ధూర్తమయిన సమర్థమయిన యేఁబది వేల యవన సైన్యమునకు నాధుఁడయిన వానినిఁ గాదనుట యెట్లు ? వారి రహస్యము లన్నియు నాకుఁ దెలియుచుండెను. నేను వారితోఁ జెప్పితిని. 'ఇవి యన్నియు నిజమయిన వార్తలు కావు. అశ్వమేధమింకను నారంభింపఁబడ లేదు. ఎప్పు డారంభింతురో తెలియదు. ఈ వార్తలెవరో విరోధులు వ్యాపింపఁజేసితిరని' చెప్పితిని. రహస్య

ముగా వార్తలు కల్పించినది నేను. ఆ వార్త లయథార్థము లని ఋజువుచేసి పెట్టినది నేను. వారికి నాయందు విశ్వాసము కలిగెను. ఇంతలోఁ బ్రతి సమావేశమునను వారందఱు నా ఖడ్గవిద్యా ప్రదర్శనమునుఁ జూడ వాంఛించుచుండిరి. నేను దానినిఁ బ్రదర్శించుచుంటిని. ఆ ప్రదర్శించుటలో నెప్పుడునుఁ దప్పకుండఁ నా దేశములందలి నాయకులయిన వారినిఁ బిలి పించి వారి సమక్షమున నీ ప్రదర్శనము చేయుచుంటిని. అవి పేరునకుఁ బ్రదర్శనములు కాని నిజమునకు ఖడ్గయుద్ధములు. వారిలో నేనెంతమందినో సంహరించితిని. యవనులలో ధను ర్విద్య తక్కువ. ఆ ధనుర్విద్య కొంత యుత్తరజ్యోతిషమున నున్నది. సింహపురమున నున్నది. తక్కిన మూఁడు దేశము లలో లేదు. యవనులకు నార్యులకుఁ జరిగెడి యుద్ధములలో నార్యులు గెలుచుచుండిరనఁగ నార్యులయొక్క యధిక మయిన ధనుర్ధారులవలన. ఆ ధనుర్విద్య నాకు రాదని వారికిఁ జెప్పితిని. ఎట్లయిననేమి? నాల్గయిదు నెలలలో నా నాల్గు దేశములందుఁ గూడ నా ప్రశస్తి వృద్ధిపొందెను. అయేషా కెట్లు తెలియునో యా నాల్గు దేశములలోని రహస్యములు నాకుఁ దెలియఁ జెప్పెను. ఆ రాజులకు విరోధులెవరో యే యే వీరులకు నా రాజులు పూర్వ మపకారము చేసిరో యెవరా రాజులయం దనిష్టులో యిట్టి సంగతులు నాకుఁ దెలియుటచేత నేను వ్యంగ్యముగా మాటాడుటచేత నా నాల్గు దేశములలోని వీరనాయకులు కొందఱు నాయందభిమానము గలవారయిరి. ఇంక రహస్యముగా నయేషా చేసిన రహస్యమయిన నీతి చెప్పినచో నొక గ్రంథమంత యగును. ఆమె మంత్రకర్త్రి. ఇట్టి

కొందఱు మంత్రకర్తలు మంత్రగాండ్రు నా నాల్గు దేశము లందును గలరు. వారితో నీ వెకుఁ బరిచయముకలదు. పరిచయ మే కాదు. ఆ దేశములలోన మంత్రవిద్యలు కలవారందఱొక్క ప్రత్యేకమైన జాతిగానున్నట్లు నటింతురు. వారికిఁగల పరస్పరాభిమానములు చెప్పరానంత యుండును. ఆమె యొకనాఁడు నాతో నిట్లనినది. నీవు యవనరాజులను నలువురను సంహరింపఁ గల్గినచో నీకుఁ దక్కిన నాల్గు యవన రాజ్యములును స్వాధీన మగును. అందఱు నిన్ను రాజుగా నంగీకరింతురు. దాని కొక్కటియే మార్గ మున్నది. నీవెట్లు సంహరింతువో నాకుఁ దెలియదు. ఆ రాజులకు నొకొక్కని కైదాఱుగురు భార్య లున్నారు. వారందఱు గొప్ప గొప్ప వీరకుటుంబము లకు సంబంధించినవారు. ఆరాజులకున్న బలము వారిభార్యలే. ఆచారభేదములున్నను నా యవనదేశముల సైన్యములుగూడ నిట్లు సమకూర్పఁబడునవియే. ఒకొక్క కుటుంబ ముండును. వారు రెండు వేలమంది మూఁడు వేలమంది సైన్యములను సమ కూర్పఁ గలుగుదురు. వారు వారు నాయకులు. ఆ నాయకు లను దగ్గఱకుఁదీసి వారి యభిమానమును చూఱగొనుటయే వారు రాజులగుటకు హేతువు. ఆరాజు లందఱు సంహరింపఁ బడిన తరువాత నా స్త్రీల నందఱును నీవు భార్యలుగా స్వీక రింప వలయును. వారు రాణు లయితీఱవలయును, వారి వారి రాణి తనమునకు భంగములేనిచో నీ రాజత్వమునకును భంగము లేదు. యవన రాజ్యములన్నియుఁ గలిసి యొక పెద్ద రాజ్యమగుట యందఱకు నభిలషణీయమయిన యంశముగా నున్నది. ఐదు రాజ్యములు. వీరిలో వీరి కల్పాల్పములయిన

విరోధములు. చిన్న చిన్న యుద్ధములు. దీని నెవ్వరు వాంఛిం చుటలేదు. యవనరాజ్య పరిషత్తన్నది యార్యావర్తము మీఁద దండెత్తిపోవుటకు మాత్రమే యుపయోగ పడు చున్నది; యంతశ్శాంత హేతువుగా లేదు. ఉన్న పరిస్థితియిది. అని యయేషా చెప్పఁగా నాకేమనిపించినది. నేను యవనుఁడ నగుటమాత్రమే చాలలేదు. యవనాధముఁడను గావలె నని పించినది. ఇంతదూరమువచ్చి వెనుకకుఁ దిరుగుట యెందు లకు ? సరే నంటిని. మఱల యవనరాజ పరిషత్తు జరిగినది. నేను వారితోఁ జెప్పితిని. అశ్వమేధ మారంభము చేయఁబడ లేదు. దాని కింక నాల్గు నెలలు వ్యవధియున్నది. ఇంక నెక్కువ వ్యవధియే యున్నది. నే నీవ్యవహారములలో మునిఁగియుండి నావద్ద లెక్కలు పోయినవి. వెలియోనసువద్ద నీలెక్కలన్నియు నుండును. నేను వారి సర్వతమునకుఁ బోయి యెప్పుడు యాగారంభము చేయుదురో మన మశ్వమును పట్టుకొన వచ్చునో ? పట్టుకొనఁ దగదో ? మన కనుకూలమయిన కాల మగునో ? కాదో ? తెలిసికొని వత్తును. పూర్వపు టభిసార దేశ సేనాపతి వెలియోనసు భార్య ననుసరించెను. వా రేమయి నారోకూడఁ దెలియదు. ఇన్నాళ్ళుగా నే నాసంగతి విచారించ లేదు. నేనా పర్వతములకుఁబోయి సర్వమును వెలియోనసుల నుండి తెలిసికొని వత్తు నంటిని. వారికి నాయందొక యవిశ్వా సము కలిగినది. ఇతఁ డచ్చటికిఁ బోయి యేదో పన్నాగము పన్నును. ఇతఁ డొక్కఁడచ్చటికిఁ బోవుట మనకు శ్రేయము కాదని వారనుకొనిరి. ఇది యందఱకుఁ గావలసినపని. అంద ఱము కలిసియే పోద మనిరి. నేను నంగీకరింపక తప్ప నట్లంగీక

రించితిని. అచ్చటికిఁ బోవుట కొకదినము నిర్ణయింపఁబడినది. వచ్చి యయేషాతోఁ జెప్పితిని. అందఱు మా పర్వతము లోనికిఁ బోవుదుము. ఆరాజు లామంత్రు లా సేనాపతులు నేనును లోనికిఁ బోదుము. మే మాలోపలనున్నట్లు నీవా దుబ్బులను బెల్లగించవలయును. అపుడు లోనివారులోననే సంహరింపఁ బడుదు రంటిని. ఆమె నీవును వారిలోననే యుందువు కదా. నీ విట్లు బయటికి వత్తు వనెను. నేను వారినిఁ గుఱించి చెప్పితిని. నన్నుఁ గుఱించికాదు. మొదట నా కా యూహ లేదు. వారిని లోపలవదలి నేను బయటికి రావలయును. అది యెట్లు? దుబ్బులనుఁ బెల్లగించుట యెట్లు? ఆ దుబ్బులనుఁ బెల్లగించుట సాధ్యమా? అంత సాధ్యమయిన విషయమైనచో నది యింత దృఢమయిన మార్గముగ నెట్టులుండును? ఒక నాఁడు నేను - నయేషాయు నా పర్వతమునకుఁ బోయితిమి. ఆ దుబ్బులనుఁ బరిశీలించితిమి. అవి పెల్లగింపఁ రాకుండ నున్నవి. వానిని దగులఁబెట్టవచ్చునేమో యని చూచితిమి. అదియు సాధ్యముకాలేదు. లోనికిఁబోయి గుహాలన్నియు వెదకితిమి. అభిసారదేశ సేనాపతి లేఁడు. వెలియోనసు భార్య లేదు. వెలియోనసులు లేరు. వీరేమయిరి? ఎంతయో వెదకితిమి. వారందఱు నూబిలో దిగఁబడియుందురు. నలువురును నశించిపోయి యుందురు. తప్పించికొని పోయినచో నిన్నాళ్లు కనబడక యుందురా? అయేషా యిట్లనెను. 'ఇచట వెలియోనసులు లేనిమాట వారితోఁ జెప్పవలదు వారందఱి నిచ్చటికిఁ దీసికొనిరమ్ము. వారితోఁ గత్తియుద్ధముచేసి వారందఱిని' సంహరింపుము అనఁగా నే నిట్లంటిని. 'ఉత్తరజ్యోతిష

దివ్యకటక సింహపురీయులు పరాక్రమవంతులు. వారిని మన యభిసార దేశస్థులనువలె విద్యానైపుణ్యముచేతఁ జంపుట సాధ్యము కాదు. వారిని మార్గాంతరముననే వధింపవలయును. ఏమిచేయవలయుననఁగా నేమిచేయవలయునని చర్చ యైనది. వారినచటనే యుంచి దుబ్బులు లేకుండఁ జేయుటయే మార్గమని తోఁచినది. దుబ్బుల నెట్లు ధ్వంసము చేయవలయునో తెలియలేదు. చివటికా మె యిట్లన్నది. "నాసద్ద నొకవిద్య యున్నది. నేను భల్లూకములను వశపఱచికొనఁ గలను. వానిని మంత్రబద్ధములను చేయఁగలను. మూఁడు గవియల నే పాభల్లూకములు మంత్రములచేత బద్ధమయి యుండును. మంత్రశక్తి యుడిగినంతనే యవి మహాభయంకరములగును. అప్పుడు వానిముం దెవరును నిలువలేరు. పది భల్లూకములనుఁ దెచ్చి యీ గుహాలలోనుంచి వానిని మంత్రబద్ధములనుఁ జేసి వారు వచ్చెడు వేళయు మంత్రశక్తి విడిపోవు వేళయు సరిపోవునట్లు చేయుదము. వారిలోఁ జాలమంది భల్లూకములచేత సంహరింపఁ బడుదురు. మిగిలిన వారిని నీవు సంహరింపవచ్చును." నేనిట్లంటిని "ఈ భల్లూకములను దుబ్బులమీఁద నుండి నడిపించి లోనికిఁ దీసికొని పోవలయునుగదా. అవి యూబిలోఁ బడనచో నవియు నధఃపాతాళము లోనికిఁ బోవును—మాకేమియును దోఁచలేదు. ఇద్దఱ మింటికిఁ దిరిగి వచ్చితిమి. హెలియోనసులను దర్శించు దినము మఱు నటి దినము. ఆలోచనా శూన్యమయిన బుద్ధితో నే నానాఁడు తక్కిన నాల్గు యవనదేశ రాజులతో మంత్రులతో నాపర్వత బిలములోనుండి పర్వత గుహాలలోనికిఁ

బోయితిమి. ఆశ్చర్యమేమనఁగా నా వెనుకటి కొలఁది దినముల క్రింద నేను నయేపాయుఁ బోయి యెంత వెదకినను నెవ్వరు కనిపించ లేదు. నాల్గవ గుహయొక్క చీఁకటిలో నొక వ్యక్తి కూర్చున్నట్లుండెను. ఆసంగతి నాకుఁ దెలియదు. ఒక సేనాపతి వెళ్ళెను. వాఁడు తిరిగి రాలేదు. మఱియొక మంత్రి వెళ్ళెను. వాఁడు తిరిగి రాలేదు. తరువాత నిద్దఱు మంత్రులు కలసి వెళ్ళిరి. వారును దిరిగి రాలేదు. ఇట్లు నలుగుఱు రాలేదు. మా కర్థము కాలేదు. మాలో సింహపురిరాజు ధృష్టుఁడు. తా నధిక బలశాలి ననుకొనును. అందఱముపోయి వెదకుద మనుకొనఁగా నాతఁ డొంటిగాఁ బోదు ననెను. మేము వలదంటిమి. వాఁడు వెళ్ళెను. అతఁడును రాలేదు. ఇంక నేడుగుఱమే మిగిలితిమి. అప్పు డందఱము కలిసి పోయితిమి. చివఱి గుహాలోఁ జీఁకటి కోణములో యెవరో కూర్చున్న ట్లున్నది. ఈ యైదుగుఱు నచ్చటఁ జచ్చి పడియుండిరి. మే మేమి చేయవలయును ? ఆవ్యక్తి యెవరు ? అది దయ్యమా ? పిశాచమా ? చాలఁ జీఁకటిగా నున్నది. ముందునకుఁ బోవు టకు నెవ్వరును సాహసించుట లేదు. ఇంతలో వెనుక నుండి గర్జనలు వినిపించెను. అవి భల్లూకముల యఱవులు. నాకు వెంటనే తెలిసెను. ఎట్లు దాటించినదో యయేపా భల్లూకము లను దాటించినది. అప్పుడే వానియందలి మంత్రశక్తి సడలి నది. అవి వచ్చుచున్నవి. తక్కిన యేడుగుఱకు ముందును వెనుకను నెఱుఁగరాని రెండు ప్రళయములు. నాకు ముందటి ప్రళయమే తెలియదు. నే నీ భల్లూకములనుండి తప్పించికొన వలయును. ఆ గుహాలలోని రహస్యములు వారికిఁ దెలియవు.

నేను పలుసార్లు వెలియోనానునింట నతిథిగా నుంటిని. నాకు గుహాలలోనున్న సర్వరహస్య ప్రదేశములు తెలియును. ఆ నాల్గవ గుహాలో నొకచోట నొక సన్ననియెడము కలదు. ఒక మనిసి దూరి దాఁగియుండవచ్చును. అచ్చట వెలియోనాను భార్య కొన్ని వస్తువులను దాచెడిది. ఆమె నాకది చూపించెను. అందులో మనిసినక్కి యుండవచ్చును. ఉన్నట్లెవ్వరికినిఁ దెలియదు. అది యొక గూటివంటిది. ఆ గూటి త్రోవ వెనుకనుండి యున్నది. నే నందులోనికిఁ బ్రవేశించితిని. నేనేమైతినో గూడఁ దక్కినవారికిఁ దెలియదు. నేనచటినుండి బైటజరిగెడి విచిత్రమయిన వధనుఁ జూచితిని. ఆ యేఁడుగురు యోధులు భల్లూకములమీఁదికిఁ గత్తులతో దూకిరి. భల్లూకములతోఁ గత్తియుద్ధము చేయుదురా! వచ్చిన భల్లూకములు నాల్గు. అవి వీరిమీఁదబడి కఱచుచున్నవి. వీరిలో నెవఁడయినను జీఁకటిలోనున్న వ్యక్తికి దగ్గఱగాఁ బోయినచో నావ్యక్తి యెట్టిదో తెలియదు. వానిని సగ్గఱికి లాగికొని మెడ పిసికి చంపుచున్నది. ఇది చాలసేపు జరిగినది. భయమెఱుఁగనినాకు భయమువేసినది. కొంతసేపటికందఱును మరణించిరి. మిగిలినవి భల్లూకములు, నా చీఁకటిలోనున్న దయ్యము. ఆ దయ్యమా చీఁకటిలోనుండి బైటికిరాదు. నేను దాఁగియున్న స్థలమునందుండి నన్ను దయ్యము గ్రహించలేదు. ఆ దయ్యమున్నచోటున నుండి కదలలేదని నాకుఁ దెలిసినది. ఈ భల్లూకములకు నా యున్నచోటు తెలియదు. అప్పటినుండి మఱియొక విచిత్రమైన కథ యారంభ మయ్యెను. ఆ చీఁకటిలోనున్న వ్యక్తినిఁ జూచి భల్లూకములు గర్జించును. దానివద్దకుఁ

బోఁబోవును. భయపడి వెనుకకు వచ్చుచుండును. ఒక భల్లుకము మిక్కిలి దగ్గఱకుఁ బోయినచో నా లోనున్న వ్యక్తి గాఢముగఁ దాడించును. ఆ భల్లుకము యమబాధపడుచు నేడ్చుచు నివతలికి వచ్చును. ఆ భల్లుకము లెందుకుఁ బాఱిపోవు. ఆవ్యక్తి యచటినుండి యేల కదలదు? నాకేమియుఁ దెలియలేదు. క్రమక్రమముగ గుహాంతరాళమున గాఢములయిన చీఁకట్లు క్రమ్ముకొనుచుండెను. అప్పటికే కనిపించుట యన్నది దూరమయ్యెను. పండ్రెండు శవములు, నాల్గు భల్లుకములు, ఒక పిశాచము. బ్రదికియు బ్రదుకకయున్న నేనా ఱాతిగూటిలో. ఇది నా పరిస్థితి. మహాపండితుఁ డయిన యో బ్రాహ్మణుఁడా! దీని నెవ్వరు నమ్మరు. ఇట్లుండునని యనుకొనరు. నేనేదో కలిపించి వ్రాసితిననుకొందురు. సృష్టిలో నందఱకు నన్ని యనుభవములు కలుగవు. అందఱునుఁ దమ యనుభవములోనున్న దానినిఁ గుఱించి విశ్వసించరు. సామాన్యులయిన జనులు పిశాచములను మంత్రములను నిట్టి భీభత్సములను విశ్వసించరు. నేనేమిచేయుదును? నా యనుభవమును నేను కాదనుట యెట్లు? అప్పుడు నాకొక్కటే తాపకమయినది. నేను యవనుఁ డనయిన తరువాత నే నుపాసించుచున్న మహాదేవతా మంత్రము నుచ్చరించుటకు యోగ్యుఁడను గాననుకొని యా మంత్రమునుఁ బరిత్యజించితిని. ఇప్పుడు నేను యవనుఁడను. తన్మంత్రధ్యానమునకు నావద్ద యోగ్యతయున్నదో లేదో తెలియదు. అయేషా నన్ను నిజముగాఁ బ్రేమించలేదు. స్త్రీల చిత్తములు దుర్గ్రాహ్యములు. దానివలపు కాఁడింకెవ్వఁడో యుండియుండవల

యును. అది మఱెవ్వరిని సర్వ యవనరాజ్య సింహాసనాధ్యాసితునిఁ జేయ నెంచినదో? ఈ మూలనున్న పిశాచము దాని చేత నిర్మితమయినది. ఔను, కాదు, నాకెందుకు? నే నస్మత్ప్రాక్ప్రోపాస్య వృద్ధభార్గవీ మంత్రధ్యానపరుఁడనై యుంటిని. నా యొడలు నాకుఁ దెలియదు. ఎంతకాలము కడచెనో నాకుఁ తెలియదు. మఱల గుహలోనికి సూర్యకిరణ ప్రసారము సాగినది. గుహాయంతయు విస్పష్టముగఁ గనిపించుచున్నది. నాకు స్మృతి వచ్చినది అచట నొక భల్లూకమును లేదు. ఆ మూలనున్న పిశాచములేదు. పండ్రెండు శవములచ్చటఁ బడియున్నవి. నేను సాహసించి బైటికి వచ్చితిని. నాల్గు గుహలు దాటితిని. దుబ్బులమీఁదనుండి గుహాబిలమునుండి వెలికి వచ్చితిని. ఇంటికిఁ బోయితిని. అయేషా కూర్చున్నది. ఆమె యిట్లన్నది! నీవు మహామంత్రవేత్తవు. నాకుఁ దెలియును. నీవు బ్రతికివత్తువని యెదురు చూచుచుంటిని. వచ్చితివి. రేపు నీకు సర్వ యవనరాజ్య పట్టాభిషేకము జరుగును. ఇది కథ— మిత్రమా.

## ౧౪

అశ్వమేధయాగ సమాప్త సర్వభారతదేశ సామ్రాజ్యాధిపత్య వైభవ విరాజితులకు శ్రీ పుష్యమిత్ర మహారాజుల పాదాంభోజ సన్నిధికి. తమ మేనల్లుఁడు సోమశర్మ వినయపూర్వకముగా వ్రాయుచున్న లేఖ. ఇది నా చివరి లేఖ. నే

నింకఁ దమకు మఱల వ్రాయుట యుండదు. ఇపుడు నాస్థితి చమత్కారముగా నున్నది. నేనొక స్త్రీ పిశాచముయొక్క యుదువులో నుంటిని. వృద్ధభార్గవి నన్ను వదలిపోయెను. ఆనాఁటి గుహాలో నా మహాపదనుండి రక్షించినది. మఱల నామెకు నాకును సంబంధములేదు. ఆనాఁడు మహాదేవి నన్నెందుకుఁ గరుణచూచినదో తెలియదు. నాకాశక్తిపోయిన దని యయేషాకుఁ దెలిసినది. తెలియుటకు రెండేండ్లు పట్టినది. ఈమె స్త్రీకాదు. అదియొక పిశాచాకృతి. ఆమెకు నాయందు వలపులేదు. ఆమె కవిదితమయిన యొక శక్తి నాయందున్న దని యామె గ్రహించి యీనాల్గయిదేండ్లు నాతో నాటక మాడినది. ఆకథతోఁ దమకవసరములేదు. మేధ్యాశ్వ వపాస్థా పియమయిన పరమ హావిశ్శేష భుక్తిచేత నత్యంత పవిత్ర భూతమయిన హిరణ్యగర్భాభమైన తమ యాత్మకిట్టి తుచ్ఛ మయిన మ్లేచ్ఛకథఁ జెప్పుటకు నేను సాహసించుటలేదు. నా జన్మ మపవిత్రమైనది. బీభత్సరసమయ మైనది. అందుచేతనే కాఁబోలు, భగవంతుఁడు దాని చిహ్నముగా నాకిట్టి పరిస్థితు లనుఁ గల్పించెను. నే నొక్కదానికి సంతోషించుచున్నాను. ఇంకను భగవంతునకు నాయందుఁ గరుణ కలదు. ఏలయనఁగా నాబ్రదుకు మ్లేచ్ఛమైనందులకు నేను యువనుఁడ నయినందు లకు నిదియంతయు నొక జీవునియొక్క ప్రయాణములో బీభత్స విషయ మగుటచేత దానికిఁ బ్రతీకగా నాబ్రదుకులో నన్నియు బీభత్సఘట్టములనే కల్పించుచుండెను. ఇందులో నాయెడల భగవంతుని కరుణ యెట్లున్నదని తమరు శంకింతురేమో ఉత్తముఁడయిన బ్రాహ్మణ కులజుఁడు మ్లేచ్ఛుఁడై యవనమత

మును స్వీకరించుట యన్నది యొక జీవుని యాత్రావిషయ
మున నట్టిది? బీభత్సరసమయమైనది. కర్మభ్రష్టుఁడై యాచార
హీనుఁడయి దుష్టమాంసభోక్తయై దిక్కాలమయమయిన
పరమేశ్వర భావమునుండి బాహిరుఁడయి యా జీవుఁడు పోవు
చున్నాఁడు. ఇంతకంటె బీభత్స మేముండును? ఎవనియందుఁ
బరమేశ్వరుఁడు దయావంతుఁడు కాఁడో వాఁడిట్లు మతా
తంరుఁడయ్యును, జీవితమునందు బాహిరములయిన లౌకికము
లయిన బీభత్సవిషయముల ననుభవించఁడు. వానిజీవయాత్రా
గతమయిన బీభత్స లక్షణమునకు వాని బ్రదుకు వ్యంజకముగా
నుండదు. వాఁ డధఃపతితుఁ డగును. పరమేశ్వరుఁడు నా
జీవున కేదో నిష్కృతి కల్పింప నెంచుచున్నాఁడు. కాన
నాలోనున్న జీవలక్షణమునందుఁ గల యా గర్హ్యోలును
బయటఁ గూడఁ బ్రతిబింబించునట్లు చేసినాఁడు. నా
జీవునకు జాగ్రదవస్థ కల్పించినాఁడు. ఏదో పూర్వజన్మకృత
మహాపాపవశమున నాకీస్థితి కల్గినది. అనుభవించితిని. అనుభ
వింతును. భవిష్యజ్జన్మలు మఱల సుకృతాధ్యమున నే ప్రవర్తిం
చును. ఇది నావంటివారి జీవితములకు నేను జేయు వ్యాఖ్య.
ఎవఁడో మ్లేచ్ఛమతమును స్వీకరించి దానియందుఁ దృష్టి
వహించి మతాంతరుఁ డయిన తరువాత జీవితమునందు సుఖ
ములనుభవించువాఁడు భ్రష్టజీవుఁడు. వానికి నిష్కృతిలేదు.
నాకు నిష్కృతి కలదు. నా యిప్పటి కథతోఁ దమకు సంబం
ధము లేదు. నేను దానినిఁ గూర్చి చెప్పను. తమకు నేను వ్రాయ
వలసిన సంగతి యొకఁ డున్నది. దానికొఱకే లేఖ వ్రాయుచు
న్నాను. తమరి యశ్వమును నేను దొంగిలించితిని. అది యా

తేడేండ్ల క్రిందటి మాట. ఆయశ్వమును నేను రక్షించలేకపోయితిని. దాని హింసకుఁ బ్రతిక్రియ చేసితిని. తత్ప్రతిక్రియా బుద్ధి నిర్వహాణముకొఱకే మ్లేచ్ఛుడఁ నైతిని. మ్లేచ్ఛుఁడనైనఁ గాని యా ప్రతిక్రియ నేను జేయుటకు సాధ్యము కాకపోయెడిది. దీనినుండి వ్యక్తమగుచున్న మహార్థమేమి? ప్రతిక్రియా బుద్ధి మ్లేచ్ఛమని వ్యాఖ్యాత మగుచున్నది. ప్రతిక్రియ మ్లేచ్ఛభావము. ప్రతిక్రియతో మానవున కేమి సంబంధము? నాకు సంబంధము కల్గినది. నేను మ్లేచ్ఛుఁ డనయితిని. ఆ ప్రతిక్రియ పరమ తీవ్రముగాఁ జేసితిని. దానినిఁ దమకుఁ దెలియ జేయుట నా మ్లేచ్ఛబుద్ధినిఁ దెలియఁ జేసికొనుటయే యైనను, నా కృతఘ్నతకుఁ గొంత నిష్కృతి కలిగించుకొనుటయన్న తాత్పర్యమున తెలియఁ జేసికొనుచుంటిని. ఆనాఁడు తమచేత విసృష్టమైన మేధ్యాశ్వము యవన భూములను సమీపించినది. యువరాజయిన యగ్నిమిత్రుఁడు గుఱ్ఱమునుఁ దన దృష్టినుండి పోనిచ్చుటలేదు. ఆ గుఱ్ఱమును నేను బట్టించినచో నతఁడు దూరమున నుండియే తన ధనుస్సునుండి వదలఁ బెట్టబడిన బాణములచేత సంహరించును గుఱ్ఱమునుఁ బట్టికొనుట సాధ్యముకాదు. అందుచేత నయేషా దగ్గఱనున్న యొక మంత్రమును బ్రయోగింపించి యశ్వము యువరాజు దృష్టికిఁ గనిపించకుండఁ జేయించితిని. ఆ గుఱ్ఱమునుఁ దెచ్చితిని. గుఱ్ఱము కనిపించక సగరసుతులవలె, నుపవర్గాదు లటమటించుచుండిరి. ఆ గుఱ్ఱము వచ్చువేళకుఁ బూర్వపు గుఱ్ఱమును యవనులెచ్చట బంధించిరో యెచట దానిని హింసించిరో యా స్థలమునందుఁ నొక విచిత్రమైన పరిస్థితినిఁ గల్పించి

యుంచితిని. నేను యవనదేశ చక్రవర్తిని. నా కిచట సాధ్యము కాని దేమున్నది? కనుమత్రోవ కాపుదలకుఁగల నలుఁబది మందిలో నల్వురు నాకు వశులు. తక్కిన ముప్పది యూఱు పరిమీఁదనే నేను పగతీర్చికొనుట. వారికి నే నీ సంగతి మఱచిపోయితినని యనిపించినది. ఆ ముప్పది యూఱుగుఱు చాలరన్నట్లు కాటి ముప్పదిమందినిఁ గనుమత్రోవ కాపుదలకు నియమించితిని. ఈ దేశములో నొక క్రీడగలదు. ఎందఱో కొందఱు చెఱుసగముగా రెండుపక్షము లగుదురు. చిన్న చిన్న గులకఱాళ్ళతో నొకయాట యాడుదురు. అది పెద్దయాట. అటు వందమంది, యిటు వందమంది యుండి గూడ నాడవచ్చును. ఓడిపోయినవారు గెలిచినవారికి దాసు లగుదురు. వారిని వీరు బంధింతురు. బంధించుట యనఁగా నిజముగా బంధించుటయే. కొంతసేపట్లు బంధించి మఱల విడిచిపెట్టుదురు. మఱల నాడుదురు. ఇది యీ దేశములం దున్న యొక క్రీడావిశేషము. వృద్ధులకడనుండి బాలురవఱ కీక్రీడ యాడుట కలదు. నేను క్రొత్తగా నియమించిన కనుమ త్రోవ కాపరులయిన ముప్పదిమందియు నా భక్తులయిన నలుగుఱును గలిసి యొక పక్షము. తక్కిన ముప్పది యూఱుగు ఱొకపక్షము. గుఱ్ఱ మచ్చటికి వచ్చిన దనఁగనే వారీయాట యాడునట్లు నియమించితిని. అయేషా తన మంత్రశక్తిచేత వీరిని గెలిపించినది. ఆ ముప్పదిమందిలో నామె యన్నలు పదిమందియుఁ గలరు. పూర్వ మా యశ్వము హింసించఁ బడినచోట ముప్పదియూఱు గుంజలు పాతింపఁబడి యున్నవి. ఆ ముప్పదియూఱుగుఱిని నరములతో నా గుంజలకు వారే

బంధించి యుంచిరి. గుఱ్ఱముతో నేను నయేషాయు నచ్చటికిఁ బోయితిమి. నేను వెనుక నొక యుత్తరములో నొకసంగతి వ్రాసితిని. ఆమె యొక పాటపాడును, ఏజంతువయిన నృత్యము చేయును. ప్రతి చరణాంతమున నామె యాపాట చివరియక్షరమును విడలించిన స్వరముతోఁబాటు జంతువు వెనుగాళ్లఁ గాలిలోఁ జిమ్మునని. ఈ కవల యశ్వము దానియంతట నది యీ ప్రదేశమునకు వచ్చెను. ఏడేండ్లక్రిందఁ దన యనన్నగారు వధింపఁబడిన ప్రదేశముఁ జూచెను, ఆ గుఱ్ఱము క్రోధస్వరూప మయ్యెను. వెంటనే యయేషా తన కీర్తన నందికొనెను. ఆ గుఱ్ఱము నాట్యముచేయ నారంభించెను. చరణాంతము వచ్చెను. అట్లు బంధింపఁబడిన ముప్పదియాఱు మందిలో నొకొక్కనివద్దకుఁ బోవును. చరణాంతమునందలి యూపుతో వాని చిబుకమును దాడించును. వాని దవడలు పగులఁదన్నును. వాని నాసారంధ్రములనుండి రక్తము ధారగా స్రవించునట్లు పాదతాడనము చేయును. మఱియొకని నెమరు కణతల యందుఁ గొట్టును. ఒకని ఱొమ్మునందు రెండు కాళ్లెత్తి యశనిఘాతమును చేయును. అయేషా పాడుచున్నది. నే నచ్చట నున్నాను. నా పక్షమునందున్న ముప్పదినాల్గు మంది చూచుచున్నారు. ఆ నల్గురికి ప్రతిక్రియా వైఖరిలోని రహస్యము తెలియును. అయేషా చరణము విడుచు చుండును. గుఱ్ఱి మారక నృత్యముచేయును. చరణాంతమున గదా నది తాడించుట. ఈ లోపుగా నేను వారితో ననుచుంటిని. ఓరీ! ఆనాఁడు మీరు నన్ను బంధించి హింసించి చిత్రవధచేసి కోసికొని తిన్న గుఱ్ఱము నిదియుఁ గవలలు. పుష్పామ్మోత

మహారా జశ్వమేధయాగము చేయుచున్నారు. ఇది యాయన వదలిపెట్టిన గుఱ్ఱము. ఆ యశ్వవధకుఁ బ్రతిక్రియ చేయుటకే యీ యశ్వ ముపయోగించినది. ఓరీ! యిప్పుడు నేను మీకు రాజను. మిమ్ము వేయివిధములుగా వధించఁ గలను. మిమ్ముఁ గొండశిఖరము లెక్కించి కూలఁద్రోయింపఁ గలను. కత్తికిఁ గండగాఁ గోయించఁగలను. అట్లు చేయుట లేదు. నా రాజాధికారమును మీమీఁద వినియోగించుట లేదు. మీ రెట్టికర్మ యాచరించితిరో యట్టి శిక్షయే మీకుఁ జేయుచున్నాను. నేను జేయుట కాదురా. పశువులారా! పరమేశ్వరుఁ డిట్టి శిక్షయే చేయును. ఏ దేశములో వాఁ డా దేశములోఁ బండినదానిఁ దినవలయును. పండించుకొన వలయును. లేనిచోఁ బోయి యాచింపవలయును. పరదేశ ములమీఁద దాడులుచేసి యూళ్ళనుఁ గొల్లగొట్టుదురా? పశుబాలవృద్ధులను హింసింతురా? సంహరింతురా? ఏమిరా? మీ మ్లేచ్ఛుల యాగడములు? మానవుడు చేసిన యిట్టి యాగడములను పరమేశ్వరుఁ డెప్పు డేరీతిని శిక్షించునో తెలియదు. ఒకజాతి యింకొకజాతిని నిర్మూలించును. రెండువందల యేండ్లు సాగును. మూఁడువందల యేండ్లు సాగును. తరువాత భగవంతుఁ డీజాతి నెట్లు శిక్షించునో యెవఁడు చెప్పఁగలఁడు? భగవంతుఁ డా జాతి కట్టి శిక్షయే కాలాంతరమున విధించును. జాతి జాతిగాఁ జేసినప్పుడు, జాతికి శిక్ష. మీరలె గుంపుగాఁ జేసినప్పుడు, గుంపునకుశిక్ష. వ్యక్తిగాఁ జేసినప్పుడు, వ్యక్తికి శిక్ష. భూకంపములు వచ్చును. ప్రళయ ప్రభంజనములు వీచును. నదులు పొంగును. సము

ద్రవములు పొంగివచ్చెను. అగ్నిపర్వతములు పగిలి యెఱ్ఱగాఁ గఱగిన జాళ్లు ప్రవహించును. చె.వ్రాటకు వీలులేని మారణాయుధములు విచిత్రముగాఁ బ్రయోగింపఁబడును. ఇది పరమేశ్వర లీల. భగవంతుని కోపము. ఆభగవంతునిమీఁదిపగ యెందులకు? వేదములు భగవత్స్వరూపములు. పురాణములువాని మాఱుట రూపము. పురాణములమీఁద వైరమా? పురాణకథలు కావా? సృష్టిని మీకురా చేసినది? మీ మీఁది పగను నే నెట్లు తీర్చుచుంటినో చూడుడు. మిమ్ము శిక్షించుటకు నేను మీలో వాఁడనైతిని. భగవంతుఁడు చేయు శిక్షలలో నిది యొకటి విలక్షణమయిన మార్గము. హిరణ్యకశిపుని శిక్షించుటకు వాని కొడుకయిన ప్రహ్లాదుని భక్తునిఁ జేసినాఁడు. అట్లు మిమ్ము శిక్షించుటకు నన్ను యవనునిగాఁ గల్పించినాఁడు. నాయందు మీకు నమ్మకము గలిగించినాఁడు. ఇట్టి క్రీడను మీయందొక దాని నేర్పాటుచేసి యుంచినాఁడు. నే నీ మాటలనుచుంటిని. గుఱ్ఱము ఫెడేలు ఫెడేలుమని తన్నుచుండెను. ఆయోషాయొక్క పిశాచాత్మ యెంత సంతోషించుచున్నదో! ఎప్పుడు నాకుఁ దెలియలేదు. ఆమె ముప్పది యాఱు సైనికులు శవములగు నట కాపాట నాపలేదు. ఈ ప్రతీకారకథ యగ్నిమిత్రునకుఁ దెలియదు. ఉపవస్షునకుఁ దెలియదు. వారినిఁ జూచుట నాకిష్టము లేదు. అగ్నిమిత్రునకు నేను గనిపించినచో 'బావా' యని వచ్చి నన్నుఁ గౌఁగిలించి కొనెడివాఁడేమో? నేనా మహాయోగపురుషుని శరీరమును మత్స్పర్శచేత నెందుకుఁ గలుషితము చేయవలయును? నేను యవన సామ్రాజ్యాధిపతి నగుటచేత, నుపవస్షుఁడు నన్ను గౌర

వించెడివాఁడేమో? ఆయనచేత గౌరవింపఁబడిన పాపము నే నెందుకుఁ జేయవలెను? ఆ నలువురు పూర్వాశ్వహింసకులు మద్భక్తులు, నిజముగా నాహింసలోఁ బాల్గొననివారునయిన వారిచేత నశ్వమును దిరిగి పంపించి యగ్నిమిత్రున కప్పగించితిని. వారిద్దఱు నన్నుఁ జూడవలయు నన్నారట. మాచక్రవర్తి యిప్పు డిచ్చట లేఁడు. ఆయన పరదేశములం దున్నాఁడు. ఈ మేధ్యాశ్వము వచ్చినచో నెవ్వరమును దానిని బంధింప రాదని యాజ్ఞాపించినారు. ఆజ్ఞోల్లంఘనముచేసి యెవఁడయిన బంధించినాఁడో వానిని బంధించి యీ యశ్వము తమరిది తమరికి నప్పగించుఁడని మా కాజ్ఞాపించినాఁడని చెప్పించితిని. ఇది నాకథ. మీయశ్వమేధకథ. నేనువ్రాసిన యుత్తరములన్నియు నొకచోటఁ బెట్టినచో నేను జేసిన కృతఘ్నతయుఁ దన్నిష్కృతియు నా పాపమును దాని లక్షణమును బ్రాహ్మణపతమును మ్లేచ్ఛభావమును సర్వమును బుద్ధిమంతులకు వ్యాఖ్యాతములగును. నాజీవుని భవిష్యత్తు నాకుఁ దెలియదు. అచ్చముగ నే నధోలోకములకుఁ బోదునని నే ననుకొనుట లేదు. కాని మహారాజా! నాలో నొక విచిత్రమయిన కదలిక కల్గుచున్నది. ఏదో మార్పు కలుగుచున్నట్లున్నది. నన్నింతటితో భగవంతుఁడు వదలిపెట్టునన్నట్లు తోఁచుటలేదు. వెలియోనసుల జీవులువచ్చి నన్నావహించి నట్లున్నది. నేను మఱల వారు చేసెడిపనినిఁ జేయవలసిన య[illegible]ంతుని యభిప్రాయమేమో? ఆపని యేమనఁగాఁ దెలసి చేసెడి వైదిక ద్వేషము, తెలిసి సాధింపఁబూనెడు పురాణవైరము.

యే డ వ న వ ల !